# అపరాధ పరిశోధన

రు. 3-50 సెప్టెంబర్ '78



అపరాధ పరిశోధన అనుబంధం—57

# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## శవరంజని

రచన : 'సికిందర్'

## వేషం చూసి మోసపోకండి!

రచన : వసుంధర

## అంతులేని వింత శిక్ష

రచన : నుసర్ల సర్వేశ్వరశాస్త్రి

## దురభిమానులు!

రచన : ఏ. వీ. మోహన్రావ్

'అంగారక'-మూడవ భాగము

అపరాధ పరిశోధన సప్లిమెంట్ —57
సెప్టెంబర్, 1978
వెల : రు. 3_50
ఏడాది చందా 45 రూపాయలు
జీవితచందా 250 రూపాయలు



కార్యాలయం :
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు_29
ఫోన్_36959

ముద్రణ :
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు_1.

2-9-78

# శవరంజని

'సికిందర్'

లాల్ ఆఫీసులో ప్రవేశిస్తోండగా జాన్ తల ఎత్తిచూసి నిటారుగా కూచొని అడిగాడు, "లాల్ ఆకాశంలో తారలు ఎందుకు మిణుకు మిణుకుమంటాయి?"

లాల్ భుజాలెగరేసి, నోట్లోంచి సిగరెట్ తీసి నవ్వుతూ చూసి, "తారలనుంచి కాంతి భూమిని చేరడానికి రకరకాల సాంద్రతలున్న యానకాలద్వారా ప్రయాణించవలసి వుంటుంది. తత్ఫలితంగా వక్రీభవనం చెందుతుంది. ఈ వక్రీభవనమే మిణుకు మిణుకుమనడానికి కారణం" అన్నాడు.

జాన్ మరొక ప్రశ్న వేశాడు. "వేడినీటి స్నానం చేశాక బూట్లు తొడగడం ఎందుకు కష్టమవుతుంది?"

లాల్ ఉత్సాహంగా ఈల వేసి, "వేడినీటివలన రక్తం పొంగుతుంది. చర్మం దళసరి అవుతుంది. అందువల్ల కాలు ఉబ్బుతుంది. కాబట్టి బూట్లు ధరించడం కష్టమవుతుంది" అన్నాడు. "సరే, సంగతేమిటి? జాన్? ఏమిటీ

ప్రశ్నలు...?"

జాన్ అడ్డంగా తల వూపుతూ, "మరొక ప్రశ్నకు జవాబివ్వు" అన్నాడు. "శీతాకాలంలో నీటిగొట్టాలెందుకు పగులుతాయి?"

అసహనంగా చూశాడు లాల్. "జాన్, ఏమిటీ న్యూసెన్స్? విషయమేమిటి?"

"నా ప్రశ్నకి జవాబివ్వు," జాన్ రెట్టించాడు.

లాల్ మింగేసేలా చూశాడు. "నా జనరల్ నాలెడ్జిని పరీక్షించదలుచుకుంటే అభ్యంతరంలేదు. సరే, నీ ప్రశ్నకి జవాబు ఇది: చలికాలంలో నీరు గడ్డకట్టి ఘనపరిమాణం హెచ్చుతుంది. అప్పుడు దాని వత్తిడి గొట్టం గోడల మీద పడుతుంది. నీరు గడ్డకట్టి అలా వ్యాకోచించడం వల్ల గొట్టాలు పగులుతాయి. వెల్, ఇక చెప్పు, నీ ప్రశ్నలోని మర్మం ఏమిటి?"

జాన్ నవ్వాడు. "మరొక ప్రశ్న?"

"చంపేస్తాను."

"ముందు నా ప్రశ్న విను" జాన్ అన్నాడు. "నా మూడు ప్రశ్నలకి చక్కగా సమాధానాలిచ్చావు.అలాగే ఈ ప్రశ్నకి జవాబివ్వు. ఏమీ ఎరుగని అమాయకమైన అమ్మాయి, తన కూతురు ఎందుకు అదృశ్యమైందని మిస్టర్ భూపతిరావ్ అడుగుతున్నాడు" జాన్ నవ్వి మళ్ళీ అన్నాడు, "జవాబివ్వగలవా?"

లాల్, జాన్ కేసి సూటిగా చూశాడు.

"ఏమిటి జాన్, నువ్వన్నది?"

"ఏమీ ఎరుగని అమాయకురాలు, తన కూతురు ఎందుకు మాయమైందని మిస్టర్ భూపతిరావ్ అడుగుతున్నాడు" అన్నాడు జాన్.

“మనకెలా తెలుసు?” లాల్ అన్నాడు అయోమయంగా.

“ఇదే ప్రశ్న ఆతడిని అడిగాను.”

“ఏమన్నాడు?”

“దర్యాప్తు చేసి కనుక్కోమన్నాడు?”

లాల్ సోఫాలో చతికిలబడి, “కేసు ఒప్పుకున్నావా?” అడిగాడతను.

జాన్ తల వూపి “రెండువేలు అడ్వాన్సుకూడా తీసుకున్నాను” అన్నాడు.

లాల్ ఉషారుగా చూసి, “అమ్మాయిలు ఎందుకు అదృశ్యమవుతారో వూహించడం సులభం. సినిమా మోజులో పడి మద్రాసు చెక్కేయడంవల్లనో, ప్రేమ వలలో పడి ప్రియునితో ఎగిరిపోవడంవల్లనో, అదృశ్యమవుతుంటారు” అన్నాడు.

“ఇదే సమాధానం భూపతికి చెప్పాను” అన్నాడు జాన్. “ఈ రెండూ కారణాలు కావుట. ఆమె అమాయకురాలని మాటల సందర్భంలో వందసార్లు చెప్పాడు. చాలా అమాయకురాలు. అలాటి పనులు చేయదు. వయసు పదెనిమిది. చదువు: ఇంటర్ పూర్తయింది. నివాసం— పశ్చిమ గోదావరి జిల్లా కొవ్వూరు. నలుపురంగు, కోల ముఖం. కుడిచేతి మణికట్టుమీద పెద్ద పుట్టుమచ్చ—”

“ఆగు, ఏవూరన్నావు? కొవ్వూరు?”

“అవును.”

“భూపతి అక్కడనుంచి వచ్చాడా?”

“అవును.”

“మనం అక్కడికి వెళ్ళాలా?”

“తప్పదు.”

"షటప్!" అర్చాడు లాల్. "కేసులు మనిద్దరం సంయుక్తంగా అంగీకరించాలని నీకు తెలియదూ? ఈ ఏజెన్సీ లక్ష్యమేమిటి? ట్విన్ సిటీస్‌లో మాత్రమే సేవ చేయాలని కాదూ?"

"భూపతి ముఖం చూస్తే నువ్విలా మాట్లాడవ్!" నిర్లక్ష్యంగా అన్నాడు జాన్, "ఏజెన్సీ నడవడానికి కావలసిందేమిటి?డబ్బు! దాని ఉనికిలో మనకి పనేమిటి? ఇవిగో, రాజమండ్రీకి ఫస్టుక్లాస్ రిజర్వేషన్ టికెట్స్. ప్రయాణం నేటి రాత్రి. ఉదయంకల్లా చేరతాం.అక్కడ మన క్లయింటు టాక్సీతో సిద్ధంగా వుంటాడు. మనల్ని రిసీవ్ చేసుకుని కొవ్వూరులో తన ఇంటికి తీసుకెళతాడు. ఒక్క ముక్కలో చెప్పు! వస్తావా, రావా?"

లాల్ తల విదిలించి, "కేసు స్వరూపమేమిటి?"అనడిగాడు.

జాన్ లేచి నిలబడి ఫ్యాన్ స్విచ్ నొక్కి, కిటికీ లోంచి కింద రోడ్డు చూస్తూ అన్నాడు, "కుమారి రజని భూపతిరావ్ ఏకైక సంతానం. తల్లి వుంది. ఈ సంవత్సరం ఇంటర్ సెకండ్ క్లాస్‌లో ప్యాసయింది. రాజమండ్రిలో బి.యస్.సి. సీటుకోసం ప్రయత్నాలు జరుగుతుండగా వారం రోజుల క్రితం ఆమె అకస్మాత్తుగా అదృశ్యమైంది కొవ్వూరులో. ఆమె జాడ ఎవరికీ తెలియదు. తండ్రి పోలీసు రిపోర్టు యిచ్చాడు. లాభంలేక పోయింది. వాళ్ళింకా గాలిస్తోన్నారు. ఆమె అదృశ్యమవడానికి ప్రేమ గాని, సినిమా మోజు గానీ కారణాలు కావంటున్నాడు మిస్టర్ రావ్—"

"కిడ్నాపింగ్?" లాల్ అడిగాడు.

"కాదు. ఆమెని ఎవరైనా కిడ్నాపింగ్ చేసివుంటే

ప్రతిఫలం కోరడానికి ఇన్ని రోజులు ఆగరు. భూపతి పెద్ద భూస్వామి. అరవై ఎకరాల పొలం వున్నట్టు చెప్తున్నాడు. ఒకే ఒక్క వారసురాలు రజని. అందువల్ల ఆమెని కిడ్నాప్ చేసే అవకాశం వుందని చెప్పాడుగానీ, నాకు అది సహజంగా తోచలేదు. ప్రతిఫలంకోసం యే కిడ్నాపరూ వారం రోజులు ఆగడు. వీలైనంత త్వరగా బరువు దింపుకోవాలని చూస్తాడు.''

''కిడ్నాపింగ్‌లో ఆమె ప్రమాదవశాత్తు మరణించి వుంటే?'' లాల్ అడిగాడు.

''అసలు కిడ్నాపింగ్‌కి అవకాశం లేదు!''

లాల్ నవ్వాడు. ''కుటుంబ కారణాలవలన ఆత్మహత్య చేసుకునివుంటే?''

''నో! భూపతి కుటుంబంలో యెలాంటి కలతలు లేవు. రజనికి యెలాంటి లోటూ లేదు!''

''అయితే ఆమె అదృశ్యమవడానికి కారణమే లేదా?'' లాల్ అడిగాడు. ''ప్రతి సంఘటనకీ కారణం తప్పక వుంటుంది. రజని ఏ కారణమూ లేకుండా అదృశ్యమైందంటే, ఆమె అదృశ్యం కాలేదని అనుకోవాలి.''

''లాల్, వూహకందని కారణాలు కొన్ని వుంటాయి. అవి కనుక్కోడానికే మనల్ని నియమించాడు మిస్టర్ రావ్. మనం పల్లెటూరి బైతులం కాము. డిటెక్టివ్‌లం కదూ? నో, గెటప్!'' అన్నాడు జాన్.

## 2

భూపతిరావ్ ఆతిధ్యం డిటెక్టివ్‌లకి తృప్తి కలిగించింది.

భూపతిరావ్ లోలోన ఎంత ఆందోళనపడుతున్నా పైకి మాత్రం చాలా హుందాగా ప్రవర్తించి డిటెక్టివ్

లని అకట్టుకున్నాడు. వూరికి దక్షిణం వేపు అతనికి రెండంత స్తుల మేడ వుంది. డిటెక్టివ్‌లకి పైన ఒక గది కేటాయించాడు. రెండు నవారు మంచాలు, టేబిల్, కుర్చీలు రెండు, నిలువుటద్దం, బీరువా, సీలింగ్ ఫాను మొదలైనవి అమర్చివున్నాయి.

భూపతిరావ్‌కి నలభైఏళ్ళు. ఎప్పుడూ తెల్లటి దుస్తుల్లో వుంటాడు. చామనఛాయ రంగు. అక్కడక్కడ నెరిసిన వెంట్రుకలు.

అతని భార్యకి ముఫైఆయిదేళ్ళుంటాయి. కూతురు కన్పించకపోవడంతో ఆమె తెల్లటి ముఖం పాలిపోయి కళావిహీనంగా తయారైంది.

రజని అదృశ్యమవడానికి కారణం ఆ యింట్లో ఎవరూ చెప్పలేకపోతున్నారు. డిటెక్టివ్‌లు రకరకాల ప్రశ్నలు వేశారు. సమాధానాలు బాగానే వున్నాయిగానీ, వాటిలో క్లూ ఏమీ దొరకలేదు.

"మీ కూతురు స్నేహితులెవరు?"

"విమల, చంచల, సరళ. ఈ ముగ్గురితోనే స్నేహ మెక్కువ?"

"రజనిని చివరిసారిగా ఎప్పుడు చూశారు?"

"సరిగ్గా వారం రోజుల క్రితం—శనివారం ఉదయం పది గంటలకి."

"ఆమె ఏ దుస్తుల్లో వుంది?"

"నీలంరంగు లంగా, పసుపురంగు వోణీ."

"అంతకు ముందు ఆమె ప్రవర్తన ఎలా వుంది?"

"మామూలుగా వుంది. రోజూ సాయంత్రం ఆరుగంట లకి బయటికి వెళ్ళేది."

"ఎక్కడికి?"

"చెప్పేదికాదు. గంటలోపున తిరిగివచ్చేది."

"ఎన్నాళ్ళనుంచీ?"

"నాలుగు రోజులనుంచి. అయిదవరోజు అదృశ్య మైంది."

"రోజూ స్నేహితుల్ని కలుసుకునేదా?"

"అవును. వాళ్ళే ఇక్కడికి వచ్చేవారు."

"మీ దగ్గర ఆమె రహస్యాలు దాస్తుందా?"

"తెలియదు. గారాబంగా పెంచాం, మమ్మల్ని మోసం చేస్తుందనుకోము."

"శనివారం ఉదయం ఆమె ఏం చేసింది?"

"స్నానంచేసి, టిఫిన్ చేసి యేదో పుస్తకం చదువు కుంటూ పదిగంటలవరకు యిక్కడేవుంది. ఎప్పుడు బయటి కెళ్ళిందో మాకు తెలియదు. మేం చూళ్ళేదు. మధ్యాహ్నం వరకు ఎదురుచూసి స్నేహితుల యింటికి కబురు పంపాం. అక్కడికి రాలేదని చెప్పారు వాళ్ళు. ఇంటర్ పాస యింది. బి.యస్.సి. సీటు దొరక్కపోడు. ఆమె నిరాశ పడి యేదేనా అఘాయిత్యం చేసుకునే వీలులేదు. సాయంత్రంవరకు ఆమె జాడలేదు. వెంటనే పోలీసు రిపోర్టు ఇచ్చాం."

"ఆమె ఒంటిమీద నగలున్నాయా?"

"ఆమెకి నగలంటే ఇష్టంలేదు. మెడలో పూసల లాకెట్ వుంది."

"ఆమెకి పెళ్ళి ప్రయత్నాలు చేస్తున్నారా?"

"డిగ్రీ పూర్తయ్యేవరకు ఆ ఆలోచనే లేదు."

ఇక ఎన్ని ప్రశ్నలు వేసినా లాభంలేదనుకున్నారు డిటెక్టివ్‌లు.

ఉదయం ఎనిమిది గంటలకి ఉప్మా తిని, కాఫీ తాగి

తృప్తిగా తేన్చారు.

"లాల్, మనం ఇక్కడి ఇన్‌స్పెక్టర్‌ని కలుసుకోవాలి" అన్నాడు జాన్.

లాల్ తల వూపాడు. "రజని స్నేహితుల్ని కూడా కలుసుకోవాలి. కానీ, ముందు ఆమె గదిని పరిశీలించాలి."

భూపతి, లాల్‌నీ, జాన్‌నీ రజని గదిలోకి తీసుకెళ్ళాడు. గది చక్కగా అలంకరించి వుంది. మంచం, బీరువా, టేబిల్, కుర్చీ, నిలువుటద్దం, పడకకుర్చీ మొదలైనవి వున్నాయి.

లాల్, జాన్‌లు సోదాచేస్తూ బీరువా తలుపు తెరిచారు. వరసగా పేర్చివున్న పుస్తకాలు దర్శనమిచ్చాయి. వాటిలో చాలావరకు తెలుగు పాకెట్ బుక్స్ వున్నాయి. ఒక్కొక్కటి తీసి పరిశీలించసాగారు. ప్రముఖ తెలుగు రచయితల సాంఘిక నవలలతోబాటు కొన్ని డిటెక్టివ్ పుస్తకాలున్నాయి: కొమ్మూరి, గిరిజ, టెంపోరావ్... కుమారి చంచల...

డిటెక్టివ్‌లు తల విదిలించి భూపతిని చూశారు.

"ఈ కుమారి చంచల రజని స్నేహితురాలు. చాలా డిటెక్టివ్ నవలలు వ్రాసింది...వ్రాస్తోంది కూడా." అన్నాడు భూపతి.

లాల్ భుజాలెగరేశాడు.

భూపతి మళ్ళీ అన్నాడు. "మీరు డిటెక్టివ్‌లు. డిటెక్టివ్ సాహిత్యంలో ఆరితేరిన రచయిత్రి చంచల పేరు మీరు విన్లేదా?"

"విన్నాను." అన్నాడు జాన్. "వినడమే కాదు, చదివాను కూడా ఆమె నవల. కుమారి చంచల వ్రాసింది

'చావు చెప్పిరాదు!' చదివినట్టు జ్ఞాపకం. కానీ, అంతగా పట్టించుకోలేదు. ఆమె ఆరితేరిన రచయిత్రి అని తెలీదు.''

''ఇప్పుడు తెలిసిందిగా?''

''తెలిసింది. అలాంటి రచయిత్రిని మేం కలుసుకోవాలి.''

జాన్, భూపతిలు మాట్లాడుకుంటోండగా లాల్ గది సోదా చేయడంలో నిమగ్నుడయాడు. టేబిల్ సొరుగులో ఒక ఉత్తరాల కట్ట కన్పించింది. చకచక పరిశీలించాడు. అన్నీ వివిధ ప్రదేశాల నుంచి కలం స్నేహితులు వ్రాసిన ఉత్తరాలే. అది లాల్ దృష్టిని అంతగా ఆకర్షించలేదు. కానీ, వుత్తరాల మధ్య సరికొత్త వందరూపాయల నోటు అతడిని వులిక్కిపడేలా చేసింది.

సరిగ్గా అదేక్షణంలో భూపతి కళ్ళు ఆ నోటుమీద పడి నోరు తెరిచాడు, ''ఇది...ఇదెక్కడిది?''

లాల్ అతన్ని చూశాడు, ''మీరివ్వలేదా?''

జాన్ ముందుకు వచ్చి ఆ నోటు అందుకున్నాడు.

''వందరూపాయల కాయితం ఆమెకెన్నడూ ఇవ్వలేదు!'' భూపతి గొంతు బొంగురుపోయింది.

''రావుగారూ, పోలీసులతో మాట్లాడే విధంగా మాతో మాట్లాడితే మేం యీ కేసు వదులుకుంటాం. మా వల్ల మీ పరువుకు భంగం కలగదు. ఇప్పటివరకు మీరేవైనా ముఖ్యవిషయాలు దాచివుంటే, ఇకనైనా బయటపెడితే మీకే లాభం'' అన్నాడు లాల్.

''ఏమిటి మీరనేది! నేనేం దాచాను?''

''మీ కూతురు ఎవరినైనా ప్రేమిస్తోందో, లేదో నిజం చెప్పండి.''

''లేదు!''

"మేం మీ పరువు తియ్యం. మరొకసారి అడుగుతున్నాను—"

"ఎన్నిసార్లడిగినా నేను చెప్పేదొకటే: నాకు తెలిసినంతవరకు ఆమె ఎవరినీ ప్రేమించడం లేదు!"

"ఈ వూళ్ళో ఇంకెవరైనా కుర్రాళ్ళు అదృశ్యమైయారా?"

"మీ ఉద్దేశ్యం? నా కూతురు ఏ కుర్రాడితోనో పారిపోయిందా?"

"ఎందుకు పారిపోకూడదు?" అన్నాడు లాల్.

జాన్ కల్పించుకుని అన్నాడు, "తన కూతురు అమాయకురాలని ఆయన ఆఫీసులో వందసార్లు చెప్పారు, లాల్."

"గారాబంగా పెంచడంవల్ల అలా చెప్పారనుకుంటాను" అన్నాడు లాల్, "సరే, రావుగారూ, మీ భార్యతో మేం ఏకాంతంగా మాట్లాడాలి. మీరు వెళ్ళి ఆమెను పంపిస్తారా?"

"నా భార్యతో ఏం మాట్లాడతారు?"

"తండ్రికి చెప్పలేని విషయాలెన్నో తల్లికి చెప్తారు అమ్మాయిలు" అన్నాడు లాల్. భూపతి అదోలా చూసి వెనుదిరిగాడు. అతను అదృశ్యమయ్యాక లాల్ వేపు తిరిగాడు జాన్.

"ఏమిటి లాల్, ఈ వందరూపాయల మిస్టరీ?"

"తండ్రి ఆమెకివ్వలేదు. తల్లి ఇచ్చిందేమో కనుక్కోవాలి. ఇందులో మిస్టరీ ఏమీలేదు. ఇది సాధారణ విషయం. జాన్, వుత్తరాలు శ్రద్ధగా చదువు. క్లూస్ దొరుకుతాయేమో చూద్దాం. కుమారి రజనికి ఏయే విషయాలపైన ఆసక్తి వుందో తెలియవచ్చు—"

గదిలో భూపతిభార్య ప్రత్యక్షమైంది.

లాల్ మాటలాపేసి జాన్‌కి సైగచేశాడు. ఉత్తరాల కట్టపట్టుకుని బయటికెళ్ళాడు జాన్.

"రజనికి మీ రెప్పుడేనా డబ్బిస్తారా?" అడిగాడు లాల్ భూపతి భార్యని.

ఆమె చటుక్కున బయటికి వెళ్ళి నడవాలో అటూ ఇటూ చూసి తిరిగి వచ్చింది. లాల్ నవ్వి, "మీ భర్త ఇటు రాడు. భయపడకండి. జాన్ అతనితో వుంటాడు" అన్నాడు.

ఆమె లాల్‌ని తీక్షణంగా చూస్తూ, "లేదు ఎప్పుడూ ఇవ్వను!" అంది.

"ఎందుకని?" లాల్ అడిగాడు.

"ఆయన నాకిస్తే కదా, నేనామెకి ఇచ్చేది?"

"ఎందుకు ఆర్థిక స్వాతంత్ర్యంలేదా?"

ఆమె అడ్డంగా తల వూపింది. "నా కంటే ఆయనకి డబ్బు ఎక్కువ."

"ఓహో, క్షమించండి. రజని మీ కేయే విషయాలు చెప్పేది?"

ఆమె కోపంగా అంది. "ఉదయమేగా ప్రశ్నలడిగిండి! రాజీమీద బెంగతో నేనుంటే ఓదార్చేవారు లేరు! పైగా ప్రశ్నలడుగుతూ ప్రాణాలు తీస్తున్నారు! నాకు తెలుసు. రాజీ జాడ తెలుసుకోడం ఎవరికీ చాతకాదని. పోలీసులు చేతులు కట్టుకుని కాలక్షేపం చేస్తున్నారు. ఆ ఇన్‌స్పెక్టర్ దగ్గర కండబలం వుందిగానీ, బుద్ధిబలం లేదు!"

"మా దగ్గర బుద్ధిబలం వుందిగాని, కండబలం లేదు" అన్నాడు లాల్. "చూడండి, రజని జాడ మేం తెలుసు

కోడం మీకిష్టం వుందా, లేదా?"

"రాజీ! రాజీజాడ మీరు తెలుసుకుంటారా? ఆ బుర్ర మీసాల ఇన్‌స్పెక్టర్ గాలిస్తూనే వున్నాడు వారం నుంచీ. ఈ వారం రోజుల్లో ఆ విషయం పాతబడిపోయింది. మీరు ఆలస్యంగా వచ్చారు, ఏమీ చేయలేరు! ఏదో జరక్కూడనిది ఎప్పుడో జరిగిపోయింది!"

"మిమ్మల్ని ఓదార్చే వ్యవధి నాకులేదు. రజనికి వందరూపాయల నోటు ఎక్కడనుంచి వచ్చింది?"

"నాకేం తెలుసు! తండ్రి ఇచ్చాడేమో!"

"ఇవ్వలేదు."

"మరి? ఆమెకెక్కడ నుంచి వచ్చాయి వంద రూపాయలు? మీ అనుమానం ఏమిటి? ఇన్‌స్పెక్టర్ వచ్చి ఈ గది గాలిస్తే ఈ నోటు ఎందుకు దొరకలేదు?"

"మీ ఉద్దేశ్యం, ఈ గది గాలించాక నోటు ఇక్కడికి వచ్చిందా? ఎలా వచ్చింది? ఎవరైనా పెట్టారా? నిజం చెప్పండి, మీరే దాచారా?"

"ఏయ్, ఏమిటిది?"

లాల్ నవ్వాడు. "దూషణ మానుకోవాలి, సరే? మీ ఉద్దేశ్యం ఏమిటో నాకు చెప్పలేదు. ఇక నా ఉద్దేశ్యం చెప్తాను. ఆర్థిక స్వాతంత్ర్యం లేని స్త్రీ మీరు. మీ చేతికి డబ్బు అందితే దానికి ఎంత విలువ వస్తుందో మీకు తెలుసు. ముఖ్యంగా ఆ డబ్బు భర్త కంట బడకుండా జాగ్రత్త తీసుకుంటారు! చెప్పండి నా ఉద్దేశ్యం మీ కర్థమైందను కుంటాను, అలాటి ప్రయత్నంలో ఈ నోటు మీరిక్కడ దాచారా?"

ఆమె పూర్తిగా ఆశ్చర్యపోయింది. "ఏమిటీ పాడు ఆలోచనలు!"

లాల్ మళ్ళీ నవ్వాడు, "మీరు దాచకపోతే ఇన్‌స్పెక్టర్ సరిగా సోదా చేయలేదనుకోవాలి. నిజమేమిటో అతన్ని కలుసుకున్నాక తెలుస్తుంది. ఇక ఈ నోటు గురించి మరిచిపోదాం. నా ప్రశ్నకి సమాధానమివ్వండి: రజని మీ కేయే విషయాలు చెప్పేది?"

ఆమె కుదుట పడింది, "దానికి తెలివి ఎక్కువ. చదువులో కాదు, ఇతర విషయాల్లో. నలుగురొక చోట చేరి ఏదో విషయం చర్చించుకుంటే చాలు, ఇది మధ్యలో వెళ్ళి ఆ చర్చ ఏమిటో గ్రహించి, గడగడ వాగేస్తుంది. వినేవాళ్ళు విస్తుపోతారు. లోకజ్ఞానం ఎక్కువ. ఇక, సంవత్సరం నుంచీ ఏవో పాడు పుస్తకాలు చదవడం చూస్తున్నాను. ఏమిటవి అడిగితే ఏవో డిటెక్టివ్ పుస్తకాలని చెప్పేది. అవి నీ కెందుకూ అంటే ఆత్మరక్షణకు పనికొస్తాయనేది. చెప్పడం మరిచాను, వూరి బయట పొలాల మధ్య, పాడుబడ్డ యింట్లో దీని నేస్తం దెయ్యంలా కథలు వ్రాయడం మొదలుపెట్టింది. దానికీ దీనికీ మంచి స్నేహం. ఆ అమ్మాయి పేరు చంచల. రాజీ కంటే మూడేళ్ళు పెద్దది. రాజీని చెడగొట్టింది ఆమే!"

"ఎలా?"

"ఆమె కథలు వ్రాయడమూను, ఈమె చదవడమూను. చెడిపోక ఏమవుతుంది? అందుకేగా ఇంటర్‌లో క్లాసురానిది! ఈమెగారు పాడుపుస్తకాలు చదవడం ఆమెగారి పుణ్యమే."

"ఆమె అంటే మీకు కోపమా?"

"కోపమే కాదు, అది ఆడదేనా అన్న అనుమానం కూడా. ఆడవాళ్ళు యిలాంటి పాడుకథలు వ్రాయడం నేనెక్కడా చూడలేదు. ఉదాహరణకి యద్దనపూడి,

మాదిరెడ్డి కథలు చదవండి: అందులో హత్యలుంటాయా? దోపిడీలుంటాయా? మానభంగాలుంటాయా?''

లాల్ నిట్టూర్చాడు. ''చంచల గురించి వివరాలు చెప్తారా?''

ఆమె కొంగుతో ముఖం తుడుచుకుని అంది, ''రాజీ కన్పించని విషయం మా బంధువులెవరికీ చెప్పలేదు. వూళ్ళో రకరకాల పుకార్లు వున్నాయనుకోండి. అది ఎలాటి స్థితిలో తిరిగివస్తుందో ఆలోచించలేకపోతున్నాను. చంచలకి రాజీతో మంచిస్నేహం. సూర్యారావుగారి కూతురు చంచల. ఆమెకో తమ్ముడు కూడా వున్నాడు. బి. యస్ సి. వరకు చదువుకుంది. హిందీ విశారద పరీక్ష పాసయింది. ఉద్యోగం చేయాలనుకోడంలేదు, అలాగని పెళ్ళివిషయం ఎత్తడంలేదు. వ్రాతల్లో పడింది. తండ్రికి ఆమెగురించి ఎలాంటి పట్టింపూ లేదు.''

''వూరిబయిట, పొలాలమధ్య, పాడుబడ్డ ఇంట్లో... ఇది కాస్త వివరిస్తారా?''

నవ్విందామె. ''వాళ్ళకి ముప్పై ఎకరాల పొలాలున్నాయి. పొలంమధ్య ఎప్పటినుంచో చిన్న రెండంతస్తుల ఇల్లువుండేది. ఇప్పుడది శిథిలమైంది. రాత్రులు అందులో దెయ్యాలుంటాయో వుండవో గానీ, చంచల మాత్రం అందులో పగటిదెయ్యంలా గడుపుతుంది. ఆమె గురించి నేను చెప్పడం కంటే మీరు ఆమెని కలుసుకుని అడగడం మంచిది__''

''మంచిది. రజని కట్టుబట్టలతో మాయమైందంటారా?''

''అవును.''

''సరే, సరళ, విమల గురించి ఏమిటి?''

"మంచి అమ్మాయిలు. వాళ్ళకీ చంచల అంటే గిట్టదు."

"రజనికి చంచలతో స్నేహముంది. ఇది సరళ, విమలకి ఇష్టమేనా?"

"నాకు తెలియదు."

"మంచిది. ఇప్పుడు ఒకే ఒక ప్రశ్నకి సమాధానం చెప్పండి: తండ్రి దగ్గరగాని,మీ దగ్గరగానీ రజని ఏవేనా విషయాలు దాస్తుందా?"

"లేదు, లేదు!" అందామె వెంటనే. "దాని దగ్గర ఏ రహస్యమూ దాగదు."

"తండ్రికి చెప్పని విషయాలు మీకు చెప్తుందా?"

"చెప్పేదేదో మా ఇద్దరిముందే చెప్తుంది."

"ధన్యవాదాలు, మీరిక వెళ్ళవచ్చు" అన్నాడు లాల్.

# 3

జాన్ గబగబ వచ్చి లాల్ ని చేరుకుని, "ఏమిటి, ఏం జరిగింది?" అనడిగాడు.

లాల్ తలవూపి, "ఇన్ స్పెక్టర్ రజని గది సోదా చేసినప్పుడు ఈ వందరూపాయల నోటు కన్పించలేదు. ఆ తర్వాత అక్కడ దాన్ని ఎవరో పెట్టారు. అలా పెట్టడంలో ఏమిటి వుద్దేశ్యం."

"కేసును తప్పుదోవ పట్టించడం."

"వెల్, మనం ఇన్ స్పెక్టర్ ని కలుసుకున్నాకే నిర్ణయానికి రావాలి" అన్నాడు లాల్. "ఆ వుత్తరాల్లో ఏముంది?"

"లాల్, ఇలాటి వుత్తరాలు నేనెప్పుడూ చదవ

లేదు!" జాన్ అన్నాడు అలసటగా, "ఇవన్నీ పెన్ ఫ్రెండ్స్ వ్రాసిన వుత్తరాలే. అందరూ అమ్మాయిలే! మీ అభిమాన నటి ఎవరు? రచయిత్రి ఎవరు? ఎలాటి నగలంటే ఇష్టం? స్త్రీ స్వాతంత్రం మీద మీ అభిప్రాయ మేమిటి?...సో అండ్ సో, ఎ లాట్ ఆఫ్ నాన్సెన్స్ కానీ, ఒక్క వుత్తరం మాత్రం చంచల వ్రాసింది."

లాల్ కళ్ళు చిట్లించాడు. "ఏం వ్రాసింది?"

"మూడు నెలల క్రితం గుంటూరు నుంచి వ్రాసింది. సాంఘిక నవలలు వ్రాయడం తనకి చేతకాదనీ, డిటెక్టివ్ సాహిత్యంలో శిఖరాన్ని చేరుకున్న తన పేరు ప్రతిష్టలు పాతాళానికి జారుకోడం తనకిష్టం లేదనీ, తను వ్రాసే నవలలు వేలసంఖ్యలో అమ్ముడవడం తనకెంతో గర్వంగా వుందనీ, అంతకంటే అభిమానుల నుంచి వచ్చే వందల కొలది వుత్తరాలు తనని వుక్కిరిబిక్కిరి చేస్తున్నాయనీ, రజని ఇలాటి సమయంలో డిటెక్టివ్ కథలు మానుకుని సాంఘిక కథలు వ్రాయమనడం ఏమీ సబబుగా లేదనీ ఇలా ఎన్నెన్నో విషయాలు వ్రాసి చివరికి ఒక హెచ్చరికతో ముగించింది?"

"ఏమిటది?"

"డిటెక్టివ్ కథలు మానుకోమని రజని ఇలా మాటి మాటికీ వేధించడం తనకెంతో విసుగు పుట్టిస్తోందనీ, ఆమె అలా వేధించడం కేవలం ఈర్ష్య తప్ప మరేమీ కాదనీ, తన రచనలు విషయం మరొక్కసారి ఎత్తితే తమ స్నేహానికి ముప్పు తప్పదనీ హెచ్చరించింది."

లాల్ సాలోచనగా తలూపాడు. ఆ తర్వాత ఇద్దరూ పోలీస్ స్టేషన్ కి వెళ్ళారు.

ఇన్ స్పెక్టర్ డిటెక్టివ్ లని చూడగానే సర్దుకుని

కూచున్నాడు.

లాల్ జేబులోంచి విజిటింగ్ కార్డుతీసి టేబిల్ పైన పడేశాడు.

ఇన్‌స్పెక్టర్ కళ్ళద్దాలు పెట్టుకుని కార్డు చదివి, నెమ్మదిగా తల ఎత్తి ఇద్దర్నీ చూసి, "కూచోండి" అన్నాడు. లాల్, జాన్ కూచున్నారు.

"నా పేరు పోతరాజు" అన్నాడు ఇన్‌స్పెక్టర్ చెయ్యి ముందుకు చాచి. డిటెక్టివ్‌లిద్దరూ కరచాలనం చేసి నవ్వారు.

"మీరిక్కడికి రావడానికి కారణమేమిటి?" మళ్ళీ అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఒక మిస్టరీ ఛేదించడానికి వచ్చాం" అన్నాడు లాల్. "మిస్సింగ్ పర్సన్ కేస్" పోతరాజు భుజాలెగరేశాడు "రజని గురించా?"

"అవును. మేం చేసిన దర్యాప్తును బట్టి కేసు కొంత వరకు అర్థమైంది. అయితే మీతో ఒక విషయం మాట్లాడాలి."

"ఏమిటి?"

"రజని గది మీరు సోదా చేశారా?"

"అంగుళం వదలకుండా."

"రిజల్ట్ ఏమిటి?"

పోతరాజు అనుమానంగా చూశాడు లాల్‌ని, "మిమ్మల్ని భూపతి పిల్చాడా? ఆ విషయం నాతో చెప్పలేదే?"

"అతను నిన్న హైద్రాబాదుకొచ్చాడు."

పోతరాజు ముఖం మాడ్చుకుని, "నాతో యెందుకు చెప్పలేదో నాకు తెలుసు" అన్నాడు. "నా పరిశోధన

మీద నమ్మకంలేక మిమ్మల్ని పిల్చుకవచ్చాను. నాలోని లోపాల్ని ముఖంమీద చెప్పేవాళ్ళంటే నాకిష్టం. భూపతి ఆ సాహసం చేయలేకపోయాడు. ఛీ, పాడు జనం. పోలీసుల్లో అసలు విశ్వాసం లేదు!"

"ఎగ్జర్జన్సీ ప్రభావమనుకుంటాను..." అన్నాడు లాల్.

"సరే, మీకు దొరికిన క్లూస్ ఏమిటి?" అడిగాడు జాన్.

"నాకు దొరికిన క్లూస్‌లో ముఖ్యమైనది ఒక ఉత్తరం" అన్నాడు పోతరాజు. "ఆ ఉత్తరం రజని ఎందుకో ఆరంభంలోనే ఆపేసింది. తేదీ నెలరోజుల క్రిందటిది. ఆ ఉత్తరం ఆమె నాకు వ్రాయదల్చుకుంది—"

"మీకా?"

"నాకే. ఏ ఉద్దేశంతో వ్రాయదల్చుకుందో తెలియదు. విషయమేమిటో తెలియదు. అందులో మూడే మూడు వాక్యాలున్నాయి."

"చూపించండి."

పోతరాజు హెచ్.సి.కి సైగ చేశాడు. హెచ్.సి. పక్క గదిలోకెళ్ళి సేఫ్‌లోంచి ఒక ఉత్తరంతో తిరిగి వచ్చాడు—నీలంరంగు ఇన్‌లాండ్ లెటర్.

లాల్ ఆ లెటర్ అందుకుని పరిశీలించాడు. పైన అడ్రసులేదు. మడత విప్పాడు. అందులో యిలావుంది:—

కొవ్వూరు
26-5-1978

గౌరవనీయులైన సబ్-ఇన్‌స్పెక్టర్ పోతరాజు గారికి,

రజని నమస్కరించి వ్రాయునది...

ముఖ్యంగా మీకు తెలియజేయునదేమనగా—

ఆ తర్వాత లాల్‌కి అక్షరాలు కన్పించలేదు. "మిస్టరీ," అన్నాడు ఉత్తరం జాన్‌కి అందిస్తూ. "ఇన్‌స్పెక్టర్, మీ అభిప్రాయ మేమిటి?"

ఇన్‌స్పెక్టర్ ముక్కు పుటాలెగరేశాడు. రజని అనుకోకుండా అదృశ్యం కాలేదని, దాని వెనక చాలా కథ వుందని నా అభిప్రాయం. ఈ ఉత్తరం ఆమె నాకు వ్రాసిందంటే దేనికో భయపడుతుండాలి."

"అంటే, ఆమె నెవరైనా బెదిరిస్తున్నారా?"

"నాకు తెలియదు. ఈ వూళ్ళో అలాటి వాళ్ళెవరూ లేరు. ఇక్కడున్న కుర్రాళ్ళు చాలా బుద్ధిమంతులు."

"మరి ఆమె దేనికి భయపడుతోంది?"

"ఒక్కటి మాత్రం చెప్పగలను. సరిగ్గా నెల రోజుల క్రితం ఆమె ఈ వుత్తరం వ్రాసింది. ఒక అమ్మాయి పోలీసులకి ఏ పరిస్థితిలో ఉత్తరం వ్రాస్తుందో మీకు తెలుసు. ఆమె వుత్తరం వ్రాయడానికి కారణం ఏదో అపాయంలో చిక్కుకోవడం. కానీ, పూర్తిగా వ్రాయకుండా వదిలేయడానికి కారణం ఆమె ఎదురు చూసిన అపాయం తొలిగిపోవడం. అంతే, అయితే వారం రోజుల క్రితం అదే అపాయం అనుకోకుండా ఎదురైంది. మా దగ్గరికి వచ్చే వ్యవధికూడ ఆమెకి లేదు. అందుకే ఎక్కడో క్షేమంగా వుండే చోటుకి వెళ్ళిపోయింది. అదెక్కడో నాకు తెలియదు."

"ఒకవేళ మనం ఇలా వూహిస్తే?"

"ఎలా?"

"ఆమెకి క్షేమకరమైన చోటు పరలోకమైతే?"

"వాట్!"

"ఆశ్చర్యపడకండి. అది నా వూహ. వూహ ఎప్పుడూ

నిజంకానవసరంలేదు" లాల్ అన్నాడు మృదువుగా. "ఈ వూళ్ళో ఆరితేరిన డిటెక్టివ్ రచయిత్రి వుందిట?"

"చంచల" అన్నాడు ఇన్‌స్పెక్టర్. "గుడ్ గర్ల్— మంచి అమ్మాయి. తెలివి వుంది, అందం వుంది, కానీ ఒక్కటే లేదు—"

"ఏమిటి?"

"పెళ్ళి చేసుకోవాలనే ఆలోచన. సరే, మీరామె కథలు చదివారా? ఓహ్, ఎక్కడి అయిడియాలు! ఎక్కడి సస్పెన్సూ! సుపర్బ్! ఆమెముందు రచయిత లంతా బలాదూర్."

"ఆమె రచయిత్రి యెలా అయింది?"

"అది నాకు తెలియదు. నాకేదైనా సమస్య ఎదురయి నప్పుడల్లా ఆమె దగ్గరికి పరిగెడతాను. చక్కగా పరిష్కారం చూపిస్తుంది. ఆమెకి రోజుకి వంద ఉత్తరాలు వస్తాయి. అందరూ తమ సమస్యలకి పరిష్కారం కోరే వారే. వాటికి ఆమె సెక్రటరీ సంపత్ సమాధానా లిస్తాడు—"

"మరి రజని కేసుకి ఆమె పరిష్కారం చూపలేదా?" లాల్ అడిగాడు.

పోతరాజు పెదవులు చప్పరించి అన్నాడు. "ఆ ఉత్తరం గురించి ఇందాక నేను చెప్పిన అభిప్రాయం నిజానికి చంచలదే! ఆమె ఇంకా ఏం చెప్పిందో చెప్తాను వినండి: డిటెక్టివ్ పుస్తకాలు చదివే అమ్మాయిలకి ఆత్మ రక్షణగురించి తాపత్రయంవుంటుంది. లోకంలో అమ్మాయి లకి క్షేమకరమైన రోజులు కొరవడ్డాయి గనుక, తమ శక్తి సామర్థ్యాలతో తమని రక్షించుకోడానికి ప్రయత్ని స్తారు. ఇతరులమీద ఆధారపడేందుకు జంకుతారు. రజని

జాడ తెలిపే ఆధారాలేవీ లేవు కనుక ఆమె అదృశ్య మవడం ఆత్మరక్షణకోసం తీసుకున్న చర్యగా భావించవచ్చు. ఆమె గండం గడిచాక తప్పకుండా ప్రత్యక్షమవుతుంది.''

''ఆ గండం ఏమిటో ఆమె చెప్పిందా?''

''చెప్పింది. బ్లాక్ మెయిలింగ్ కావచ్చు.''

''ఎలా?''

''ఆమె ఎవరినైనా ప్రేమిస్తుండవచ్చు. తర్వాత తిరస్కరించి వుండవచ్చు. కాబట్టి ప్రియుడు బ్లాక్ మెయిలింగ్ చేస్తుండవచ్చు. కానీ ఆమె ఎవర్నీ ప్రేమిస్తున్నట్టు దాఖలాలు లేవు.''

''కిడ్నాపింగ్?''

''అవకాశం వుంది. కానీ, డబ్బుకోసంకాదు. ప్రేమకోసం, ఆమె తిరస్కారం పొందిన వ్యక్తి ఆమె ప్రేమకోసం కిడ్నాప్ చేసి, బెదిరించి సాధించుకోవచ్చు.''

''ఆల్ రైట్, ఇన్ స్పెక్టర్,'' లాల్ అన్నాడు నిట్టూర్చి. ''మేము చంచలను కలుసుకుంటే ఇంకా చాలా విషయాలు తెలియవచ్చు. మీ కింకా యేం క్లూస్ దొరికాయి?''

''అవి మీకు ఉపయోగపడవు.''

అనుమానంగా చూశాడు లాల్.

''నమ్మండి.'' ఇన్ స్పెక్టర్ అన్నాడు.

''ఆల్ రైట్, మేజా సొరుగు లాగి అందులోని ఉత్తరాలు పరిశీలించారా?''

''ఆ వుత్తరాల్లో ఏముంది?''

''ఉత్తరాల మధ్య వందరూపాయల కాయితం వుంది.''

"వాట్!"

"మీకు కన్పించలేదా?"

ఇన్‌స్పెక్టర్ అయోమయంగా చూశాడు. "నో! కన్పించలేదు! ప్రతి అంగుళం సోదా చేశాను!"

"మీరు సోదా చేశాక అక్కడెవరో బుద్ధిపూర్వకంగా దాచారనుకుంటాను." అన్నాడు లాల్.

"ఎవరు?" ఇన్‌స్పెక్టర్ అర్చాడు ఉద్రేకంగా.

"కనుక్కుంటాను" లాల్ అన్నాడు. "ఆల్ రైట్, ఈ కేసు త్వరగా తేలిపోతుందని నా అంచనా. ఆలోచనలతో మీ మెదడు వేడెక్కిందనుకుంటాను. విశ్రాంతి తీసుకోండి, కేసు మాకు వదలండి."

# 4

లాల్ సిగరెట్ వెలిగించి జాన్‌ని చూసి నవ్వాడు. "ప్లాంటెడ్ ఎవిడెన్స్." అన్నాడతను. "ఈ వంద రూపాయలనోటు దొరికినప్పటినుంచీ కేసు హండ్రెడ్ పర్సెంట్ మిస్టరీగా తయారయింది. నీకేదయినా మార్గం తట్టిందా జాన్?"

జాన్ నీరసంగా తల వూపాడు. "ముందు ఆకలి తీర్చుకున్నాక మార్గం ఆలోచిస్తాను. ఈపూట కోడికూర అని చెప్పాడు భూపతి. అప్పటినుంచి మనసు మనసులో లేదు, నన్నేమీ అడక్కు."

లాల్, జాన్ ముఖాన్ని చూసి ఒక నిర్ణయానికి వచ్చాడు. "సరే, నువ్వింటికెళ్ళి కోడికూర తిని పడుకో. కానీ పడుకునేముందు ఒక పని చెయ్—"

"ఆఁ! చేస్తాను."

"ఏమిటి?"

"విస్కీ తాగమనేగా నువ్వు చెప్పేది?"

లాల్ తల పట్టుకున్నాడు, "కోడికూర, భూటాన్ విస్కీ, ఇంకేం కావాలి?"

"నీకు తెలుసు. అదిక్కడ కుదరదు కాబట్టి కోరను."

"షటప్! యూ డర్టీ పార్ట్నర్!"

"అయితే ఏం చేయాలో చెప్పు."

"ఆకలి తీర్చుకున్నాక రజని గది గాలించు. ఇన్స్పెక్టర్ సోదా చేసినట్టు భూపతి భార్య చెప్పినందువల్ల నేను సరిగా సోదా చేయలేదు. ఇప్పుడు సోదా చేయక తప్పదు. ఎందుకంటే ఇన్స్పెక్టర్ సోదా తర్వాత అక్కడ కొత్త ఆధారాలు సృష్టించబడ్డాయి. అందుకు నిదర్శనం ఈ వందరూపాయల నోటు. అర్థమైందా? ఇక వెళ్ళు. నేను చంచలని కలుసుకుంటాను."

జాన్ తలవూపి సాగిపోయాడు. లాల్ కాస్సేపు నిలబడి వెనక్కి తిరిగాడు.

సూర్యారావు పొలం చేరుకునేసరికి లాల్ చెమటతో తడిసిపోయాడు. పొలంలో ట్రాక్టర్ పెట్టి దున్నుతున్నారు. డ్రైవర్ ఒక్కడే కన్పించాడు.

లాల్ గట్టు వెంబడి చకచక నడుస్తూ పొలాల్లోకి ప్రవేశించాడు. రెండు ఫర్లాంగుల దూరాన పాడుబడ్డ ఇల్లు కన్పిస్తోంది. చుట్టూ కాంపౌండ్ లేదు. మేడమీదికి వెళ్ళడానికి మెట్లు బయటనుంచే వున్నాయి.

డ్రైవర్ లాల్ని చూసి నవ్వాడు.

"చంచల వుందా?"

తల వూపాడతను.

"రావుగారెక్కడ వున్నారు?"

"వూరికెళ్ళారు."

లాల్ అడుగులేస్తూ ముందుకి సాగిపోయాడు. మేడ

మీద కిటికీ అతనికి ఎదురుగా వుంది.

చకచక మెట్లెక్కి, మేడమీదికి చేరుకుని మూసివున్న తలుపుమీద చప్పుడు చేశాడు.

తలుపు తెరుచుకుని ఒక వ్యక్తి వచ్చాడు. సన్నగా, పొడుగ్గా, నల్లగా ఉన్నాడు. తెల్లటి దుస్తులు ధరించాడు.

"ఎవరు మీరు, ఎవరు కావాలి...?" చిరాగ్గా అడిగాడు.

"మిస్టర్ సంపత్ మీరేనా?"

"అవును."

"మంచిది. నేను డిటెక్టివ్ లాల్ని. హైద్రాబాద్ నుంచి వచ్చాను. లోపల చంచలగారు వున్నారా?"

"ఏం పనిమీద వచ్చారు?"

"లోనికి రావచ్చా?"

"నే నడిగింది ఏ పనిమీద వచ్చారని?"

లాల్ అతన్ని సూటిగా చూశాడు. "చూడండి మిస్టర్, నేను వచ్చింది మిమ్మల్ని ప్రశ్నలడగడానికి, జవాబులివ్వడానికి కాదు. మర్యాదగా పక్కకి తొలగండి."

"సంపత్, ఎవరది?" స్త్రీ కంఠం పలికింది లోపలి నుంచి.

"ఎవరో డిటెక్టివ్ట." అన్నాడు సంపత్ అడ్డు తొలగకుండానే.

లాల్ అతన్ని పక్కకి తోసి లోనికి జొరబడ్డాడు.

సంపత్, లాల్ కాలరు పుచ్చుకుని వెనక్కి లాగి, "ఏమిటీ దౌర్జన్యం!" అంటూ అరిచాడు.

లాల్ అతన్ని బలంకొద్దీ మళ్ళీ వెనక్కి తోసి, "మీ

రిద్దరూ ఏం చేస్తున్నారిక్కడ?" అన్నాడు.

టేబిల్ వెనక కూచున్న చంచల, లాల్ దగ్గరకు వచ్చింది. "క్షమించండి" అందామె. "అతనికి ఆవేశం ఎక్కువ. నన్ను బాడీగార్డ్‌లా అంటిపెట్టుకుని వుంటాడు. ఈగ కూడ నామీద వాలనివ్వడు" అని సంపత్ వేపు తిరిగి, "మీరిద్దరూ, భోజనం చేసిరా. నే నీయనతో మాట్లాడుతుంటాను" అంది.

సంపత్ బయటికి కెళ్ళిపోయాక చంచలని చూసి నవ్వుతూ అన్నాడు లాల్: "వెల్, మీరు కల్పించుకోక పోతే మేం కాస్సేపు రకరకాల విద్యలు ప్రదర్శించుకునే వాళ్ళం. సంపత్‌కి అసలు సింపతీ లేదనుకుంటాను?"

చంచల గాఢంగా చూసింది. ఆమె తెల్లటి చెంపలు ఎర్రబడ్డాయి.

"నెవర్ మైండ్, జరిగింది మర్చిపొండి!" అన్నాడు లాల్ కుర్చీలో కూచొని.

అతని కళ్ళు ఒకసారి గదినంతా పరికించాయి. తలుపుకు కుడివేపు టేబులు, కుర్చీ వున్నాయి. టేబిల్ పైన కొన్ని ఫైళ్ళు, తెల్లకాయితాలు చిందరవందరగా పడివున్నాయి. కొన్ని ఉత్తరాలు కుప్పగా పోసి వున్నాయి. టేబిలు కిందవున్న వేస్ట్ బాస్కెట్ నిండా కాయితపు ఉండలున్నాయి. టేబులుపైన వున్న టైప్‌రైటర్‌లో కొన్ని తెల్లకాయితాలు ఎక్కించి వున్నాయి...

తలుపు కెదురుగా గోడ నానుకుని పుస్తకాల రాక్ వుంది. తలుపుకి ఎడమవేపు కిటికీపక్కన చంచల టేబిలు వుంది. ఆ టేబిలుపైన రెండు ఫైళ్ళు, ఉత్తరాలు, కలాలు వున్నాయి. గదిలో ఎలక్ట్రిక్ దీపాలు లేవు.

"క్షమించండి" అంది చంచల తన స్థానంలో

కూచొని, "మీరెవరో నాకు తెలియదు."

లాల్ విజిటింగ్ కార్డు ఆమెకి అందించాడు.

"ఓహ్! లాల్!" అర్చిందామె వెంటనే, చదివి "అహాఁ! మీరిలా వస్తారని నేననుకోలేదే? మీ పార్ట్నర్ ఏడి?.'

"హీ ఈజ్ ఈటింగ్" అన్నాడు లాల్.

"ఐయామ్ వెరీ సారీ, మిస్టర్ లాల్" చంచల అన్నది ఆందోళనగా, "సంపత్ మీపట్ల క్రూరంగా ప్రవర్తించాడు."

"మా వృత్తిలో ఇలాటివి మామూలే, నెవర్ మైండ్."

చంచల నిట్టూర్చింది. "పబ్లిషర్ని కలుసుకునేందుకు అనేకసార్లు హైదరాబాదు వచ్చానుగానీ మిమ్మల్ని చూడలేదు. మీ ఏజెన్సీ ఎప్పుడూ చాలా బిజీగా వుంటుందని విన్నాను. మిస్టర్ లాల్, మీరిలా రావడం చాలా ఆశ్చర్యంగా వుంది. కేవలం నన్ను చూసేందుకే ఇంత దూరం రాలేదుకదా!"

"ఇక్కడికి వచ్చాక మీ గురించి తెలిసింది—"

"అదెలా?"

"రజని కేసు మీకు తెలుసనుకుంటాను?"

"మీరు ఇన్వెస్టిగేట్ చేస్తున్నారా?" అడిగింది వెంటనే.

"ఏం అలా అడిగారు?"

"ఓహ్, ఏమీలేదు. మిస్టర్ లాల్, మీరు తెలుగు చాలా బాగా మాట్లాడుతున్నారు!"

లాల్ నవ్వి, "మీరు ఇంగ్లీషు బాగా మాట్లాడతారు" అన్నాడు.

"అరె, మీకెలా తెలుసు?"

"మీ మాటల్లో ఇంగ్లీషుపదాలు దొర్లుతున్నాయి."

"యూ ఆర్ మార్వెలస్!"

"ఆడవాళ్ళంతా ఎడతెరిపి లేకుండా సాంఘిక నవలలు వ్రాస్తోంటే మీరు క్రైం కథలెందుకు వ్రాస్తున్నారు."

నవ్వింది చంచల. "ప్రత్యేకమైన గుర్తింపుకోసం."

"ఎప్పటినుంచి వ్రాస్తున్నారు?"

"డిగ్రీ పూర్తిచేసినప్పటినుంచి,అంటే రెండు సంవత్సరాలనుంచీ."

"చిత్రంగా వుంది," అన్నాడు లాల్. "డిటెక్టివ్ కథలు వ్రాసే అనుభవం యెలా వచ్చింది? మీ వాలకం చూస్తే—"

"చెప్పండి, ఏమిటి?"

"ఉత్తరాలు వ్రాసే అనుభవం కూడా లేనట్టుంది."

ఫకాలున నవ్వేసిందామె, "ఇలా చాలామంది అడుగుతున్నారు. మీరడగడంలో వింతేమీ లేదు,మిస్టర్ లాల్, డిటెక్టివ్ నవలలు వ్రాసే అనుభవం నేను కొమ్మూరి పుస్తకాలు చదివి సంపాదించాను."

"వెల్, మీ అభిమాన రచయితలుగానీ,రచయిత్రులు గానీ యెవరు?"

"కొమ్మూరి, క్రిస్టీ, కౌసల్య."

"మీరు ప్లాట్స్ స్వయంగా తయారు చేస్తారా?"

"ఎందుకలా అడిగారు?"

"మన దేశంలో డిటెక్టివ్ రచయితలు ఇంగ్లీష్ రచయితలను అనుకరిస్తారని అపవాదువుంది—"

"థాంక్ గాడ్! నిజమే కావచ్చునేమోగానీ, నే నెవ

రినీ అనుకరించను—"

"ఆల్ రైట్, మీరిప్పుడేం వ్రాస్తున్నారు?" అంటూ టేబిల్ మీది ఫైలు అందుకోబోయాడు లాల్. చంచల చివాల్న ముందుకు వంగి ఫైలు లాక్కుని, "ఎక్స్ క్యూజ్ మీ!" అంది. "ఎవరైనా నా కథలు చదవాలను కుంటే— అవి ప్రింటింగ్ లోనే."

"మీరు వ్రాస్తున్న కథ పేరేమిటి?"

"సారీ, ఆమెని చంపలేను!"

లాల్ ఆమె కళ్ళలోకి చూస్తూ, "ఎప్పుడు పూర్త వుంది?" అనడిగాడు.

చంచల గబగబ ఇలా చెప్పింది:

"ఇరవైఅయిదు రోజులకో నవల పూర్తిచేస్తాను. ప్లాట్ అల్లడానికి అయిదు రోజులు సరిపోతాయి. రఫ్ స్కెచ్ పదిహేను రోజులు, ఒకరోజు ఫైనల్ చెకింగ్, డ్రాఫ్టింగ్. తర్వాతి మూడురోజులూ టైపింగ్. సంపత్ టైపింగ్ పూర్తిచేసి నాకందిస్తాడు, నేను ఓ.కే. చేస్తాను. వెంటనే డిస్పాచ్. అంతే— ఆ తర్వాత అయిదురోజులు రెస్ట్. ఆ తర్వాత మళ్ళీ రొటీన్ వర్క్."

"అయిడియా లెక్కడనుంచి వస్తాయి?"

చంచల లాల్ ని సూటిగా చూసింది, "బాత్ రూం లోంచి వస్తాయి" అంది నవ్వుతూ. "అగథా క్రిస్టీ స్నానం చేస్తున్నప్పుడే ప్లాట్స్ ఆలోచిస్తుందట. నేనూ అంతే."

"థాంక్స్ చంచల, చాలా విషయాలు చెప్పారు. మీరు ఆరితేరిన డిటెక్టివ్ రచయిత్రి కాగలిగారు కానీ మేం ఆరితేరిన డిటెక్టివ్ లం కాలేకపోయాం."

"కారణం?" అడిగింది చంచల.

"ఈ దేశంలో డిటెక్టివ్ లని ఆదరించడంలేదు."

"ఓహ్, నాకు తెలుసు. మీ డిటెక్టివ్ లని కథల్లో నే ఆదరిస్తారు ప్రజలు. కానీ, లాల్, మీ ఏజెన్సీ ఎప్పుడూ బిజీగా వుంటుందే?"

"ఆఫీసు ఖర్చులు భరించలేని సోదర డిటెక్టివ్ లు చాలామంది వున్నారు, మిస్ చంచల. సరే, అసలు విషయానికి వస్తాను. రచయిత్రిగా మీ లైఫ్ గురించి నాకు చాలా తెలుసుకోవాలని వుందిగానీ, నాకు వ్యవధి లేదు. మీరు ఒకేచోట కూచోని పరిశోధన చేస్తారు. మేం క్షణానికో చోట—"

"ఓహ్, అర్థమైంది. చెప్పండి లాల్. నా సహాయం కావాలా?"

"రజనికి అత్యంత సన్నిహితురాలిగా మీ సహాయం నాకు చాలా అవసరం" అన్నాడు లాల్. "సూటిగా అడుగుతున్నందుకు ఏమీ అనుకోకండి: మీరు డిటెక్టివ్ కథలు వ్రాయడం రజనికి ఎందుకిష్టం లేదు?"

లాల్ ప్రశ్నకి చంచల బిత్తరపోయి చూసింది.

"అలాంటిదేమీ లేదే? నా కథలు ఆమెకి చాలా ఇష్టం."

"బుకాయించి ప్రయోజనం లేదు. నా దగ్గర ఆధారముంది. మిస్ చంచల, నేనెవరి మీదనయినా ఆరోపణ చేసేముందు ఆధారాలు సిద్ధం చేసుకుంటాను" అన్నాడు లాల్. "మీ డిటెక్టివ్ కథలు రజనికి యిష్టంలేదన్న విషయం నిరూపించమంటారా?"

చంచల చురచుర చూసింది, "అర్థంలేని ఆరోపణకి నిరూపణ అనవసరం!" అర్చిందామె.

"మూడునెలల క్రితం మీరు గుంటూరు నుంచి రజనికి

వుత్తరం వ్రాసారు. ఏం రాశారో జ్ఞాపకం లేకపోతే ఈ ఉత్తరం చదవండి.''

లాల్, చంచలకి ఒక వుత్తరం అందించాడు.

చంచల ఎర్రబడ్డ ముఖంతో వుత్తరం గబగబ చదివి' ''ఆమె మాయమవడానికీ, ఈ వుత్తరానికీ సంబంధ మేమిటి?'' అంది కోపంగా.

''ఏమీ సంబంధం లేకపోతే మీకంత కోప మెందుకు?'' నవ్వుతూ అడిగాడు లల్, వుత్తరం తిరిగి తీసుకుని.

''ఆల్ రైట్, మిస్టర్.'' అంది చంచల తీవ్రంగా చూస్తూ. ''ఇదేదో పన్నాగంలా వుంది. నా అభివృద్ధిని సహించని వ్యక్తులు ఏదో పథకం వేశారు, నన్ను పాతాళానికి అణగదొక్కడానికి!''

''తెలుగు డిటెక్టివ్ సాహిత్యానికి బూతు సాహిత్య మని మరో పేరు వుంది. ఇలా దిగజారడానికి రచయితల బాధ్యత చాలావరకు వుంది. నా కథల్లో నేను శృంగార మేమీ జొప్పించడంలేదు. కాబట్టి, నేను డిటెక్టివ్ కథలు వ్రాయడం రజనికి ఇష్టంలేకపోవడానికి శృంగారం కారణంకాదు. నోట్ చేసుకోండి.''

లాల్ తలవూపాడు.

''ఇక నా ఎనిమిదవ నవల 'ఈ రాత్రి తెల్లారదు!' గురించి మీకు చెప్పాలి. ఆ కథలో హింసకి హద్దులేదు. అందులోని పాత్రలన్నీ పాశవిక ప్రవృత్తిగలవే. విచ్చల విడి హత్యలు, రక్తపాతం, దౌర్జన్యం వీటన్నిటితో ఆ నవల చదవడానికి భయం పుట్టించేలా తయారైంది. అఫ్ కోర్స్, మీరూ చదవలేరు. ఒళ్ళు జలదరించే సంఘటనలు, నరాలు పిప్పిచేసే సస్పెన్స్ మీరు భరించలేరు.

ఆ నవల ఇప్పుడు సినిమాగా తీస్తున్నారు. ఇంతకీ సంగ తేమిటంటే ఆ నవల చదివాక రజని మెంటల్ షాక్ కి గురయింది..."

చంచల చెప్పడం ఆపేసి అదోలా చూసింది లాల్ ని.

"అప్పటినుంచీ నా కథలంటే ఆమెకి ఎలర్జీ పుట్టింది. క్రైంకథలు మానుకోమని పదేపదే చెప్పసాగింది. సాంఘిక కథలు వ్రాయమని వెంటపడింది. వీల్లేదన్నాను. వాగ్వివాదాలు జరిగాయి. ప్రేమకథలు వ్రాయడం నాకు చేతగాదు. క్రైంకథలు మానుకోలేను. ఐ లవ్ డిటెక్టివ్ స్టోరీస్. రజని నాతో మాట్లాడడం మానేసింది. మూడు నెలల నుంచి మా మధ్య మంచి సంబంధాలు లేవు. ఎలాగైనా నాచేత క్రైం కథలు వ్రాయడం మాన్పిస్తానని పందెం కట్టింది. అదెవరి తరమూ కాదు."

"మిమ్మల్ని బెదిరించేదా?"

"ఎందుకు? అలాటిదేమీ లేదు!"

"ఒక స్థలంలో పోలీసులు సోదాచేసి వెళ్ళిపోయాక అక్కడ ఆధారాలు సృష్టించబడడానికి కారణమేమిటి? చెప్పగలరా?"

చంచల ఓరచూపులు చూసింది. "రజని గదిలో ఇంకా ఏం దొరికాయి?"

"వందరూపాయల నోటు—ఇన్ స్పెక్టర్ సోదాచేసి నప్పుడు లేదు" అన్నాడు లాల్.

చంచల ఘటుక్కున అంది. "మైగాడ్! వూహించ లేరా?!"

"అందుకే మిమ్మల్ని అడిగాను."

"రజని అదృశ్యమయాక తిరిగి ఇంటికి వచ్చింది!"

"ఎప్పుడు?"

"ఇన్ స్పెక్టర్ సోదాచేశాక! మిస్టర్ లాల్, ఆ గదిని యింకా జాగ్రత్తగా గాలించండి, కొత్త ఆధారాలు దొరుకుతాయి. రజని ఏదో ఆపదలో వుంది. పోలీసుల సహాయం కోరే వ్యవధి ఆమెకు లేదు. ఎవరికీ చెప్పకుండా తనకి క్షేమంగా వుండే చోటుకి వెళ్ళిపోయింది. అపాయం తొలగే సూచనలేదు. అయినా అవకాశం చూసుకుని ఇంటికి వచ్చివుంటుంది!"

"వెల్, ఇంటికి వచ్చి ఏం చేసింది?"

"తన ఆచూకీ తెలిపే ఆధారాలు సృష్టించి వెళ్ళి పోయింది. అంతే, ఇంతకంటే మంచి ఎక్స్ప్లనేషన్ ఇవ్వలేను. ఈ నోటుకి అదే అర్థం. జాగ్రత్తగా గాలించండి, ఆధారాలు దొరుకుతాయి. ఆధారాలు దొరికాయంటే రజని దొరికిందన్నమాటే!"

"థాంక్స్" అన్నాడు లాల్ ఆరితేరిన క్రైం రచయిత్రిని చూసి, "నా పార్టనర్ ఈ పాటికి గాలిస్తోనే వుంటాడు. వెల్, చంచల—మాయమైన రోజున రజని మిమ్మల్ని కలుసుకుందా?—"

"ఈ జంటిల్ మన్ ఇంకా వెళ్ళలేదా?"

విన్పించాయి మాటలు తలుపు వేపునుంచి. లాల్ వెనక్కి తిరిగి చూశాడు.

గుమ్మంలో సంపత్ నిలబడివున్నాడు. అతని ముఖంలో కోపం ఉట్టిపడుతోంది.

"చంచలా! ఏమిటిది! శివరంజని గురించి మర్చిపోయావా" అతని అరుపులకి గది ప్రతిధ్వనించింది...

# 5

"స...మ్మ్మ్...పత్!" అర్చిందామె హిస్టరికల్ గా!

"ఏమిటి చంచలా?"

"వెళ్ళిపో, నువ్వెళ్ళిపో ఇక్కడ నుంచి!" అరుస్తోంది చంచల ఆందోళనగా,

"ఓహ్, సంపత్! నువ్వు స్టుపిడ్‌వి! ఈడియట్‌వి. బాస్ట—"

"షటప్ చంచల!" ఆమె చంప వాయించి అర్చాడు సంపత్.

"నోర్మూసుకో, నీకేమయిందనీ ఇలా అరుస్తున్నావ్? ఛ! నీలాంటి రైటర్ దగ్గర పనిచేయడం నాకు సిగ్గుచేటు!"

చంచల కోపాన్ని హద్దులో పెట్టుకుని లాల్‌ని చూసింది, "మిస్టర్ లాల్, యింకా చూస్తారేమిటి! ఇతరుల తగవు తమాషాగా తిలకించడం తప్పని మీకు తెలీదూ? వెళ్ళండి, తక్షణం వెళ్ళిపోండి!"

"శివరంజని అంటే మీకు భయమా?" లాల్ అడిగాడు.

"నో! ఓహ్—సంపత్!"

"ఆమె ఎవరు?"

"ఎందుకు! నా ఫ్రెండ్!"

"అయితే భయం ఎందుకు?"

"చూడండి లాల్, నేనెవరికీ భయపడను. ఆమె టి.పి. గూడెం నుంచి ఇవాళ వస్తోంది. ఆమె...ఆమె నాకు—ఓహ్ లాల్! ఎలా చెప్పాలి మీకు!"

"ఏమిటి?"

"నన్నర్థంజేసుకోమనీ!"

లాల్ లేచాడు, "వెల్, అర్థంజేసుకున్నాను" అన్నాడతను. "మిమ్మల్నే కాదు, పూర్తి కేసునీ! గుడ్ బై ఫ్రెండ్స్, వస్తాను."

లాల్ చకచక బయటికి నడిచి భూపతిరావు ఇంటికి చేరుకున్నాడు.

భూపతిరావు, అతని భార్య వరండాలో కూచొని మాట్లాడుకుంటున్నారు. లాల్‌ని చూసి లేచి నిలబడి, ఆసక్తికరంగా చూశారు.

"రావుగారూ, ఇప్పుడు నన్నేం అడక్కండి" లాల్ అన్నాడు వారిని జాలిగా చూస్తూ, "మీ కూతురి జాడ చాలా త్వరగా తెలుస్తుంది. రజని మీ నుంచి చాలా దాచింది. అదే ఆమెకు ప్రాణాలు మీదికి తెచ్చింది—"

"ప్రాణాలమీదికి!?"

"క్షమించండి, క్షమించండి, నన్నేమీ అడక్కండి. జాన్ ఎక్కడ?"

"నిద్రపోతున్నాడు."

లాల్, జాన్ గదిలోకెళ్ళి చూశాడు. అతను నిద్ర పోతున్నాడు. పైన సీలింగ్ ఫాన్ తిరుగుతోంది. తలగడ పక్కన టేప్ రికార్డర్ నుంచి తక్కువ స్థాయిలో ఏదో పాట వస్తోంది. లాల్ ట్యూను పెంచాడు.

"ఎరక్కపోయి వచ్చాను, ఇరుక్కుపోయాను' అంటోంది అందులోని గొంతుక.

జాన్ చటుక్కున లేచి కూచున్నాడు, రికార్డర్ ఆఫ్ చేసి, "న్యూసెన్స్!" అంటూ గొణిగాడు.

"జాన్ ఇది పడుకునే సమయం కాదు" స్టూలు పైన కూచొని లాల్ అన్నాడు "ఏం కనుక్కున్నావు?"

జాన్ నిద్రమత్తు వదిలింది.

తాను కనుక్కున్న వివరాలు వెల్లడించాడు:

రజని గదిలో మంచంమీది పరుపుకింద ఒక నలిగి పోయిన కాయితం ముక్కవుంది. అందులో అక్షరాలను

బట్టి అది స్త్రీ దస్తూరీ అని తెలుసుకోవచ్చు.

ఆ కాయితంలోని సారాంశం యిది:—

"నాన్నా,

నేను క్షేమంగా వున్నాను. గాభరాపడకండి, అమ్మకు ధైర్యం చెప్పండి. నిన్న మధ్యాహ్నం నా ఫ్రెండ్ శ్రీవిద్య చాగల్లు నుంచి వస్తోందని స్టేషన్ కి బయలుదేరాను. కానీ దార్లో ఎవడో ఆగంతకుడు అకాట యించి చెట్లచాటునవున్న కార్లో ఎక్కించుకుని రాజ మండ్రీ తీసుకెళ్ళాడు. అతని దగ్గర పిస్తోలువుంది. నాకేమీ సంభవించదని హామీయిచ్చాడు. గోదావరి బ్రిడ్జి దాట గానే మరో ముగ్గురు కారెక్కారు. అంతా కలిసి నన్ను ఆల్ కాట్స్ గార్డెన్ లో ఒక ఇంట్లో బంధించారు.

ఈ రోజు మధ్యాహ్నం వాళ్లు నా దగ్గిరికి వచ్చి ఈ వుత్తరం వ్రాయమన్నారు. అందుకే వ్రాస్తున్నాను. ఈ వుత్తరంతో బాటు ఒక వందరూపాయల నోటు కూడా గదిలో వుంటుంది. అది మేజా సొరుగులో వుంటుంది. రేపుదయం ఒక వ్యక్తి వచ్చి ఆ వందరూపాయలనోటు మీద నెంబరు చెప్తాడు. మీరు ఆ నెంబర్ సరిచూసుకుని ముప్ఫైవేలు ఇవ్వాలి. అంతే, ఆ తర్వాత నేను విడుదలయి పోతాను. నాన్నా, ఇది నమ్మండి!

నేను క్షేమంగా మీకు దక్కాలంటే, పోలీసులకి తెలియజేయకండి.

ఇట్లు,
—రజని"

ఈ వుత్తరం చదివితే అసంఖ్యాకమైన అనుమానాలు రాక తప్పవు! తానెలా అపహరించబడిందీ రజని వ్రాసేం దుకు ఆగంతకులు ఎలా అంగీకరించారు? తానెక్కడ

వుందో తెలియజేసే ఆచూకీ రజని తెలిపేందుకు ఎలా సమ్మతించారు? అది వాళ్ళకు ప్రమాదకరం కాదా? ఈ వుత్తరం గదిలో ఎవరు పెట్టారు? ఆగంతకులా, రజనియా? అయితే డబ్బుకోసం కిడ్నాపర్ ఇన్ని రోజులు గడిచినా ఎందుకు రాలేదు? రజనికి ఏదేనా సంభవించిందా?

అయిదురోజులు గడిచినా కిడ్నాపర్ డబ్బుకోసం రాలేదంటే రెండు కారణాలున్నాయి. ఒకటి: రజని తప్పించుకోడం. రెండు: ఆమె మరణించడం.

రజని తప్పించుకుని వుంటే ఈ పాటికి ఇల్లు చేరాలి. కానీ అలా జరగలేదు. కాబట్టి మరణించిందా?

జాన్ కథనం అంతా విన్నాక నవ్వాడు లాల్, "ఈ ఉత్తరం చదివాక నీకు సుఖంగా నిద్ర ఎలా పట్టిందో అర్థం కావడంలేదు. జాన్."

"ఈ ఉత్తరానికీ, రజని మాయమవడానికీ అసలు సంబంధమే లేదు" అన్నాడు జాన్, "ఇంత నిర్భయంగా ఏ కిడ్నాపరూ వుత్తరం వ్రాయించడు! రజని యెక్కడ బంధింపబడి వుందో వుత్తరంలో వ్రాసివుంది. కానీ అది నిజమని గ్యారంటీ యేమిటి? అయిదురోజులు గడిచినా కిడ్నాపర్ డబ్బుకోసం రాలేదు, కాబట్టి యిది ఫేక్ కిడ్నాపింగ్ ప్లాట్. దీని వెనుక రహస్యం వుంది. ఇదంతా రజని ఏ వుద్దేశ్యంతోనో బుద్ధిపూర్వకంగా చేస్తుండాలి, లేదా ఎవరో ఆమెని..."

"నువ్వేమీ చెప్పనవసరంలేదు జాన్" లాల్ అడ్డు తగిలాడు. "ఇది క్లిష్టమైన కేసు అనుకున్నాం. కానీ, ఇప్పుడు చాలా సులభంగా తేలిపోతోంది."

"ఎలా?"

"పంచల డిటెక్టివ్ కథలు వ్రాయడం రజనికి అసలు

ఇష్టంలేదు. దానికి చంచల ఒక కారణం చెప్పింది. అది సరైనది కాదు. చంచల సంగనాచిలా ప్రవర్తిస్తోంది. ఆ అమ్మాయిదగ్గర తెలివితేటలు వున్నాయి. కథలు వ్రాయడానికి తెలివితేటలు వుంటే సరిపోదు. గొప్పగొప్ప సైంటిస్టులదగ్గర అమోఘమైన తెలివితేటలుంటాయి. కానీ కథలు వ్రాయగలరా? అసంభవం. కథలు వ్రాసేందుకు తెలివితోబాటు చక్కని కల్పనాశక్తి కావాలి. భావాల్ని వెల్లడించగల్గాలి. ఏమంటావు?"

"దటీజ్ రైట్"

"వెల్, చంచలకి కల్పనాశక్తీ, వూహాపటిమా లేవనుకుందాం. అప్పుడామె ఏంచేస్తుంది కథలు వ్రాసేందుకు?"

"ఏం చేస్తుంది?"

"కాపీ చేయడానికి సిద్ధపడుతుంది. అంటే కాపీ రైటుని ఆమె కాపీచేసే హక్కుగా అపార్థంజేసుకుంటుంది."

"అర్థంగావడంలేదు లాల్."

"ఒక్క ముక్కలో తేల్చాలంటే చంచలకి కథలు వ్రాయడం రాదు!" అన్నాడు లాల్. "ఆమె ఇతర కథల్ని కాపీ చేస్తోంది. అందుకు ఇంగ్లీషు నవలలు బాగా పనికి వస్తాయి. పేరున్న రచయితలు కథలు కాపీ చేయరు, ఇట్టే పట్టుబడిపోతుంది. కాబట్టి ఎవరో అనామకుల కథల్ని ఎన్నుకుంటుంది. కొందరు రచయితలుంటారు. వాళ్ళు ఒకటి రెండు నవలలు వ్రాసి అంతర్ధానమవుతుంటారు. వాళ్ళ నవలలు ఆమెకి బాగా ఉపయోగపడుతాయి. పట్టుబడే అవకాశాలు వుండవు..."

"చంచల కథలు కాపీ చేయడానికీ రజని మాయమవడానికీ సంబంధమేమిటి?"

"చంచల గుట్టు రజనికి తెలిసిపోయి బ్లాక్ మెయిలు చేస్తుండాలి. తన గుట్టురట్టయితే శిక్ష తప్పదని చంచలకి తెలుసు. అందుకని రజనిని..."

"ఏం చేసింది?"

"చంపేసింది." లాల్ అన్నాడు. "చంచల, పూర్ గర్ల్! 'శివరంజని' అంటే యేమిటో నాకు తెలియదనుకుంది. జాన్, చంచల, సంపత్ ఒక కోడ్ ఉపయోగిస్తున్నారు. 'శివరంజని' అని. దానివే 'శవరంజని', అనుకుంటే 'రజని శవం' అవుతుంది!!"

"ఎలా?"

" 'శ_వ_ర_ం_జ_ని' లోని అక్షరాల్ని తారుమారు చేస్తే రజని శవం అవుతుంది—అవునా?"

జాన్ నోట మాట రాలేదు. లాల్ నవ్వాడు.

"లాల్! ఏమిటిది?"

"కోడ్‌ని డీకోడ్ చేశాను. ఇక డిటెక్షన్ చేయాలి' అన్నాడు లాల్.

"చంచల తన గుట్టురట్టయితే చట్టరీత్యా శిక్ష తప్పదన్న భయంతో శిఖరాలందున్న పేరుప్రతిష్ఠలు మట్టిపాలవుతాయన్న ఆదుర్దాతో, తనని బ్లాక్ మెయిలు చేస్తూ ప్రమాదకరమైన వ్యక్తిగా తయారైన స్నేహితురాలు రజనిని అంతం చేసింది. ఆమె శవాన్ని ఎక్కడో ఖననం చేశారు. ఈ దారుణ సంఘటనగురించి ఎవరికీ తెలియదు. అందరూ రజని యెక్కడికో అదృశ్యమైందనుకుంటున్నారు. ఆమాకీ ఎవరికీ తెలియదు.

"అయినా చంచలకి ఎప్పటికీ ప్రమాదకరమే. హత్య బయటబడితే ఉరికంబం ఆహ్వానించక వూరుకోదు. అందుకు కేసు పెడదోవ పట్టించాలనుకుంది. ఈ వృత్తరం

ఆమె సృష్టించిందే. కిడ్నాపరు రాడు, రజనీ రాదు కాబట్టి ఆగంతకులతోనే ఆమెకి ఏదైనా సంభవించి వుంటుందని అనుకుంటారందరూ. హత్య బయటపడితే, అది కిడ్నాపింగ్ పర్యవసానం అని వూహించడం సులభం."

జాన్ మెరుస్తున్న కళ్ళతో లాల్‌ని చూశాడు.

"కానీ, లాల్, ఆమెకి కథలు వ్రాయడం రాదని ఎలా వూహించావు?"

"ఆమె ప్రవర్తన ఆధారం" అన్నాడు లాల్. "నా వూహ నిజం కావాలంటే ఆమె స్థావరంలో సోదా జరపాలి."

"ఇన్‌స్పెక్టర్ సహాయంతో" అన్నాడు జాన్.

"ఎందుకు?"

"ప్రభుత్వాధికారి సాక్షిగా వుంటే కేసు బలంగా వుంటుంది" జాన్ అన్నాడు. "లాల్, మరి రజని ఇన్‌స్పెక్టర్‌కి వ్రాయదల్చుకున్న ఉత్తరం గురించి ఏం చెబుతావు?"

ఒక్క క్షణం ఆలోచించి లాల్ అన్నాడు. "చంచల కథలు కాపీ చేస్తున్నట్లు రజనికి తెలిసి ఆమెని మందలించింది. చంచల వూరుకోలేదు. వ్రాస్తూనే వుంది. రజని మందలిస్తూనే వుంది. చివరికి ఇక లాభం లేదనుకుని రజని పోలీసులకి చంచల గురించి ఉత్తరం వ్రాయాలనుకుంది. కానీ, వుత్తరం మధ్యలో ఆపేసింది. ఎందుకు? చంచలకి ఫైనల్ వార్నింగ్ యిచ్చి చూద్దామని. కాపీ చేయడం మానుకోకపోతే పోలీసు రిపోర్టు యిస్తానని బెదిరించింది___"

"వెల్, ఆ తర్వాత?"

"పరిస్థితి సీరియస్‌గా తయారైందని చంచల వూహిం

చింది'' లాల్ చెప్పుకుపోతున్నాడు. "రజని నోరు నొక్కకపోతే అపాయం తప్పదు. రజని ప్రాణాలతో వుండకపోతేనే తనకి క్షేమమని చంచల భావించింది. అంతే! సంపత్ రంగంలోకిదిగి రజని ప్రాణాల్ని గాలిలో కలిపాడు—ఆ తర్వాత శవాన్ని మట్టిలో కలిపాడు. దట్సాల్!''

"ఓహ్, లాల్!''

"మనం ఆమె స్థావరాన్ని సోదా చేయాలి. ఆమె కథలు కాపీ చేస్తోందని ఋజువయితే హంతకురాలిగా నిరూపించడం చాలా సులభం. 'శివరంజని!' బహుశ తాడేపల్లి గూడెంలో ఆమెకి 'శివరంజని' పేరు గల ఫ్రెండ్ వుండదు! కమాన్! జాన్! పోలీసుస్టేషన్‌కు వెళ్దాం!'' అంటూ లేచాడు లాల్.

# 6

రాత్రి ఎనిమిదిగంటలవేళ...

ఇన్‌స్పెక్టర్ పోతరాజుతో కలిసి లాల్, జాన్‌లు చంచల స్థావరానికి బయలుదేరారు. లాల్ కథనం పోతరాజు ససేమిరా ఒప్పుకోలేదు. చంచల చాకులాటి అమ్మాయి అనీ, అర్థంలేని ఆరోపణలుచేస్తే ఆమె లక్ష రూపాయలకి పరువునష్టందావా వేసినా ఆశ్చర్యం లేదని అన్నాడతను.

ఆకాశంలో చంద్రుడు లేడు. కటిక చీకట్లో ఒకరి ముఖాలొకరికి కన్పించడంలేదు. నిశ్శబ్దంగా నడుస్తున్నారు ముగ్గురూ. వూరు దాటి సూర్యారావు పొలాలు చేరుకునేసరికి పావుగంట గడిచింది. చంచల చీకట్లో కరెంటులేని ఆ పాడుబడ్డ ఇంట్లో వుండడం అసంభవం.

చీకట్లో ఇంటిగోడలు తెల్లగా, స్పష్టంగా కన్పిస్తు

న్నాయి, లాల్ కి తెలుసు. చంచల తనని పట్టిచ్చే ఆధారాల్ని ఎప్పుడో నాశనం చేసి వుంటుందని. కాని ఆధారాలు నాశనం చేయడంలో నేరస్తులు ఎక్కడో పొరపాటు చేస్తారని అతనికి తెలుసు.

మెట్లద్వారా పైకి చేరుకున్నాడు. జాన్ 'స్కెలెటన్ కీ'తో తాళం తెరిచాడు. ముగ్గురూ లోనికి వెళ్ళారు. ఇన్స్పెక్టర్ టార్చి వెలిగించాడు. వేసవికాలం కాబట్టి లోన వుక్కగా వుంది.

జాన్ గది వెనక వేపు కిటికీ తెరిచాడు. బయటి చీకట్లోంచి చల్లనిగాలి రివ్వుమని దూసుకువచ్చి గిలిగింతలు పెట్టింది. ఆ గాలిలో జాన్ కిరసనాయిలు వాసన పసి గట్టాడు. ముక్కుపుటా లెగరేస్తూ లాల్ ని రమ్మన్నట్లు సైగ చేశాడు.

"ఏమిటి, పార్ట్నర్?" లాల్ అడిగాడు.

"వాసన__"

"అవును, అది నీ చెమట వాసన."

"గాలి గట్టిగా పీల్చు బ్రదర్."

లాల్ గుండెలనిండా గాలిపీల్చి కళ్ళు తేలేసి, స్థాణువై పోయాడు.

"ఏదో వింత వాసన!" వూపిరి వదులుతూ అన్నాడతను.

"కిరోసిన్ వాసన!" జాన్ చెప్పాడు. "ఎక్కడ నుంచి వస్తోంది?"

"గదిలో కిరసనాయిలు వొలికిందా?" ఇన్స్పెక్టర్ వెనక నుండి అడిగాడు.

"ఓహ్! అటు చూడు, లాల్!" జాన్ గొణిగాడు, "ఏదో కాలుతోంది! ఎవరిదో ఆకారం అక్కడ కూచోనుంది!"

"ఇన్‌స్పెక్టర్, టార్చి ఆఫ్ చెయ్యండి" లాల్ అన్నాడు. "మీరిద్దరూ ఇక్కడే వుండండి. నేను బయటికి వెళ్ళి చూసివస్తాను."

చకచక మెట్లుదిగి కిందికి వచ్చాడు లాల్. ఇంటి వెనక వేపు ఇరవై గజాల దూరాన చిన్నమంట మండుతోంది. లాల్ వేగంగా వురుకుతూ మధ్యలో హఠాత్తుగా ఆగిపోయాడు. మంటదగ్గర కూచున్న ఆకారం లేచి లాల్ వేపుకు పరిగెత్తుకుని వస్తోంది. ఆ ఆకారం లాల్‌కి చేరువకాగానే, "చంచలా?" అన్నాడతను.

'కవ్వమని' అర్చింది స్త్రీ ఆకారం.

"మంట నార్పుదాం, రండి!" ఆమె చెయ్యి పట్టుకుని లాక్కెళుతూ లాల్ అన్నాడు. చంచల గింజుకుంటూ అరుస్తోంది. వెనుక నుంచి మరో రెండు ఆకారాలు పరిగెత్తుకు వచ్చాయి.

"జాన్, ఆ మంట నార్పేయి!" లాల్ అరిచాడు, జాన్ వురికాడు. ఇన్‌స్పెక్టర్ చంచల చేతులు పట్టుకున్నాడు.

జాన్ మంటనార్పి లాల్‌ని పిల్చాడు. టార్చి వెలుగులో సగం కాలిన పది ఇంగ్లీషు, హిందీ నవలలు; రెండు వ్రాత ప్రతులు ఒక డెమ్మీసైజు డైరీ కన్పించాయి.

# 7

తన లాయర్‌ని సంప్రదించేవరకు ఎలాటి ప్రశ్నలికీ జవాబులివ్వనని భీష్మించుకుని కూర్చుంది చంచల.

"చంచల, మీ లాయర్ నిన్ను ఏమీ చేయలేడు" లాల్ అన్నాడు.

"హత్యకు సంబంధించిన ఆధారాల్ని నాశనం చేస్తుండగా మిమ్మల్ని రెడ్ హాండెడ్‌గా పట్టుకున్నాం. డైరీలో

మీరు వ్రాసుకున్న విషయాలు మిమ్మల్ని రక్షించడానికి పనికిరావు. డైరీలో చివరి పేజీలో మీరు వ్రాసుకున్న స్నేహితుల చిరునామాల్లో 'శివరంజని' అడ్రసువుంది. ఆ అడ్రసుకి మేం వెళితే శివరంజని లేదు, రజని శవం దొరికింది.

"మీరు కథలు కాపీ చేస్తున్నారనడానికి నిదర్శనాలు ఈ వ్రాతప్రతులు, పుస్తకాలు: 'కిల్ ఆర్ గెట్ కిల్డ్'ని 'సారీ, ఆమెని చంపలేను'గానూ 'ఏక్ ఖూనీ రాత్'ని 'రక్తం చిందిన రాత్రి'గానూ మీరు కాపీ చేస్తున్నారు.

"కాపీ చేయడమంటే మూలకథను కాపీ చేయడం కాదు. ప్రతి వాక్యాన్నీ తెలుగులోకి తెలివిగా అనువదిస్తున్నారు. అందుకు నిదర్శనం, ఈ ఇంగ్లీషు నవలలో అక్కడక్కడ మీకర్థంకాని పదాలకి వ్రాసుకున్న తెలుగులో సమానమైన పదాలు.

"క్రైం రచయిత్రిగా కాపీరైట్ చట్టాన్ని ఉల్లంఘించడం నేరమని మీకు తెలుసు. కీర్తికోసం మనుషులు ఎలాటి నేరమైనా చేస్తారు. మీరూ అంతే. మీరు చేస్తున్నతప్పుని సరిదిద్దాలనుకున్న రజనిని అడ్డు తొలగించారు. చిన్న నేరాన్ని కప్పిపుచ్చేందుకు ఘోరమైన నేరం చేశారు.

"చంచల, ఇన్ని నవలలు అనువదించిన మీరు స్వయంగా ఒక్క నవల వ్రాయలేరా! ఆల్ రైట్, హత్య మీరు చేసివుండరని నా నమ్మకం. కానీ చేయించారని నా అభిప్రాయం. మీకు న్యూసెన్సుగా తయారైన రజనిని చంపి మరో నాటకమాడారు, ఫేక్ కిడ్నాప్ సృష్టించి, తన తండ్రికి రజని వ్రాసిన వుత్తరాన్ని మీరు మీ స్వహస్తాలతో ఆమె దస్తూరీని ఫోర్జరీ చేసి సృష్టించారు. కానీ విఫలమయ్యారు. ఐ పిటీ యూ!"

చంచల ముఖం అవమానంతో కందిపోయింది.

ఇన్‌స్పెక్టర్ పోతరాజు జాలిగా ఆమెని చూసి, "ఈ వూరికి చెడ్డపేరు తెచ్చావు! రచయిత్రిగా నువ్వు వెలిగిపోతున్నప్పుడు ప్రతివారూ ఈ వూరు గురించి చెప్పు కుని పొగిడేవారు. షేమ్ చంచల షేమ్!"

"ఓ.కే. ఫ్రెండ్స్" చివరికి నోరు విప్పింది చంచల. ఆమె ముఖంలో పశ్చాత్తాపం గోచరిస్తోంది. "ఈ పరిస్థితిలో ఏ లాయరూ నన్ను రక్షించడని అర్థం చేసుకున్నాను. ఇప్పుడు నేను నేరం ఒప్పుకోడానికి సిద్ధంగా వున్నాను. ఎందుకంటే ఈ నేరాల్ని కప్పిపుచ్చుకునే మార్గాలు లేవు కాబట్టి. లాల్, సంపత్ 'శివరంజని ప్రస్తావన తీసుకురాక పోతే 'రజనిశవం' క్షేమంగా వుండేది. ఆ స్టుపిడ్‌కి మెదడు లేదు" అంటూ బాధగా తల వాల్చేసింది చంచల.

—: ఐపోయింది :—

# వేషంచూసి మోసపోకండి!

## వసుంధర

బాగా ఆలోచించిన మీదట మాలతి సాంఘిక నవల తీసుకుని చదవడం మొదలుపెట్టింది.

ప్రస్తుతానికి నవల చదివే మూడ్ లేదు. కానీ నిద్ర పట్టక కాలక్షేపమయ్యే దారిలేక ఏదైనా పుస్తకం చదవాలని ఆమె అనుకుంది. మూడ్ లేనప్పుడు కూడా ఆమె చదవగలిగిన పుస్తకాలు డిటెక్టివ్ నవలలు. అయితే ఇప్పుడామె డిటెక్టివ్ నవల చదవడంలేదు.

భర్త పక్కన లేనప్పుడు మాలతి డిటెక్టివ్ కథలు చదవదు. ఎందుకంటే ఆమెకు విపరీతమైన భయం. నవల చదివేక ఇంట్లో ఏ శబ్దం వినిపించినా, గాలికి తెర కదిలినా తన నీడే గోడమీద పడినా—కూడా భయంగా ఉంటుంది.

భర్త ఆమెను ప్రోత్సాహిస్తూంటాడు-డిటెక్టివ్ నవలలు చదువుకునేందుకు. ఎందుకంటే-నవలలు చదవడం పూర్తికాగానే అతనడక్కుండానే దగ్గరగానే చేరి

పడుతుంటుంది. ఆ క్షణంలో అతనికి భార్య ముఖంలో పసితనపు ఛాయలు గోచరిస్తాయి.

ప్రస్తుతం సాంఘిక నవల చదువుతున్న మాలతి పక్కన భర్త లేడు. అతనూళ్ళో లేడు. ఇంకా రెండు రోజులదాకా రాడు. ఊరికి వెళ్ళేటప్పుడు అతను మరీ మరీ చెప్పి వెళ్ళాడు-ధైర్యంగా ఉండమని! ఆమె అలాగే అంది కానీ ధైర్యం లేదు.

పొరుగువాళ్ళ అమ్మాయిని సాయంపడుకో బెట్టుకునేదే కానీ దురదృష్టవశాత్తూ ఆ పిల్ల బావ ఈమధ్యనే ఇక్కడకు వచ్చి తిష్ట వేశాడు.

మాలతి హఠాత్తుగా నవల చదవడం ఆపేసింది. కంగారుగా టైం చూసుకుంది. పదీ ఇరవై అయింది. చెప్పుకోదగ్గ రాత్రికిందే లెక్క! ఆ సమయంలో మూలుగు వినిపిస్తోంది-తనకు-స్పష్టంగా!

డిటెక్టివ్ నవల కలిగించిన భ్రమ అనుకునేందుకు వీల్లేదు. ఆమె చదువుతున్నది సాంఘిక నవల. అదీకాక ఆ మూలుగు స్పష్టంగా వినబడుతున్నది.

మాలతి వెంటనే మంచం దిగలేదు. ముందుగా ఆమెకు భయం కలిగింది. అది మూలుగా, దెయ్యపుకేకా అన్న విషయం ముందుగా ఆలోచించింది. అయితే ఆ మూలుగు అదే పనిగా వినిపించడంలేదు. ఉండి ఉండి ఆగి ఆగి వినిపిస్తోంది.

టైము పదీ నలభై అయేలోగా మాలతి నిద్రపోవడానికి కొన్ని వృథా ప్రయత్నాలు చేసింది. ఆమె ఆలోచనలన్నీ మూలుగుపైననే కేంద్రీకరించబడ్డాయి. ఆ మూలుగు అలా వినిపిస్తూనే ఉంది.

కాసేపయ్యాక మాలతి మంచంమీదనుంచి లేచింది.

ఆ మూలుగు ఎక్కడ్నుంచి వస్తోందో, ఎలా వస్తోందో తెలుసుకుంటేగానీ తనకు నిద్రపట్టే అవకాశం లేదని ఆమెకు తోచింది. క్రమంగా ధైర్యం తెచ్చుకుని మంచం దిగింది. మూలుగు వీధివైపునుంచి వస్తోందని తెలుసుకోవడానికి ఆమెకు ఎంతోసేపు పట్టలేదు.

ఇంట్లో అన్ని స్విచ్‌లూ వేసి వీధిగుమ్మం దగ్గరకు వచ్చింది మాలతి. ఇప్పుడు మూలుగు గట్టిగా వినబడుతోంది. అది తలుపులకు అవతలివైపునుంచి వస్తోంది. మూలుగుతున్నది మనిషే! కానీ ఆ మూలుగు అదోరకంగా విచిత్రంగా ఉంది.

మాలతి తలుపు తీయడానికి తటపటాయించింది. ఒక వేళ ఎవరైనా దొంగవాడు అలా నటిస్తున్నాడేమో?

వాడు దొంగాడయితే తనింట్లో ఏముంది—ఎత్తుకుపోవడానికి?

ఇంట్లో తనూ—బాబూ తప్ప ఎవ్వరూ లేరు. బాబు అదృష్టవంతుడు. వాడు నిద్రపోతున్నాడు. తనకు నిద్ర పట్టడంలేదు.

దొంగాడు కాని పక్షంలో వాడు...

ఆ భయంకూడా మాలతికి ఎక్కువగానే ఉంది. ఈ రోజుల్లో ఆడదానికి పూర్వపు విలువలు లేవు. పెళ్ళయిందని తెలిసినా మగాళ్ళకు వెధవ బుద్ధులు పోవడంలేదు. బస్సులో రష్‌గా ఉన్నప్పుడూ, సినిమాహాలు వద్ద గుంపు అదుపు తప్పినప్పుడూ, వగైరా అవకాశాలు వచ్చినప్పుడు మగవాళ్ళు అసభ్యంగా ప్రవర్తించడం ఆమెకు అనుభవంలో లేకపోలేదు. అందువల్ల ఎవడైనా తనకోసం ఆశపడి వచ్చాడని ఆమె భ్రమపడినా ఆశ్చర్యంలేదు.

అయితే ఆ మూలుగు ఆమె చెవిలో పడుతూనేవుంది.

ఆమెలోని రకరకాల భయాలను జయించి-ఆమె చేత ఆఖరికి తలుపును తీయించగలిగింది. తలుపులు తీయగానే కనబడ్డ దృశ్యం మాలతిని నిశ్చేష్టురాల్ని చేసింది. భయమూ ఆశ్చర్యమూ ఒకేసారిగా కలిగాయీ మెకు.

ఒక మనిషి-పురుషుడే ఇంటి అరుగుమీద పడుకుని ఉన్నాడు. అతను గజగజ వణుకుతూ అప్పుడప్పుడు మూలుగుతున్నాడు. మనిషికి స్పృహ వుందో లేదో తెలియదు. మాలతి తలుపు తెరిచినప్పుడు వచ్చిన ప్రత్యేకమైన వెలుగు అతనిలో ఏవిధమైన మార్పునూ తీసుకురాలేదు.

## 2

మాలతి ఒక అడుగు వెనక్కి వేసి వీధరుగులమీది లైటుస్విచ్ నొక్కింది. అరుగు ప్రకాశవంతమైంది.

ఆ మనిషి యింకా అలా వణుకుతూ మూలుగుతూనే ఉన్నాడు.

మాలతి ధైర్యంచేసి అరుగుమీదకు వెళ్ళి ఆ మనిషిని సమీపించింది. ఏ క్షణంలోనైనా ఆ మనిషి చటుక్కున లేచి తన్ను పట్టుకోవచ్చునన్న అనుమానమూ, భయమూ ఆమెకు కలిగింది. అయినా ఆమె ధైర్యం తెచ్చుకుంది. కొద్దిగా వంగి ఆ మనిషిని "ఏమండోయ్-" అని పిలిచింది.

ఆ మనిషి మూలుగు ఆపలేదు. వణకడం మానలేదు.

ఒకనిముషం తటపటాయించి మాలతి అతనిముందుగా కూర్చుని ఏదో అనుమానంతో అతని నుదుటిమీద చేయి వేసి చూసి ఉలిక్కిపడింది. అతని శరీరం సలసలా కాగిపోతోంది.

మాలతి మనసులోని భ్రమలన్నీ తొలగి పోయాయి.

హఠాత్తుగా ఆమెలోని మానవత్వం మేల్కొంది. అప్పుడే ఆమె ఈ లోకంలోకి వచ్చింది. వెంటనే ఆమెకు జ్ఞానేంద్రియాలు పనిచేయడం ప్రారంభించాయి. అప్రయత్నంగా ఆమె ముక్కు మూసుకుని "అబ్బ!" అనుకుంది!
అక్కడ భరించలేని వాసనగా వుంది.

ఆ పురుషుడికి ఎంతో వయసుండదు. గడ్డం మాసి ఉంది. తైలసంస్కారంలేని జుట్టు. బట్టలు చిరిగిలేవు కానీ వాటికి అతుకులున్నాయి. అతను వాటిని ధరించి ఎంతకాలమయిందో తెలియదు కానీ అవి బాగా మాసి వున్నాయి. వాసన అతని బట్టలనుంచి వస్తోందో, ఒంటి నుంచి వస్తోందో చెప్పడం కష్టం. మనిషి చాలా అపరిశుభ్రంగా ఉన్నాడు.

మాలతి తటపటాయించలేదు. ఆమె అతన్ని తట్టి లేపడానికి అయిదారుసార్లు ప్రయత్నించి, ఆఖరికి బలవంతంగా లేవదీసి కూర్చోపెట్టింది.

అతనో పర్యాయం కళ్ళు తెరిచి లేచి నిలబడ్డాడు. ఆమె వైపు చూశాడు కానీ ఆ కళ్ళల్లో తెలివిలేదు. అతనికి జ్వరం చాలా ఎక్కువగా ఉన్నదని మాలతికి తోచింది. ఆమె అతన్ని ఇంట్లోకి నడిపించింది. అతని చేయిపట్టుకుని పడిపోకుండా జాగ్రత్తగా లోపలికి తీసుకువెళ్ళి మంచం మీద పడుకోబెట్టింది.

ఆ క్షణంలో అతను పరాయి మగవాడనీ, అతన్నింట్లో ఉంచుకోవడం ప్రమాదమని మాలతికి తోచలేదు. ఆ వ్యక్తి పడుకోగానే పదేళ్ళ కొడుకుని లేపి—"బాబూ గమ్మున మన డాక్టరుగారింటికివెళ్ళి అమ్మ అర్జంటుగా రమ్మంటోందని చెప్పి పిల్చుకునిరా—" అంది. బాబు విసుక్కుంటూనే వెళ్ళి డాక్టర్ని తీసుకువచ్చాడు.

డాక్టర్ ఆ మనిషిని సమీపిస్తూనే చటుక్కున ముక్కు మూసుకుని—"అబ్బా - ఇదెక్కడి వాసన? అమ్మా - మాలతీ— ఈయనెవరు? మీకు బంధువా?" అన్నాడు.

మాలతి పరిస్థితి చెప్పింది.

డాక్టర్ అతన్ని పరీక్షించి—ఏవో ఇంజక్షన్ చేశాడు. తన పెట్టిలోంచి ఏవో బిళ్ళలు తీసిచ్చి ఎలా వాడాలో చెప్పి—"ముక్కు మొహం ఎరగని వాణ్ణింట్లో పెట్టుకున్నావ్—ఏమైనా ప్రమాదం జరిగితే?—" అన్నాడు.

"అన్నింటికీ ఆ దేవుడే ఉన్నాడు—" అంది మాలతి.

"రేపటికి జ్వరతీవ్రత తగ్గవచ్చునేమో కానీ - ఇంకా రెండు మూడ్రోజులవరకూ ఇతను మంచంమీద ఉండక తప్పదనుకుంటాను. అంతవరకూ ఇతనివల్ల నీకే ప్రమాదమూ ఉండదు -" అన్నాడు డాక్టర్.

"నా ప్రమాదం సంగతి ఎలా ఉన్నా - అతనికి ప్రమాదం తప్పినట్లేనా డాక్టర్!" అంది మాలతి.

"అతనికేం ప్రమాదంలేదు..." అని వెళ్ళిపోయాడు డాక్టర్.

ఆ రాత్రి తెల్లవార్లూ అతను మూలుగుతూనే ఉన్నాడు. మాలతికి నిద్రలేకుండానూ చేశాడు.

మర్నాడుదయం ఎనిమిది గంటల ప్రాంతంలో అతనికి తెలివి వచ్చింది. ఓసారి చుట్టూ పరికించి - "నేనెక్కడున్నాను..." అన్నాడు.

ఆ సమయంలో మాలతి అక్కడే ఉంది. అతని ప్రశ్నకు సమాధానంగా ఆమె రాత్రి జరిగిన వివరాలన్నీ చెప్పింది.

"అమ్మా - నువ్వెవరో కానీ దేవతవు..." అన్నాడతను.

"నా సంగతి తర్వాత చూద్దాం కానీ మీరెవరో మీ వివరాలేమిటో చెప్పండి...."

అతను ఆమెవంక ఆరాధనా పూర్వకంగా చూసి - "నా వేషాన్ని చూసి మీరు అంటూ మన్నించే మనుషులే తప్ప వ అక్కడే నీ గొప్ప గుణం తెలుస్తోంది. నేను సామాన్యుణ్ని. నా గురించి ఎవరికీ చెప్పుకోడానికి ఏమీ లేదు..." అన్నాడు. ఒక్క క్షణం ఆగి - "నేను నిన్ను మన్నించలేదని అన్యథా భావించకు. కన్న తల్లినీ, తోడ బుట్టిన చెల్లినీ నువ్వనిపిలిస్తేనే తృప్తిగా ఉంటుంది. నువ్వూ నన్నలాగే పిలు..." అన్నాడు.

మాలతి అతని వంక ఆశ్చర్యంగా చూసింది. అతని బుద్ధి మంచిదనీ - అతను చాలా తెలివైనవాడనీ మాట లనుబట్టి అనిపిస్తోంది. అయితే పరిచయం పెరిగాక కానీ మనుషుల అసలు రంగులు బయటపడవు.

"అయితే నిన్ను అన్నయ్యా అని పిలుస్తాను. నా కోరిక మన్నించి నీ బట్టలు మార్చుకో. వాసన భరించ లేకుండా ఉన్నాము..." అంది మాలతి.

అతను అదోలా నవ్వి - "చూడమ్మా - వాసనను భరించలేనని నువ్వు నిన్ను మోసం చేసుకుంటున్నావు. ఈ ప్రపంచమంతా మోసం, అన్యాయం, కుళ్ళు. ఆ విష యం మీ అందరికీ తెలుసు. అయినా ఆ వాసన భరించ గల్గుతున్నారు. అటువంటి మీకు నా వాసన భారం కాకూడదు. నేను చాలా అరుదుగా స్నానం చేస్తాను. అందుకే నా వంటికి ఈ వాసన. అయితే నా శరీరం స్నానానికి నోచుకున్న రోజున ఈ ప్రపంచంలోని శత కోటి అన్యాయాలలో ఒకటి తొలగించబడిందని అర్థం! నా వేదాంతం మీ కర్థంకాదు కానీ మీ ఇంట్లో ఉండ

డానికి నేను బట్టలు మార్చుకోవడం ఒక షరతు అయిన పక్షంలో నేను తక్షణం వెళ్ళిపోతాను. ఎందు కంటే నాకు ప్రస్తుతం ఒక బాధ్యత ఉంది. అదితీరేక స్నానానికి మీ ఇంటికే వస్తాను. అంతవరకూ స్నానం ప్రసక్తి నావద్ద రాకూడదు -" అన్నాడు.

అతని మాటలన్నీ జ్వరానికి సంబంధించిన సంధి ప్రేలాపనగా మాలతి భావించింది. -"ఈ జబ్బుతో ఇప్పుడెక్కడికి వెడతావులే - నీకు నచ్చితే ఇలాగే ఉండు -" అంది మాలతి.

తర్వాత డాక్టరు వచ్చినపుడు అతని మాటలు చెప్పింది మాలతి -"చిత్రమైన మనిషిలాగున్నాదే?" అన్నాడు డాక్టర్ ఆమె చెప్పినవన్నీ విని. అయితే ఆయన ఆ మనిషితో అట్టే మాటలు పెట్టుకోలేను. అతని వాసన భరించడం ఆయనకు కష్టంగా ఉంది.

"ఇతనికి జ్వరం తగ్గ ముఖం పట్టినట్లే..." అన్నాడు డాక్టర్ వెళ్ళేటప్పుడు.

ఆ మర్నాడు పొద్దున్నకు అతనికి నార్మల్ కు వచ్చింది. మాలతి ఎంత బలవంతపెట్టినా వినకుండా అతను వెళ్ళిపోవడానికి సిద్ధపడ్డాడు.

"ఒక్కరోజు పథ్యం తిని విశ్రాంతి తీసుకుని వెళ్ళన్నయ్యా -" అంది మాలతి.

"వద్దమ్మా - నీలా ఆదరించే ఆడవాళ్ళు ప్రపంచంలో అరుదు. నీ ఋణం తీర్చుకునే అవకాశం నాకు వస్తుందో రాదో తెలియదు. నీ కెప్పుడు కష్టం వచ్చినా నాకు కబురుపెట్టు -" అన్నాడతను.

"నీ చిరునామా...?" అంది మాలతి.

"ప్రస్తుతానికి ఈ ఊరి గోడ్లు. ఈ ఊరు వదిలి వెళ్ళే

టప్పుడు నీవు చెప్పే వెడతాను. నా పేరు జోగినాథం''
అన్నాడతను.

మాలతి అతనివంకే ఆశ్చర్యంగా చూస్తూ నిలబడింది.

## 3

''క్షమించాలి. మిస్టర్ జోగినాథం - మీ అనుమానా లకు ఆధారంలేదని చెప్పడానికి విచారిస్తున్నాను.''

''మీ విచారం సంగతి తర్వాత చూద్దాం - నావి అనుమానాలనీ, వాటికి ఆధారంలేదనీ ఎందు కనుకుంటు న్నారు?'' అన్నాడు జోగినాథం.

''ఎందుకేమిటి? ఎంత ప్రయత్నించినా ఒక్కటంటే ఒక్క క్లూ కూడా దొరకలేదు.''

''అందుకు కారణం మీ అసమర్థత కాకూడదా?''

''మిస్టర్ జోగినాథం! మీరు మాటలు జాగ్రత్తగా రానివ్వాలి. నేను బాధ్యత గల ప్రభుత్వోద్యోగినన్న విషయం మరిచి పోతున్నారు.''

''చూడండి. నాకు మీమీద ఏవిధమైన కోపమూ లేదు. నేను నిజం తప్ప ఇంకోటి మాట్లాడను. అందువల్ల మీకు కాస్త బాధ కలిగించినా - బాధ్యతగల ప్రభు త్వోద్యోగులు నిజాన్ని భరించగలగాలి. నేను మీ కిది వరలో చెప్పినవి అనుమానాలు కాదు. బేర్ ఫాక్ట్స్! అవి మీకు చెప్పడానికి కారణం మీరు బాధ్యతగల ప్రభుత్వోద్యోగులు కావడం. అయితే మీ బాధ్యతను మీరు సమర్థవంతంగా నిర్వహించలేకపోయారు. ఆ విష యాన్ని నేను తప్పక ఋజువుచేయగలను...'' అన్నాడు జోగినాథం.

''ఎవరికి?'' అన్నాడతను.

"ఎవరికో ఋజువుచేసి మిమ్మల్ని నవ్వులపాలు చేయవలసిన అవసరం నాకులేదు. నేనేం ఋజువుచేసినా మీకే చేస్తాను..." అన్నాడు జోగినాథం.

"నావల్ల కానిపని మీవల్ల నవుతుందనుకుంటున్నారా?

"మీరు సీబీఐకు చెందిన మనిషి. అయితే ఇంటి బయట మీ నేమ్ ప్లేట్ ఇంకో విధంగా తగిలించారు. అయినా మీరెవరో నేను తెలుసుకో గలిగాను. మీకు ముఖ్యమైన బాధ్యతకూడా అప్పగించాను. ఇవన్నీ ఎలా చేయగలిగా ననుకుంటున్నారు?"

"మిస్టర్ జోగినాథం _ మీరు నాకు చెప్పిన విషయాలు ఋజువుచేస్తే_మీరు చెప్పినట్లు వింటాను..." అన్నాడా సీబీఐ ఆఫీసరు.

"నేను చెప్పినట్లు వినడం మీవల్లకాదు..."అన్నాడు జోగినాథం.

"ఎందుకని?"

"మీరుకూడా నాకులా ఉండగలరా? అంటే_ఇలాగే స్నానం చేయకుండా, మాసిన బట్టలు కట్టుకుని..." అని నవ్వాడు జోగినాథం.

"ఏమిటి దానివల్ల ప్రయోజనం?"

"లక్ష్యం ఏర్పడుతుంది. నేననుకున్నది సాధించే వరకూ నేను స్నానం చేయను. బట్టలు మార్చను. లక్ష్మణుడిలా నిద్రాహారాలు విసర్జించలేని నాకు సులువైన మార్గమిదే కనబడింది..." అన్నాడు జోగినాథం.

"అదికాదు మీరు చెప్పినట్లు వినడమంటే..." అని అతను నవ్వి _ "ఇప్పుడు మీరు చెప్పింది ఋజువు చేయగలిగితే, ఇంక మీదట మీరేమైనా చెబితే ఆ పనిసాధించి తీరాను." అన్నాడు.

"ఇప్పుడే నేను రంగంలో ప్రవేశిస్తున్నాను. అయితే అందుకు మీ సహకారం కావాలి. అది తప్పక లభిస్తుందని నా ఆశ!" అన్నాడు జోగినాథం.

# 4

సాంబయ్యగారింట్లో చాలా హడావుడిగా ఉన్నదా రోజు. మర్నాడు సాంబయ్యగారి ఏకైక సంతానం రాజారావు జన్మదినం! ప్రతి ఏటా పెద్ద ఎత్తున ఆ ఇంట్లో జరిగే వేడుక ఇది.

సాంబయ్య కోటీశ్వరుడు కాదు, లక్షాధికారికాదు, నాలుగు వేళ్ళు నోట్లోకి పోయేటంత ధనికుడు కూడా కావడానికి వీల్లేదు. అతను అతిమామూలు గుమస్తా! అతనికి తల్లి, తండ్రి ఉన్నారు. భార్య ఉంది. పదేళ్ళ కొడుకున్నాడు.

అతనికి వచ్చే జీతం ఇంటి ఖర్చులకు బొటాబొటీగా సరిపోతుంది. అయినా ఏటా కొడుకు పుట్టిన రోజు పండుగ అత్యంత వైభవంగా జరుపుకుంటాడు. అల్లారు ముద్దుగా పెరిగిన ఏకైక పుత్రుడి పుట్టినరోజు విషయంలో మాత్రం అతను ఎంత ఖర్చయినప్పటికీ సందేహించడు.

ఊళ్ళో తెలిసిన వారందర్నీ పిలిచారు. పొరుగూళ్ళలో ఉన్న బంధువులకూ—డా ఆహ్వానాలు వెళ్ళాయి. ఇంట్లో పెద్ద ఎత్తున స్వీట్సు ప్రిపేర్ చేస్తున్నారు. ఇంట్లో బంధుజనం చాలామంది ఉన్నారు. ఛలోక్తులతో వాళ్ళందరూ సరదాగా సమయం గడుపుతున్నారు.

ఉన్నట్లుండి ఇంట్లోని ఓ ముసలమ్మ—"ఈ వేడుక ఎవరి గురించి జరుగుతోందో—వాడేడ్రా—" అంది.

"వాడు స్కూల్లో ఉన్నాడు..." అన్నారెవరో.

"ఏడిపిస్తేనే ఉంది. మనమంతా సరదాగా కబుర్లు చెప్పుకుంటూంటే వాడేమో ఈసురోమంటూ స్కూల్లో ఏడుస్తున్నాడా_ఎవర్నయినా పంపించి వాణ్ణింటికి పిలిపించండి..." అందా ముసలమ్మ ఆజ్ఞను జారీ చేస్తున్నట్లుగా.

కొంతమంది పిల్లాడి స్కూలు పాడుచేయడం అనవసర మన్నారు. ఎలాగూ రేపు స్కూలు మానేస్తున్నాడుగా అన్నారు. అయితే మరి కొంతమంది ఒక్కరోజులో పిల్లాడి చదువు పాడయ్యేదేమీ లేదన్నారు. పుట్టిన రోజుపూట మానడం విశేషం కాదు_అంతకు ముందురోజు కూడా ఆనందించాలన్నారు. ఆఖరికి స్కూలుకు ఓ మనిషిని పంపాలనుకున్నారు. ఆ మనిషి పేరు వరహాలరావు.

వరహాలరావు ఉత్సాహంగా స్కూలుకు వెళ్ళాడు. అతను స్కూలుకు వెళ్ళేసరికి ఉండవలసిన క్లాసులో రాజారావు లేడు.

"సరిగ్గా పదిహేనునిమిషాల క్రితం ఎవరో సాంబయ్యగారు పంపగా వచ్చి రాజారావుని పిల్చుకుని వెళ్ళిపోయారు..." అన్నాడు క్లాసు టీచరు.

వరహాలరావు నిరుత్సాహంగా క్లాసులోంచి బయటకు వచ్చేశాడు. చేసేది యేమీ లేదు కాబట్టి అతను ఇంటికి తిరిగి వెళ్ళాడు.

"రాజు ఏడీ?" అంది రాజారావు తల్లి.

"వాళ్ళ నాన్నగారు యెవరో మనిషిని పంపి పిల్చుకు వెళ్ళారుట" అన్నాడు వరహాలరావు.

"రేపు పుట్టినరోజుగదా _ ఏవో కొనడానికయుంటుంది..." అన్నాడో ముసలాయన.

రాజారావు తల్లి నిరుత్సాహంగా_"ఇద్దరూ కలిసి బజా

రకు వెళ్ళేరంటే- ఓపట్టాన తిరిగిరారు. వాడడిగినవన్నీ కొనాలని ఆయన పంతం. ఆయన వద్ద నేదాకా అడగాలని వాడి పంతం. ఆఖరుకి దుకాణాలన్నీ మూయించి ఇంటికి వస్తారు...'' అంది.

''ఎలాగైనా కుర్రాడు అదృష్టవంతుడు. తండ్రి గుమస్తా అయితేనేం, అడిగినవన్నీ కొనిపెడతాడు...'' అనుకున్నాడు వరహాలరావు మనసులో. అతని తండ్రి కాస్త ఉన్నవాడే. అయినా అతనికు డబ్బు పిచ్చి. ఉన్నంతలో నాలుగు డబ్బులు వెనకేసుకోందామనే ఆయన ఆలోచన.

ఇంతలో ఆఫీసునుంచి ప్యూన్ అప్పారావు వచ్చాడు. రాజారావు తల్లి ఆత్రుతగా ఎదురువెళ్ళింది. ''అయ్యగారు పంపారండి. ఆఫీసులో అనుకోని పని తగిలిందండీ. కాస్త ఆలస్యంగా వస్తారుట. అబ్బాయిగారు స్కూల్నించి రాగానే వారికేమైనా కావాలంటే వరహాల్రావుగారికి డబ్బిచ్చి బజారుకి పంపించమన్నారు—'' అన్నాడు అప్పారావు.

ఆవిడ కంగారుగా-''ఏమిటీ-రాజు అక్కడలేడూ?'' అంది-

అప్పారావుకు విషయం అర్థంకావడానికి పదినిముషాలు పట్టింది. అతను కంగారుగా ఈ వార్త అందించడానికి ఆఫీసుకు పరుగెత్తాడు. ఈలోగా అంతా కలసి వరహాలరావుని మళ్ళీ స్కూలుకు పరుగెత్తించారు.

వరహాలరావు స్కూలుకు వెళ్ళి కనుక్కోగా-ఎవరో నీలం పాంట్, ఎర్ర చొక్కా వేసుకున్న సుమారు పాతికేళ్ళ మోడ్రన్ యువకుడు రాజారావును పిల్చుకుని వెళ్ళి నట్లు చెప్పారు.

వరహాలరావు నీరసంగా మళ్ళీ రోడ్డుమీదకువచ్చాడు. అతను నాలుగడుగులు వేసేసరికి ఓ మనిషియెదురై "మీరు సాంబయ్యగారింటికొచ్చిన బంధువులు కదూ—" అన్నాడు.

"అవును—మీకెలా తెలుసు?" అన్నాడు వరహాల రావు.

"ఈ ఉత్తరం కాస్త సాంబయ్యగారి కందజేయండి" అన్నాడు ఆ మనిషి. వరహాలరావా ఉత్తరం అందుకో గానే ఆ మనిషి క్షణాలమీద అక్కణ్ణించి వెళ్ళి పోయాడు.

# 5

అప్పారావు చెప్పిన వార్త వింటూనే సాంబయ్య కంగారుపడ్డాడు. బెంగ, బాధ, భయం—అన్నీ ఆయన ముఖంలో ఒక్కసారిగా కనపడ్డాయి.

"ఏది ఏమైనా ముందుగా నేను పోలీసు రిపోర్టివ్వా లేమో!" అని మనసులోనే గొణుక్కున్నాడు. తన ప్రాణాలకు ప్రాణమైన కొడుక్కైనా ప్రమాదం వాటిల్లుతుందన్న ఊహతోనే ఆయన గజగజా వణికి పోతాడు.

ఒక్కక్షణంపాటు ఆయనకు కాళ్ళూ చేతులూ ఆడ లేదు. ఆయన బుర్ర పనిచేసేలోగా ఎవరో ఆయన్ను సమీపించి—"సార్! మీ కక్కణ్ణించో టెలిఫోన్ వచ్చిం దండి" అన్నారు. సాంబయ్య పరుగులాంటి నడకతో ఫోన్ వద్దకు వెళ్ళి రిసీవర్ యెత్తి "హల్లో - సాంబయ్య స్పీకింగ్..." అన్నాడు.

"సాంబయ్యగారా? నమస్కారం. మీ కుర్రాడి గురించి మీరేమీ భయపడకండి. ఇంటికెళ్ళి వరహాల

రావుతో మాట్లాడితే అన్నీ చక్కబడతాయి."

"ఎవరు మీరు?" అన్నాడు సాంబయ్య.

"నేనేనండీ బావగారూ–అనవసరంగా కంగారుపడి పోలీసు రిపోర్టిస్తే–అభాసవుతారని భయపడి ఫోన్ చేశాను" అంటూ ఫోన్ పెట్టేశాడు అవతలి వ్యక్తి.

తన్ను బావగారూ అని పిలిచిన ఆ వ్యక్తి ఎవరో సాంబయ్యకు తెలియలేదు. ఇంటికొచ్చిన బంధువుల్లో ఎవరో ఒకరయ్యుండాలనీ–కంగారుగా ఫోన్ చేసి ఉంటాడనీ సాంబయ్య అనుకున్నాడు. ఆయన మనసు కాస్త తేలికపడింది.

సాంబయ్య ఇంటికి వెళ్ళేసరికి అంతా ఇంకా కంగారుగా ఉన్నారు. ఆయన హడావుడిగా "వరహాల్రావేడీ?" అన్నాడు.

"వాడిక్కడే వున్నాడు..." అన్నారెవరో. అంతలోనే వరహాలరావు ముందుకు వచ్చి "ఏం పెదనాన్నా?", అన్నాడు.

"రాజారా వెక్కడ?" అన్నాడు సాంబయ్య ఆత్రుతగా.

వరహాలరావు కంగారుపడిపోయి "ఈ ప్రశ్న నన్నడిగితే నేనేం చెప్పగలను?" అన్నాడు నెమ్మదిగా.

సాంబయ్య తనకు వచ్చిన ఫోన్ వివరం చెప్పాడు. ఆయనలో ఇప్పుడు మళ్ళీ కంగారు మొదలయింది.

"అన్నట్లు–పెదనాన్నా–నీ కిమ్మని ఎవరో పెద్దమనిషి స్కూలుదగ్గర ఓ ఉత్తరం ఇచ్చాడు—" అంటూ జేబులోంచి కవరు ఒకటి తీసి సాంబయ్యకు అందించాడు వరహాలరావు.

సాంబయ్య ఆ కవరు అందుకుని చించాడు. అందులోని

ఉత్తరం పైకితీసి చదువుతూంటే ఆయన చేతులు వణుకుతున్నాయి. చదవడం పూర్తయ్యేసరికి ఆ కాగితం ఆయన చేతుల్లోంచి జారిపోయింది. ఆయన కుప్పలా నేలమీద చతికిలబడిపోయాడు.

"ఏమిటి రాసుందందులో?" అన్నారెవరో కుతూహలంగా.

"ఈ ఉత్తరానికీ రాజారావు కనిపించక పోవడానికీ సంబంధముంటుందని నా పాడు బుర్రకు తట్టనేలేదు..." అంటూ వరహాలరావు క్రిందపడ్డ ఆ కాగితం తీసి అందరూ వినేలా పైకి చదవసాగాడు.

"డియర్ సాంబయ్యా!"

నీ కొడుకుకోసం ఏమైనా చేయగలనని అంటూంటావు. అర్జంటుగా నాకో యాభై వేలు కావాలి. ఇవ్వగలవా? ఇస్తే నీ కొడుకు మళ్ళీ నీ ఇంటికి తిరిగి వస్తాడు. ఇవ్వక పోతే నీ కొడుకు శవం నీ ఇంటికి వస్తుంది. ఈ వార్త నీ నోరు దాటి పోలీసులకు వెళ్ళిందా—రాజారావు ఫినిష్! నీకు సరిగ్గా మూడే మూడు రోజులు గడువు. అంతకంటే నేను ఆగలేను. ఏ సంగతీ రేపు నీకు ఫోన్ చేసినప్పుడు చెప్పు. —ఇట్లు, నీ శ్రేయోభిలాషి"

అక్కడున్న బంధుజనంలో హఠాత్తుగా నిశ్శబ్దం ఏర్పడింది. ఆ నిశ్శబ్దం రెండు క్షణాలపాటు మాత్రమే నిలిచింది. మళ్ళీ గుసగుసలు ప్రారంభమై, కోలాహలం ప్రారంభమైంది. ఆ కోలాహలం మళ్ళీ నిశ్శబ్దంగా మారిపోయింది సాంబయ్య లేచి నిలబడడంతో.

"మీ అందరకూ ఒక చిన్న మనవి! ఈ క్లిష్ట పరిస్థితిలో నాకు కర్తవ్య బోధ చేయగలవారున్నారా? ఉంటే ముందుకు వచ్చి సాయం చేయండి..." అన్నాడు. ఆయన

కంఠంలో ఏడుపు జీర తెలిసిపోతుంది.

బంధుజనంలో ఎవరూ ముందుకు రాలేదు. ఏమని చెప్పాలో ఎవరికీ తోచడంలేదు. పోలీసులకు చెప్పమందామంటే - కుర్రాడి ప్రాణాలు పోవచ్చు. పోనీ డబ్బిచ్చి విడిపించుకోమందామంటే అంత డబ్బొక్కసారిగా సామాన్య మధ్య తరగతి సంసారుల కెక్కణ్ణుంచి వస్తుంది?

ఎవరూ మాట్లాడక పోవడం చూసి సాంబయ్య మళ్ళీ అన్నాడు-"పోనీ-మీలో ఎవరైనా నాకు అప్పుగా తోచినంత డబ్బు సాయం చేయగలరా? అందరూ తలో అయిదువేలూ వేసుకుంటే యాభైవేలు పోగవడం కష్టం కాదు."

ఈ మాటలు అని సాంబయ్య అందరికంకా చూశాడు. ఎవ్వరూ మాట్లాడలేదు. చాలామంది ముఖకవళికలు కనిపించకుండా తలలు దించుకున్నారు.

"ఇంతకాలం నా సుఖాల్లో పాలు పంచుకోవలసిందిగా నేను కోరుతూంటే మన్నించి ప్రతి యేటా నా ఇంటికి వచ్చివెడుతున్నారు. అనుకోకుండా ఈ రోజు ఈ కష్టం వచ్చి పడింది. నాకష్టాల్లో సాయపడడానికెవ్వరూ ముందుకు రాలేరా?" అన్నాడు సాంబయ్య దీనంగా.

ఎవ్వరూ ముందుకు రాలేదు - "అంతా మధ్య తరగతి వాళ్ళమే - యేదో మాటసాయం, పనిసాయం అంటే మావల్లవుతుందికానీ ధనసాయం కావాలంటే ఎక్కడ కుదురుతుంది?" అన్నాడో ముసలాయన.

"అయితే దయుంచి అందరూ వెళ్ళిపోండి. నన్ను ప్రశాంతంగా ఆలోచించుకోనివ్వండి. ఎలాగూ పుట్టిన

రోజు వేడుక జరుగబోవడంలేదు. దేవుడు దయతల్చి మళ్ళీ సంవత్సరం పుట్టినరోజు వేడుక మా ఇంట్లో జరిగితే-మిమ్మల్నందర్నీ తప్పక పిలుస్తాను. వెళ్ళేముందో చిన్న విన్నపం. మా అబ్బాయి తప్పిపోయినట్లు మాత్రం ఎక్కడా అనకండి..." అన్నాడు సాంబయ్య.

రాత్రయ్యేసరికి-బంధుజనంతో కోలాహలంగా వుండిన సాంబయ్య ఇల్లు-బావురుమంటూ వుంది. వారి కుటుంబ సభ్యులలో యిప్పుడు ఓ మనిషి తక్కువగా వున్నాడు. అతను రాజారావు!

# 6

"రిక్షా ఆపు!" అంది మాలతి.

రిక్షా ఆగింది. అందులోంచి మాలతి, ఆమె భర్త దిగారు. మాలతి హడావిడిగా అడుగులు వేసి—"అన్నయ్యా!" అని పిలిచింది.

రోడ్డుపక్క కూర్చుని ఆకాశంకేసి దిక్కులు చూస్తూ తనలో తనే నవ్వుకుంటున్న జోగినాథం ఉలిక్కిపడి "ఎవరూ?" అన్నాడు.

"నేనే అన్నయ్యా!" అంది మాలతి.

జోగినాథం ఆమెను గుర్తుపట్టాడు. చటుక్కున లేచి నిలబడి "ఏం జరిగిందమ్మా!" అన్నాడు. అప్పటికి మాలతి భర్తకూడా వచ్చి ఆమెపక్క నిలబడ్డాడు. అతను జోగినాథంవైపు జుగుప్సాకరంగా చూస్తున్నాడు...

మాలతి కళ్ళలో నీళ్ళు తిరిగాయి. "ఒక్కడంటే ఒక్క కొడుకు. వాణ్ణెవ్వరో ఎత్తుకెళ్ళిపోయారు..." అందామె.

"మీ అబ్బాయినెవరో ఎత్తుకపోయారా? ఎందుకు?" అన్నాడు జోగినాథం.

"ఎందుకో తెలియదు. కానీ వాణ్ణి మేము ప్రాణాలతో తిరిగి చూడాలంటే పదివేలరూపాయలివ్వాలి. ఎక్కణ్ణించి తెచ్చేది?" అంది మాలతి.

"పోలీసు కంప్లయింటివ్వలేకపోయారా?"

"అలా చేస్తే కుర్రాడి ప్రాణాలు దక్కవన్నారు. ఏం చేయాలో దిక్కుతోచక డబ్బుకోసం అయినవాళ్లనీ కానివాళ్లనీ దేబిరిస్తూంటే నువ్వు కనబడ్డావు. నీవల్ల ఏదైనా సాయం జరుగుతుందేమోనని..." అంది మాలతి.

మాలతి భర్త నవ్వి "బాగానే ఉంది వ్యవహారం. కట్టుగుడ్డలు ఉతికించుకోలేనివాళ్ళను డబ్బు సాయం అడుగుతున్నావు. నీకు మతిగానీ పోలేదు కదా?" అన్నాడు.

జోగినాథం అదోలా నవ్వి—"వేషం చూసి మోస పోకండి బావగారూ! రేపుదయానికి మీకు పదివేల రూపాయలిస్తాను. దాంతో మీ పిల్లాడిని విడిపించుకుందురు గాని..." అన్నాడు.

"నిజంగానా—" అంది మాలతి.

"నన్ను నమ్ము. ఇంత త్వరగా నీకు సాయపడే అవకాశం వస్తుందనుకోలేదు. ఈ రాత్రికే అవసరమైన డబ్బు సంపాదించుకుని వస్తాను. తెల్లారేసరికి మీ ఇంటి ముందు డబ్బుతో ఉంటాను. ఆ డబ్బు మీరు నాకు తిరిగి ఇవ్వవలసిన అవసరంకూడా ఉండదు" అన్నాడు జోగినాథం.

"మూడంటే మూడురోజులు గడువిచ్చారు వాళ్ళు" అంది మాలతి.

"ఇలాంటి కేసు ఇదొక్కటేనా? ఇంకా యేమైనా జరిగాయా___? నీకేమైనా తెలుసా? ఈ సమాచారం నా కుపయోగపడుతుంది..." అన్నాడు జోగినాథం.

"నాకు తెలియదు. ఒకవేళ జరిగినా యెవరూ బయట పెట్టుకోరుకదా_అందరికీ హెచ్చరికలు అందేవుంటాయి" అంది మాలతి.

"సరేలే_నువ్వుమాత్రం నిశ్చింతగా ఉండు. నామాట నమ్మి నామీద గురి యేర్పరచుకున్నవాళ్లెవ్వరూ యింత వరకూ నష్టపోలేదు. అసంతృప్తి చెందలేదు. నీ కొడుక్కే ప్రమాదమూ లేదు. నా అభయం లభించింది" అన్నాడు జోగినాథం. ఈ మాట లని అతను లేచి నిలబడ్డాడు.

"మాలతీ_నీకు పిచ్చిగానీ పట్టలేదుగదా_ఆ ముష్టివెధవ నెవణ్ణో వరసపెట్టి అన్నయ్యా అని పిలవడమేకాక డబ్బు కూడా అడగడమేమిటి? వాణ్ణిచూస్తుంటేనే తెలియడం లేదూ_నెత్తిమీద రూపాయిపెట్టి అయిదుపైసలకమ్మినా వాణ్ణెవరూ కొనుక్కోరు..." అన్నాడు మాలతి భర్త చిరాగ్గా మాలతితో కలిసి తిరిగి వెళ్ళిపోతూ.

"ఏమోనండీ_యే పుట్టలో యే పాముందో..." అని ఊరుకుంది మాలతి.

# 7

జోగినాథం ఆ భవనం గేటుముందు ఓ పదినిముషాలు తచ్చాడాడు. ఆఖరికి నెమ్మదిగా లోపల ప్రవేశించ బోయాడు.

"ఏయ్ ఆగు_" అన్నాడు కాపలావాడు.

"ఎందుకని?"

"ఈ క్లబ్ నీలాంటివాళ్ళకోసంకాదు."

"అఫ్టరాల్ కాపలావాడివి. నువ్వు నాకు చెప్పొచ్చేవా?" అన్నాడు జోగినాథం.

"నీలాంటివాళ్ళు లోపలకు వెళ్ళకుండా చూడ్డం కోసమేకదా నే నిక్కడ కాపలా కాస్తుంట?"

"అలా గే-అయితే అది నీ చేతకాని పని..." అంటూ జోగినాథం విసురుగా లోపలకు వెళ్ళబోయాడు. కాపలా వాడతన్ని పట్టుకుని వారించాడు.

"నిన్నోడించడం నాకు చాలా సులభం..."అన్నాడు జోగినాథం.

"ఎందుకని?"

జోగినాథం జేబులోంచి యాభైరూపాయల నోటుతీసి "తర్వాత నీ యజమానిముందు పొరపాటైపోయిందని ఒప్పుకున్నావనుకో. ఆ పొరపాటుకంటే ఈ డబ్బు వదులుకోవడమన్నది చాలా పెద్ద పొరపాటు—" అన్నాడు.

కాపలావాడా నోటును ఆప్యాయంగా అందుకుని— "నిన్ను నేను చూడలేదంటాను-నీ ఇష్టం. లోపలెలా మానేజ్ చేస్తావో" అన్నాడు.

జోగినాథం ఈలవేసుకుంటూ లోపల ప్రవేశించాడు' భవనంలోకి వెళ్ళబోయేముందు మరో వ్యక్తి అతన్ని అటకాయించాడు.

"ఈగోజు క్లబ్ అయిటమ్సులో నాదే ఓ స్పెషల్ అట్రాక్షన్—" అన్నాడు జోగినాథం. అతన్నటకాయించిన మనిషి అతనివంక ఓ పర్యాయం సందేహంగా చూసి ఊరుకున్నాడు.

ఆ క్లబ్‌లో చాలామంది జోగినాథం వంక ఆశ్చర్యంగా చూస్తున్నారు. అక్కడ అందరూ ఘుమఘుమలాడి

పోతున్నారు. తళతళ మెరిసి పోతున్నారు. వారి మధ్యన జోగినాథం ఓ శాపగ్రస్థుడిలా ఉన్నాడు. ఐనా అతని ముఖంలో విచారం లేదు.

ఓ అయిదు నిముషాలు గడిచాక ఓ మనిషి జోగినాథాన్ని సమీపించి_"ఎవరు నువ్వు? ఇక్కడికెందుకు వచ్చావ్?" అనడిగాడు.

"నా పేరు జోగినాథం. అందరికిలాగే వచ్చాను." అన్నాడు జోగినాథం.

"ఇంపాసిబుల్. నువ్వు తక్షణం బయటకు వెళ్ళాలి.".

"అలా అనొద్దు. ఎందుకంటే మీ క్లబ్ నన్నుగ్రహించి ఈ రోజు కిక్కడికి వచ్చాను. నేను రేపు రమ్మన్నా రాను..." అన్నాడు జోగినాథం.

"నిన్ను రమ్మనడమా?" అని ఆ మనిషి హేళనగా నవ్వి-"ఇప్పుడు ఈ క్షణంలో నిన్ను బయటికి గెంటించగలను..." అన్నాడు.

"నాశక్తిని తక్కువగా అంచనా వేస్తున్నట్లున్నావు. నేను ఒక్క చేత్తో పదిమందికి సమాధానం చెప్పగలను. ఇక్కడ చాలా ఖరీదైన ఫర్నిచర్ కనబడుతోంది. అదంతా పాడుచేసుకోవాలనుకుంటే నన్ను బయటికి పంపడానికి ప్రయత్నించండి..."అన్నాడు జోగినాథం.

ఆ మనిషి ముఖంలో ఆందోళన కనబడింది_"అయ్‌సీ. అయితే క్లబ్ మెంబర్సుకి వినోదం కలిగించే విధంగా నీకో పరీక్ష పెడతాను. అందులో నెగ్గితే నీకు వెయ్యి రూపాయల బహుమతికూడా ఉంటుంది..." అన్నాడు.

"వెయ్యి రూపాయలా? నేనింకా ఎక్కువ ప్లాను మీదవచ్చాను. అయితే నాశక్తి నీవు తెలుసుకోవాల్సిన అవసరముంది కాబట్టి అందాకా ఒప్పుకుంటున్నాను..."

"అయితే నాతో రా..." అన్నాడా మనిషి.

# 8

"ఫ్రెండ్స్! మీ అందరికీ ఇప్పుడొక అద్భుత వినోద ప్రదర్శనం. మన క్లబ్ ఛాంపియన్ వస్తాడు గుండూరావుతో—ఓ కొత్త వ్యక్తి పస్తీ పడతాడు. ఈ ప్రదర్శన మీకు కలిగించబోయే వినోదం పోటీదార్ల నిద్దర్శి చూడగానే మీరర్థం చేసుకోగలుగుతారు..."

క్లబ్ లోని వేదిక పై దీపాలు వెలిగాయి. తెరతొలగింది. వేదిక పై ఉన్న ఇద్దరు మనుషుల్ని చూసి సభికులు నివ్వెర పోయారు. వారిలో ఒకతను కండలు తిరిగి ఏనుగులా ఉన్నాడు. రెండోవాడు బక్క పలచగా ఉన్నాడు.

"నా పేరే గుండూరావ్!" అన్న మనిషి కండలు మెరుస్తున్నాయి.

అపరిశుభ్రంగా, బిచ్చిగాడిలా ఉన్న మనిషి సభికులకు చేతులు జోడించి-"నమస్కారం. నా పేరు జోగినాథం. మీరనుకున్నంత వినోదం ఈ ప్రదర్శన ద్వారా మీకు లభించదు. నా ప్రతికక్షిని చిత్తుచేయడాని కింతవరకూ అయిదు సెకన్లకే మించి నేను తీసుకోలేదు. మీరు ప్రత్యేకంగా కోరితే తప్ప ఈ ప్రదర్శన ఎక్కువ సేపు కొనసాగదు..." అన్నాడు.

తర్వాత గుండూరావు, జోగినాథాన్ని సమీపించాడు. చూసే వాళ్ళకి జోగినాథం ఏమైపోతాడోనన్న కంగారు కలిగింది.

అయితే జోగినాథం గుండూరావుని గమనిస్తూనే ఉన్నాడు. అతను తనని సమీపించగానే తమాషాగా కాలు విసిరాడతను. అది గుండూరావు మోకాలి ప్రాంతంలో తగిలింది. గుండూరావు మొదలు నరికిన

వృక్షంలా బోర్లాపడిపోయాడు. చటుక్కున జోగినాథం గుండూరావుని సమీపించి రెండు భుజాలమీదా రెండు దెబ్బలు వేశాడు.

తర్వాత సభికులవైపు తిరిగి_"అయ్యా-మన్నించాలి. గుండూరావుగారు లేవడానికి కనీసం పదినిమిషాలు పడు తుంది. ఈ రోజు కింక ఆయన పోటీలో పాల్గొనగలరని నాకు తోచడంలేదు. ప్రదర్శన నాలుగు సెకన్లలోనే ముగిసింది. ఏమీ అనుకోవద్దు_" అన్నాడు.

కరతాళధ్వనులతో హాలు దద్దరిల్లి పోయింది. ఈ పోటీ ఏర్పాటుచేసిన మనిషి జోగినాథాన్ని సమీపించి_ "అద్భుతం! మా క్లబ్ చరిత్రలోనే ఇది ఒక అపూర్వ సంఘటన మిస్టర్ జోగినాథం_ఈ గంగాధరం మీకు సంతోషంగా వెయ్యి రూపాయల బహుమతి ఇచ్చు కుంటున్నాడు..." అంటూ పది వంద రూపాయిలనోట్లు అందించాడు.

"ఈ హాల్లో ఫర్నిచర్ లక్షరూపాల విలువచేస్తుంది. వెయ్యి రూపాయిల ఖర్చులో లక్షరూపాయల ఫర్నిచర్ని రక్షించుకున్నావ్ మిస్టర్ గంగాధరం. అభినందిస్తు న్నాను" అన్నాడు జోగినాథం. అప్పుడే హాల్లో కేకలు మొదలయ్యాయి. జోగినాథాన్ని తమ మధ్యకు తీసుకు రావలసిందిగా చాలామంది కోరుతున్నారు.

జోగినాథం మళ్ళీ మనుషుల మధ్యకు వెళ్ళాడు. అయితే ఎవ్వరూ అతిని వంక జుగుప్సాకరంగా చూడడం లేదు. కొంతమంది ఆడవాళ్ళు ఆరాధనా భావంతో చూస్తున్నారు కూడా! కొత్తకొత్త ఫేషన్లకోసం యువతరం గంగ వెర్రులెత్తుతున్న ఈ రోజుల్లో అతని వేషంకూడా బాగానే ఉందనిపించింది.

ఒకమ్మాయి ఛటుక్కున అతన్ని సమీపించి కాగ నించుకున్నంత పని చేసి—"అబ్బ-వాసన!" అని ముక్కు మూసుకుంది.

"చూశావా-నా కిష్టంలేని వాళ్ళనుంచి తప్పించు కోడానికీ వాసన ఎంత ఉపయోగపడుతోందో—" అన్నాడు జోగినాథం.

"మిస్టర్ జోగినాథం..." అన్నాడు గంగాధరం. "మీరిక్కడకు వచ్చిన పనేవిటో చెబితే..."

"డబ్బు కావాలి..." అన్నాడు జోగినాథం.

"ఎంత?"

"పదివేలు..."

"చేతనైతే సంపాదించుకోవచ్చు. ఇంకో పది నిము షాల్లో మూడు ముక్కలాట ఆరంభం కానుంది..." అన్నాడు గంగాధరం.

"అందుకేగా లోపలకు వచ్చేను..." అని నవ్వాడు జోగినాథం.

"డబ్బుందా?"

"ఇక్కడకు వచ్చేక సంపాదించినదే ఉంది-వెయ్యి రూపాయలు."

గంగాధరం తడబడి—"మా క్లబ్ ఆటగాడు రమేష్ నింతవరకూ ఎవ్వరూ నెగ్గలేదన్న విషయం తెలుసా?" అన్నాడు.

జోగినాథం చిరాగ్గా—"అటు స్టేజికేసి చూడండి. పాపం సుందరారావింకా లేవలేదు. నిద్రపోతున్నాడో ఏమో!" అన్నాడు.

గంగాధరం కంగారుగా అక్కణ్ణించి వెళ్ళిపోయాడు. అతను వెళ్ళిపోయిన అయిదు నిముషాలకు అక్కడ దీపాలు

డిమ్ అయ్యాయి. సన్నగా పాశ్చాత్య సంగీతం వినిపించ సాగింది.

పదిమంది నర్తకీమణుల బృందం ఒక అరనగ్న నృత్యాన్ని ప్రదర్శించారు. ఆ డిమ్‌లైట్ల కాంతిలో ఆ నృత్యం మనుషుల్లో ఉద్రేకాన్ని కలిగించి, ప్రోత్సహించేదిగా వుంది. నృత్యం ముగింపుదశ చేరుకునేసరికి—నర్తకీమణులతోపాటు హాల్లోని పదిమంది మగవాళ్ళు కూడా అదృశ్యమయ్యారు. హాల్లో తిరిగి దీపాలు వెలిగాయి.

గంగాధరం జోగినాథాన్ని పలకరించి "ఎలా వుంది నృత్యం?" అన్నాడు.

"నేనిప్పుడే దేశంలో వున్నాను? అడుగుతీసి అడుగు వేస్తే అమ్మా, ఆకలి అని ఆక్రోశించే అభాగ్యులున్న దేశం ఇదేనా?" అన్నాడు జోగినాథం.

"ఛా-ఛా-ఒక్క రాత్రిలో పదివేలు సంపాదించడం కోసం కాపలావాడికి లంచమిచ్చి అక్రమంగా క్లబ్‌లో ప్రవేశించిన నువ్వు-ఈ సమయంలో అభాగ్యుల గురించి తలచుకుంటున్నావా? సిగ్గుగా లేదూ?" అన్నాడు గంగాధరం.

"ప్రజాక్షేమాన్ని కోరిన ధర్మరాజు ప్రజానాశనం కలిగించే యుద్ధానికి పాల్పడ్డాడు. దుర్మార్గుల్ని అణచడం కోసం అక్రమ యుద్ధం చేయడమేకాక, తనూ ఓ అబద్ధం కూడా ఆడాడు. మీ విషయంలో నేనేం చేసినా అది తప్పుకాదు..." అన్నాడు జోగినాథం.

"అదిసరే-అటు చూడు - ఆ వస్తున్నదే రమేష్!" అన్నాడు గంగాధరం.

జోగినాథం నిర్లక్ష్యంగా అటువైపు చూస్తున్నాడు.

సినిమా హీరోలను మించి అందంగా వున్న ఓ పడుచు

వాడు. అతనికి అటూ ఇటూ ఇద్దరమ్మాయిలు. ఏ స్వర్గాన్నించో సరాసరి దిగివచ్చిన రంభ, ఊర్వశిల్లా వున్నారు వాళ్ళిద్దరూ.

"ఆ ముగ్గురిలో రమేష్ యెవరు?" అన్నాడు జోగినాథం వెటకారంగా.

గంగాధరం కోపంగా జోగినాథంవంక చూసి_ "ఆడతూ. మగతూ భేదం తెలియకుండా వుందా నీకు? ఇంక చేసేకేం ఆడతావ్!" అన్నాడు.

"ఆడవాళ్ళు పొడుగ్గా ఉండడం,మగవాళ్ళు పొట్టిగా ఉండడం పెద్ద విచిత్రమేం కాదు. వాళ్ళు ముగ్గురూ ఒకేరకమైన బట్టల్లో, ఒకేరకమైన హెయిర్ స్టెయిల్‌లో వున్నారు. ఆడెవరో, మగ యెవరో నాకెలా తెలుసుంది?" అన్నాడు అమాయకత్వాన్ని నటిస్తూ జోగినాథం.

అప్పటికి ఆ పడుచువాడు జోగినాథాన్ని సమీపించి "ఎస్ ఐయామ్ మిస్టర్ రమేష్!" అన్నాడు.

జోగినాథం టైము చూసుకుని "మూడు ముక్కలాట ప్రారంభించడానికింకా యెంత వ్యవధి వుంది?" అన్నాడు.

"నేను వచ్చేశాగా_ఇప్పుడే ఈ క్షణంలోనే ప్రారంభము. నువ్వు సిద్ధమా?" అన్నాడు రమేష్. అతన్ని పక్కనున్న ఇద్దరమ్మాయిలూ జోగినాథం వంక వెటకారంగా చూసి నవ్వారు.

"మిస్టర్ రమేష్! ఐయాం మిస్టర్ జోగినాథం. నేనీవేళ పెద్ద యెత్తులో వచ్చాను. ముందుగా నువ్వో రెండు రౌండ్లు వేసి నాలుగు డబ్బులు సంపాదించుకో..." అన్నాడు.

రమేష్ నవ్వి—"నేను పందెం కాసేదేమిటో తెలుసా?" అన్నాడు.

"తెలియదు?"

"వీళ్ళిద్దరూ ధరించిన దుస్తులకున్న జిప్స్, బటన్స్— బంగారానివి. వీటి ఖరీదే కొన్ని వేలు చేస్తుంది. అవే నేను పందెంగా ఒడ్డుతాను. నన్ను నెగ్గగలిగినవారెవ్వరైనా సరే—ఈ సుందరాంగుల వలువలు నెగ్గుకుపోవచ్చు" అన్నాడు రమేష్.

"సరే—అది మొదటి పందెం. రెండో పందెం?..." అన్నాడు జోగినాథం.

రమేష్ ముఖం ఎర్రగా అయింది. "ఈ రమేష్‌తో రెండో పందెం ఆడిన మగవాడున్నాడా...?" అన్నాడు.

"అసలు నువ్వు మగవాళ్ళతో పేకాడావా అని!" అన్నాడు జోగినాథం.

రమేష్ కోపం యింకా పెరిగింది. అతనావేశపడుతున్నాడని గ్రహించి గంగాధరం అతని భుజంతట్టి— "ఆవేశపడకు రమేష్! నీ తడాఖా చూపించు..." అన్నాడు.

రమేష్ తన పందెం గురించి గట్టిగా చెప్పి-ఎవరైనా సరే ముందుకు రావచ్చునని అన్నాడు.

అక్కడ కూర్చున్న మగవారిలో ఈ పందెం చెప్పుకో దగ్గ సంచలనం కలిగించింది. అద్భుత సౌందర్యంతో వెలిగిపోతున్న ఆ అమ్మాయిల వయసు సొగసుల్ని చూసి ఆనందించవచ్చునన్న ఆశతో చాలామంది ముందుకు వచ్చారు. ఆట ప్రారంభమైంది.

రమేష్ పది ఆటలు ఆడాడు. ఆటకు రెండు వేలు

చొప్పున ఇరవై వేలు సంపాదించాడతను. ఆటమీద ఆట రమేష్ నెగ్గుతుంటూ వస్తూంటే ఆ అమ్మాయి లిద్దరూ ఉత్సాహంగా చప్పట్లు కొట్టేస్తున్నారు.

"మిస్టర్ జోగినాథం-ఆర్ యు ప్రిపేర్డ్" అన్నాడు రమేష్.

"ఒక చిన్న రిక్వెస్ట్..." అన్నాడు జోగినాథం... "నేను మనుషులను బాధపెట్టలేను. ఆడపిల్లల మనసుల నయితే అసలే బాధపెట్టలేను. ఈరోజు ఇప్పుడు ఇక్కడ మొట్టమొటిసారిగా రమేష్ నా చేతిలో ఓడిపోయాడను కోండి. అప్పుడీ అమ్మాయిలిద్దరూ-ఇంతమంది ప్రేక్షకుల ముందు బట్టలు విప్పాలి. ఏ ఆడదానికైనా అదెంతో బాధాకరమైన విషయం. ఈ విషయంలో ఆ అమ్మాయి లిద్దరూ చెప్పుకోవలసిందేమైనా ఉన్నదా అని తెలుసుకో గోరుతున్నాను."

ఇద్దరమ్మాయిలూ హేళనగా జోగినాథంవంక చూసి- "మా బాధ గురంచి మీరు పట్టించుకోనవసరంలేదు. రమేష్ ఇష్టమే మా యిష్టం...తప్పించుకోవడంకోసం టైము వేస్టుచేయక వెంటనే ఆట ప్రారంభించండి..." అన్నారు.

"అయితే సరే..." అన్నాడు జోగినాథం. "మీ ముందు బట్టలు విప్పడానికి యీ ఆడపిల్లలు సిగ్గులేదంటు న్నారు. బాగానే వుంది. అయినా ఆ పని మీరెవ్వరూ చేయించలేకపోయారు. ఇప్పుడు నేను చేయించబోతు న్నాను. సహజంగా ఇది మీ కానందాన్ని కలిగిస్తుంది. అందుకు ప్రతిఫలంగా మీరంతా కలిసి నాకో ఐదువేలి చ్చారంటే-రమేష్‌వద్ద నేను గెల్చుకోబోయే మొత్తంతో కలిపి- మొత్తం పాతిక వేలవుతుంది..."

"అప్పుడే ఆటలన్నీ నెగ్గినట్లు మాట్లాడుతున్నావ్"
అన్నాడు రమేష్.

"నేను భవిష్యత్ లోకి చూడగలను..." అంటూ జోగినాథం ఒక్క నిముషం కళ్ళు మూసుకుని యేదో ధ్యానిస్తున్నట్లుండిపోయాడు. తర్వాత నెమ్మదిగా కళ్ళు తెరిచి "పేకలు కలుపు..." అన్నాడు రమేష్‌తో.

రమేష్ పేక కలిపాడు. కలిపిన పేకను టేబిలుమీద స్ప్రెడ్ చేశాడు. అందులోంచి జోగినాథం మూడు ముక్కలు తీసుకున్నాడు. రమేష్ మూడుముక్కలు తీసుకున్నాడు.

"ముక్కలు తిరగేయ్—" అన్నాడు జోగినాథం.

రమేష్ ముఖంలో భయంలేదు కానీ మరీ అంత సంతృప్తికరంగా లేవతని భావాలు. అతను తిరగ వేసిన మొదటిముక్క ఆసు.

"రెండోదికూడా!" అన్నాడు జోగినాథం.

రెండు, మూడు ముక్కలు తిరగేశాడు రమేష్...
కింగూ, కింగూ...

"మరి నా ముక్కలు చూడు..." అన్నాడు జోగినాథం.

అవిచూస్తూనే రమేష్ ప్రాన్పడిపోయాడు. అమ్మాయిలిద్దరూ నీళ్ళుగాపోయారు. అవి మూడూ ఆసులే!

"కంగ్రాట్యులేషన్స్ జోగినాథం. అయిదు వేలూ నీకిచ్చుకుంటాం. అద్భుతమైన ప్రదర్శన ఇప్పుడు జరుగబోతోంది. ఇద్దరు బంగారు బొమ్మలు...అహం నిండిన ప్రాణులు...రమేష్‌కు తప్ప లొంగని రమణులు...ఈ రోజు మా ముందు..." అంటూ ఓ యువకుడు ఉత్సాహంగా గెంతుతూ ముందుకు వచ్చాడు.

# 9

"ఈ డబ్బు నేను కష్టపడి సంపాదించినది. మళ్ళీ నాకు తిరిగి ఇవ్వనక్కర్లేదు. వెళ్ళి నీ బిడ్డను విడిపించు కోవమ్మా..." అన్నాడు జోగినాథం, మాలతికి పదివేలుస్తూ. అతను క్లబ్ లో గెలిచిన మిగతా పదిహేను వేలను క్లబ్ లోని బ్యాంకులోనే డిపాజిట్ చేశాడు.

"అన్నయ్యా..." అంది మాలతి. ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి. పక్కనే ఉన్న ఆమె భర్త-"మీరు సామాన్యులు కారు. మిమ్మల్ని మొదట్లో చాలా తక్కువ అంచనా వేశాను..." అన్నాడు.

"మాలతి నాకు చెల్లెలు కాబట్టి మనమంతా ఒక గూటి పక్షులం. ఒకళ్ళ నొకరు మన్నించుకోనవసరం లేదు. నా వేషాన్నిబట్టి నన్ను చిన్న చూపు చూడడం అందరికీ సహజమే! అయితే నా వేషాన్ని చూసికూడా మాలతి నన్నాదరించింది. అప్పుడామె ఆదుకోకపోతే నేనేమైపోయి ఉండేవాడినో-ఇప్పుడీ డబ్బు ఇచ్చినా ఆ ఋణం మాత్రం తీరదు..." అని అక్కణ్నించి వెళ్ళి పోయాడు జోగినాథం.

తర్వాత భార్యాభర్తలిద్దరూ కర్తవ్యమేమిటో ఆలోచించారు. భర్త వెళ్ళి సూచనల ప్రకారం డబ్బిచ్చి వస్తానని బయల్దేరాడు.

బస్ స్టాండ్ లో రామాకిళ్ళీ షాపు ముందు నిలబడ్డాడు మాలతి భర్త. అతనక్కడ నిలబడ్డ అయిదు నిముషాలకు నీలం రంగు పాంటు, తెల్లచొక్కా వేసుకున్న యువకు డొకడు అక్కడికి వచ్చాడు.

"మీ పేరు గోపీనాథ్ కదూ-" అన్నాడతను.

"నీ పేరు మూర్తికదూ-" అన్నాడు మాలతి భర్త గోపీనాథ్.

ఆదివారి సంకేతం.

"తెచ్చారా?" అన్నాడు మూర్తి.

"తెచ్చాను!" అన్నాడు గోపీనాథ్.

మూర్తి అక్కణ్నించి పక్కనే ఉన్న హోటల్‌కు వెళ్ళి ఎక్కడికో ఫోన్ చేసివచ్చి "మరో పావుగంటలో ఓ ముసలమ్మతో కలిసి మీ ఆవిడ, పిల్లాడు ఇక్కడికి రిక్షాలో వస్తారు. వాళ్ళను చూస్తూనే మీరు నాకు ఇచ్చెయ్యండి. లెక్క సరిపోతే రిక్షాలోంచి ముసలమ్మ దిగిపోతుంది. ఆ స్థానంలో మీరు కూర్చుని ఇంటికి వెళ్ళిపోవచ్చు. ఏమైనా మోసముంటే—" అని స్వరం తగ్గించి "మీ భార్యా పిల్లాడు, రిక్షాలోనే చచ్చిపోతారు..." అన్నాడు గోపీనాథ్‌తో.

గోపీనాథ్ అన్నింటికీ తలాడించాడు.

"మీ పిల్లాడు మీకు దక్కాడని సంతోషించాలి తప్పితే—ఇంకే విధమైన ఆరాలూ తీయకూడదు. అందువల్ల అనవసరంగా ఇబ్బందుల్లో పడిపోతారు..." అన్నాడు మూర్తి.

"మేము చాలా సామాన్యులం- మాకిన్నిసార్లు చెప్పడం అనవసరం. మాకొకరివల్లనే కానీ మావల్ల ఎవరికీ ప్రమాదముండదు..." అన్నాడు గోపీనాథ్.

తర్వాత కొంతసేపటికి అక్కడికి ఓ రిక్షావచ్చింది. అందులో మూర్తి చెప్పిన విధంగానే ముసలమ్మ, మాలతి, తనకొడుకు ఉన్నారు. గోపీనాథ్ వెంటనే మూర్తికి ఓ కవరు అందించాడు. అయిదు నిముషాల్లో మూర్తి పక్కకు వెళ్ళివచ్చి-పాట పాడుతున్నట్లుగా ఈలవేశాడు. రిక్షాలోంచి ముసలమ్మ దిగిపోయింది.

ఉత్సాహంగా రిక్షాదగ్గరకు వెళ్ళాడు గోపీనాథ్.

అప్పుడే మాలతి అతన్ని చూసి - "ఏమండీ!" అంది ఆనందం, దుఃఖం మేళవించిన కంఠంలో. గోపీనాథ్ మాట్లాడలేదు. అతనికి మాటరావడంలేదు. కొడుకు వంకే చూస్తున్నాడు. తను మళ్ళీ చూడగలనా లేదా అనుకున్న కొడుకు తన కళ్ళెదుట కనపడుతూంటే నోట మాట రాకపోవడం ఏ తండ్రికైనా సహజం. అతను ఛటుక్కున రిక్షా ఎక్కి కొడుకును దగ్గరగా తీసుకున్నాడు.

"ఎక్కడికి వెళ్ళాలండీ!" అన్నాడు రిక్షావాలా. మాలతి చెప్పగానే రిక్షా కదిలింది.

అంతవరకూ ఆ దృశ్యాన్ని చూస్తూ నిలబడ్డ మూర్తి సంతృప్తిగా తలాడించి-అక్కణ్నించి కదిలాడు. అయితే కొద్దిపాటి దూరంలో తన ననుసరిస్తున్న వ్యక్తి నతను గమనించలేదు. అయినా బికారి వాడిలా ఉన్న జోగినాథాన్ని ప్రత్యేకంగా గమనించే వ్యక్తులు చాలా తక్కువ. అతని గురించి బాగా తెలిసినవారు మాత్రమే అతని గురించి పట్టించుకోవలసిన అవసరం గమనిస్తారు.

# 10

"మిస్టర్ సాంబయ్యా! డబ్బు రెడీ అయిందా."

"అయిందండి..."

"అయితే శంకరమఠం వీధిలో-రామాలయం మీంచి అజంతా కేఫ్‌కి వెళుతూంటే వచ్చే మూడో ఇంటికి ఇంకో గంటలో డబ్బుతోసహా బయల్దేరిరా. నువ్వొక్కడివే రావాలి. ఈ విషయం ఇంకెవరికైనా తెలిసిందా-మీ అబ్బాయి శవాన్ని మాత్రమే చూస్తావు..."

"అన్నీ తెలుసు నాకు..."

"నిన్ను నా అనుచరులు వెయ్యి కళ్ళతో కనిపెడు

తున్నారు. ఏదైనా తెలివి తక్కువ పనిచేస్తే వాళ్ళు తెలియకుండా తప్పించుకోగల ననుకోకు."

"మీరేమీ చెప్పనక్కర్లేదు... నేను బ్రతికేదే నా కొడుకు కోసం. వాడెలాగున్నాడు? మా కోసం బెంగ పెట్టుకోలేదు గదా..."

"కుర్రాడు చాలా ఉత్సాహంగా, ఆరోగ్యంగా ఉన్నాడు-ఇంతవరకూ. ఆ తర్వాత సంగతి నీ ప్రవర్తన మీద ఆధారపడి ఉంది..." ఫోన్ క్లిక్కుమంది.

తనూ రిసీవర్ పెట్టేసి కళ్ళు తుడుచుకున్నాడు సాంబయ్య. ఆయన మనసు నిండా కొడుకు గురించిన ఆలోచనలే...అక్కణ్నించి ఆయన వెంటనే రిక్షా కట్టించుకుని ఇల్లు చేరాడు. ఇంటి దగ్గర ఆయనకోసం ఆత్రుతగా ఎదురు చూస్తోంది భార్య.

"ఏమండీ-ఏమయింది..." అందావిడ.

"అన్న ప్రకారమే ఆఫీసుకు ఫోన్ చేశాడు. డబ్బు రెడీగా ఉందా అన్నాడు. ఉందని చెప్పాను. అయితే తీసుకుని రమ్మని చెప్పాడు. నేను వెళుతున్నాను. నువ్వేమీ కంగారు పడకు. ఓ రెండు గంటల్లో మనబాబుని తీసుకుని వచ్చేస్తాను..." అన్నాడు సాంబయ్య.

"అసలిదంతా ఏమిటండీ-" అంది సాంబయ్య భార్య.

"మనకర్మ...అంతకంటే ఏం చెప్పను?" అన్నాడు సాంబయ్య.

సాంబయ్య లోపలకు వెళ్ళి అలమారాలోంచి డబ్బు తీసి లెక్క పెట్టాడు. సరిగ్గా యాభై వేలు. ఆ డబ్బుని చిన్న తోలు సంచీలో వేసుకుని అక్కణ్నించి బయటకు వచ్చాడు. ఆయన బయల్దేర బోతూంటే మెట్లమీదే వారి పురోహితుడు అవధాని ఎదురయ్యాడు.

"ఏమండీ-లోపలకు రండి..." అంది సాంబయ్య భార్య. ఆవిడ ఉద్దేశాన్ని గ్రహించిన సాంబయ్య లోపలకు దారితీశాడు.

"బాబుగారికక్కడికో పెద్ద పనిమీదే బయల్దేరినట్లున్నారు. నన్నడిగితే ప్రయాణం వాయిదా వేసుకోమంటాను. సమయం యేమాత్రమూ అనుకూలంగాలేదు..." అన్నాడు అవధాని.

సాంబయ్య విసుగ్గా-"అసలే ఒంటి బ్రాహ్మడు శకునం వచ్చినందుకు బెంగపడుతూంటే-మళ్ళీ ఇదొకటా..." అనుకుని దొడ్లోకి వెళ్ళి కాళ్ళు కడుక్కుని వచ్చి, కాసిని మంచినీళ్ళు తాగి-"అయ్యా-అవధానిగారూ! మీరు అన్యథా భావించక-మాట్లాడవలసిన విశేషాలన్నీ మా ఆవిడతో మాట్లాడండి. సమయం అనుకూలంగా వున్నా లేకపోయినా నాకు బయటకు వెళ్ళక తప్పదు..." అని అక్కణ్నించి వెళ్ళిపోయాడు.

"అలాటలిఖితం...ముందుగా తెలిసినా తప్పించుకోలేంగదా..."

సాంబయ్య భార్య కంగారుగా "సమయం బొత్తిగా అనుకూలంగా లేదంటూరా?" అంది. ఆవిడ కళ్ళలోని ఆత్రుతను ఆశ్చర్యంగా గమనిస్తూ "అవునమ్మా-అందుకే హెచ్చరించాను. అయినా యేదో చెప్పడమేకానీ-అంతా మన చేతుల్లో ఉందా యేమన్నానా"అన్నాడు అవధాని.

సాంబయ్య భార్య గుండెలు గుబగుబలాడాయి. రాజారావు ఎలా ఉన్నాడోనని ఆవిడ మనసు కలవరపడసాగింది.

## 11

సాంబయ్య అయిదారు నిముషాలు బాగా పరీక్షించి ఆ యింటి తలుపు తట్టాడు.

ఓ కుర్రాడు తలుపుతీసి - "మీ పేరు సాంబయ్య గారా?" అన్నాడు. అవునని సాంబయ్య చెప్పగానే లోపలికి తీసుకువెళ్ళి - "ఆ గదిలోకి వెళ్ళండి..." అని ఓ మూల గది చూపించాడు.

సాంబయ్య ఆత్రుతగా ఆ గదిలోకి వెళ్ళాడు. ఆయన లోపలకు వెళ్ళగానే ఆ గది తలుపులు మూసుకున్నాయి. సాంబయ్య గదిలో అటూ ఇటూ చూసి ఆశ్చర్యపోయాడు. ఆశ్చర్యం ఆనందంగా మారడానికి ఎన్నో క్షణాలు పట్ట లేదు. గదిలో ఉన్న ఒకే ఒక వ్యక్తి ఆయన కొడుకు రాజారావు!

"నాన్నా!" అన్నాడు రాజారావు. సాంబయ్య ఒక్క ఉదుటున వెళ్ళి కొడుకును గట్టిగా కౌగలించు కున్నాడు. ఆ పరిష్వంగంలోని సుఖం ఆ పితృ హృద యానికే తెలియాలి.

ఓ అయిదు నిముషాల అనంతరం ఆ గదిలోకి తలుపులు తీసుకుని నిండా ముసుగున్న వ్యక్తి ప్రవేశించి-"వెల్ మిస్టర్ సాంబయ్యా! డబ్బిలాగియ్య-" అన్నాడు.

సాంబయ్య అతనికి తన చేతిలోని తోలుసంచీ అందిం చాడు. ఆ ముసుగు వ్యక్తి అందులోని డబ్బు తీసుకుని లెక్క పెట్టుకున్నాడు. తర్వాత తన జేబులోంచి ఏదో కాగితం తీసి ఆ నోట్లను మళ్ళీ పరిశీలించాడు.

"మిస్టర్ సాంబయ్యా-నా దగ్గరున్న నంబర్లతో నువ్వి చ్చిన నోట్ల నంబర్లు సరిపోయాయి. అంటే గోపీనాథ్ గారబ్బాయిని దాచేసి పదివేలు వసూలు చేసింది నువ్వే నన్నమాట!" అన్నాడు ముసుగు మనిషి.

సాంబయ్య ఉలిక్కిపడ్డాడు - "మీరేమంటున్నారో నాకు తెలియదు,.."

"బుకాయించి ప్రయోజనంలేదు. నీవు డబ్బిచ్చిన గోపీనాథ్ ఆ నంబర్లు నోట్ చేసుకున్నాడు. గోపీనాథ్ కి డబ్బిచ్చి సాయంచేసిన అతను కూడా నంబర్లు నోట్ చేసుకున్నాడు. ఆ నంబర్లు నువ్విచ్చిన నోట్లవున్నాయ్."

"ఇంతకీ మీరెవరు?" అన్నాడు సాంబయ్య.

ముసుగు వ్యక్తి ముసుగును తొలగించాడు. అతను ఫుల్ యూనిఫాంలో ఉన్న పోలీసు అధికారి_"ఎస్ అయాం ఇన్ స్పెక్టర్ నరేష్!" అన్నాడతను.

సాంబయ్య కంగారుగా_"యేమిటిది ఇన్ స్పెక్టర్_ సామాన్య గుమాస్తాని. నా పిల్లాడిని దాచేసి ఉన్న పళంగా యాభై వేలు కావాలంటే యేం చేసేది? వాళ్ళనీ వీళ్ళనీ బెదిరించి డబ్బుపోగుచేసుకున్నాను..."అన్నాడు.

"అది సరే - ఇలాంటి పరిస్థితుల్లో సామాన్యగుమాస్తా అయితే తెగించి యే దొంగతనానికో, దారి దోపిడీకో వెళ్ళి పట్టుబడేవాడు. కానీ చేతిలో ముఠా సిద్ధంగా ఉన్నవాడే అప్పటికప్పుడు ఇలాంటి యేర్పాట్లు మరి కొన్ని చేయగల్గుతాడు. నీ క్రింద పెద్ద ముఠా ఒకటి ఉన్నదని వార్తలు ఇదివరలోనే వచ్చాయి. అది ఈ పథకం రూపంలో ఈనాడు బుజువయింది."

"ఇన్ స్పెక్టర్_నా బాబుని అపహరించింది పోలీసులా?" అన్నాడు సాంబయ్య ఆశ్చర్యంగా భయంగా.

"అవును. ఒకతను ఈ పథకం వేశాడు. సామాన్య గుమాస్తా యాభై వేలైనా ఇవ్వగలుగుతాడనీ_ఆ డబ్బు ఎలా వచ్చిందో తెలుసుకుంటే అతని గుట్టు బయటపడు తుందనీ చెప్పాడు. అతనొక సీబీఐ అధికారి కావడంతో నేను రంగంలోకి దిగాను. నీ కొడుకును అతనే దాచాడు. కానీ ఈ రోజు నేను వచ్చాను..." అన్నాడు ఇన్ స్పెక్టర్.

"మీరు అన్యాయంగా నామీద నేరారోపణ చేస్తున్నారు. నాకే పాపం తెలియదు." అన్నాడు సాంబయ్య.

"మా దగ్గర చాలా బలమైన సాక్ష్యాలున్నాయి. మూన్ లైట్ నైట్ క్లబ్ యజమానికూడా ఈరోజే పట్టుబడ్డాడు! మన ఊళ్ళోని ప్రముఖ వ్యాపారస్థుడు కోటేశ్వరరావు దానికి రహస్య యజమాని. అక్కడ చాలా అన్యాయాలు, అక్రమాలు జరుగుతున్నాయి. ఆ నైట్ క్లబ్ లో డబ్బు డిపాజిట్ చేసిన ఒకతను ఆ నోట్ల నంబర్లన్నీ గుర్తుంచుకున్నాడు. మర్నాడా నంబరుగల నోట్లు యే బ్యాంకుకు వచ్చినా గుర్తించి చెప్పవలసిందిగా రహస్యపు ఆజ్ఞ జారీచేయగా-అవి కోటేశ్వరరావు అకౌంట్లో జమచేయబడినట్లు తెలిసింది. ఆ ఆధారంలో ఆయన పట్టుబడ్డాడు. ఒక దాని వెనుక ఒకటిగా బోలెడు సాక్ష్యాలు దొరికాయి. సాక్ష్యాలలో కొన్ని నీ నేరాన్నికూడా బయట పెట్టాయి. కోటేశ్వరరావు ముఖ్యానుచరులలో నువ్వొకడివని చెప్పటానికి..."

"ఆగండి ఇన్ స్పెక్టర్!" అన్నాడు సాంబయ్య - "మా బాస్ కోటేశ్వరరావు పట్టుబడ్డాక ఇంకా నిజాలు దాచడమెందుకు? నేను ఆయన అనుచరుణ్ణేకాక-ఓ చిన్న సైజు ముఠా నాయకుణ్ని. నాక్కావలసిన డబ్బు సంపాదించుకోవడం నాకు తెలుసు. నా పాపం మూడింది నాకర్మ కాలింది.." అన్నాడు పశ్చాత్తాపపడుతూ.

## 12

"అమ్మా_మాలతీ!"

"ఎవరది_అన్నయ్యా_" అంది ఆశ్చర్యంగా మాలతి.

"నా పని ముగిసిందమ్మా-అనుకున్న కార్యం సాధిం

చాను. నీకు మాటిచ్చిన ప్రకారం మీ ఇంట్లో స్నానం చేద్దామని వచ్చాను...'' అన్నాడు జోగినాథం.

అప్పుడే అక్కడికివచ్చిన గోపీనాథ్ -''మా అదృష్టం. మా ఇంట్లో మీ స్నానం మా ఇంటినే పునీతం చేస్తుంది'' అన్నాడు ఆహ్వానపూర్వకంగా.

జోగినాథం మాలతి ఇంట్లో స్నానం చేస్తున్న సమయంలో సాంబయ్య భార్య తన భర్తకు ఎదురొచ్చిన పురోహితుడు అవధానిని తిట్టుకుంటోంది. ఆ తప్పు అవధానిది కాదు, జోగినాధానిదనీ, ఆ మాటకొస్తే సాంబయ్యదేననీ ఆవిడకు తెలియదు.

—: అ యి పో యిం ది :—

# అంతులేని వింత శిక్ష!

సుసర్ల సర్వేశ్వరశాస్త్రి

"స్సార్! లీడింగ్ అడ్వకేట్ పార్వతీశం గారు మీతో మాట్లాడాలంటున్నారు."

ఏదో మాగజయిన్ చదువుతున్న శ్రీనాథ్, అసిస్టెంట్ హరి గొంతు విని తల పైకెత్తాడు.

"రమ్మను" పుస్తకం పక్కన పెట్టాడు శ్రీనాథ్.

పార్వతీశం లోపలికొచ్చాడు. అతని వయసు యేభై సంవత్సరాల లోపు వుంటుంది. మనిషి అంత బలవంతుడూ కాడు, మరీ బలహీనుడు కాడు. వయిట్ పాంటు మీద వయిట్ షర్టు టక్ చేసి, నల్లని కోటు ధరించాడు. శ్రీనాథ్ కు యెదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాడు.

"మీలాంటి లీడింగ్ లాయర్ నా దగ్గరకు రావడం ఆశ్చర్యంగానే వుంది. నేను మీకు యే విషయంలో సహాయం చెయ్యగలను?"

శ్రీనాథ్ మాటలు వింటూ పేలవంగా నవ్వాడు అతను.

"పైవాళ్ళ కేసులు అవలీలగా వాదించి, గెలిపించ గలిగే ధైర్యం చెప్పగల నాకు,నాకు సంబంధించిన కేసులో ధైర్యం చిక్కబట్టుకోలేకపోతున్నాను. మా అబ్బాయి రమణ్ రెండురోజులనుంచి కనిపించడంలేదు. సాయం కాలం షికారుకని వెళ్ళినవాడు తిరిగి ఇంతవరకూ ఇంటికి రాలేదు.

సాధారణంగా యెక్కడికైనా వెళితే చెప్పే వెళ్ళే వాడు. అర్జెంటుగా వెళ్ళవలసి వస్తే కబురు చేయడమో లేకపోతే టెలిగ్రాం యివ్వడమో చేసేవాడు. ఈ మాటు ఏదీ జరగలేదు. అందుకే కంగారుగా వుంది. వాడి ఆచూకి తెలుసుకోవాలి."

పార్వతీశానికొక సిగరెట్ ఆఫర్ చేసి తనొకటి వెలిగించాడు శ్రీనాథ్.

"మీవాడు యేం చేస్తున్నాడు?"

"ఎం. కాం. చదువుతున్నాడు."

"మీరు అనవసరంగా కంగారుపడుతున్నారేమో? అర్జెంటు పనిమీద వెళ్ళినా టెలిగ్రాం ఇవ్వడానికి తగిన సమయం దొరకలేదేమో?"

"అంత అర్జంటుగా వెళ్ళదగిన ఇంటిపనులు ఏమీ లేవు. వాడి ఫ్రెండ్సునందరినీ యెంక్వయిరీ చేసాను. వాళ్ళ పనిమీదకూడా వెళ్ళలేదట. ఎంత అర్జంటయినా యెవరికీ చెప్పకుండా వెళ్ళివుండడం వింతగానే వుంది..."

"మీవాడ్ని యెవరైనా యెత్తుకుపోయి వుంటారని అనుకోడానికి యేమైనా కారణాలున్నాయా?"

"వృత్తిపరంగా నా క్లయింటు గెలుపొందితే అవతల పక్షంవారికి నేను శత్రువు నేకదా? అయితే ఇన్నేళ్ళ

సర్వీసులో యెటువంటి దుర్ఘటనా జరగలేదు.''

''సరే మీ కేసు టేకప్ చేస్తున్నాను. మీకేవైనా వివరాలు, విషయాలు తెలిస్తే ఫోను చెయ్యండి. రమణ్ ఫోటోతోబాటు అతన్ని గుర్తించడానికి వీలుగావుండే గుర్తులు, ఇతర వివరాలు, మా వారికి అందచెయ్యండి. మీరు పోలీసు రిపోర్టు యిచ్చారా?'' అడిగాడు శ్రీనాథ్.

''ఇచ్చాను'' అంటూ హారికి అన్ని వివరాలూ అందజేసి వెళ్ళిపోయాడు పార్వతీశం.

అతడిచ్చిన వివరాలు, ఫోటో క్షుణ్ణంగా పరిశీలించారు ఇద్దరూ.

''సాధారణంగా రమణ్ లాంటి యువకులు కనిపించకుండా ఉండడానికి కారణాలు యేమై ఉంటాయో చెప్పు'' సిగరెట్ పొగ వదులుతూ అడిగాడు శ్రీనాథ్.

''లవ్ వ్యవహారాల్లో తల దూర్చి ప్రేయసితో ఎంజాయ్ మెంటుకోసం ఇంట్లో చెప్పకుండా వెళ్ళవచ్చు. లేదా కాలేజి వ్యవహారాల్లో అవసరంపడి అర్జెంటుగా వెళ్ళివుండవచ్చు...'' అన్నాడు హారి.

''వెరీగుడ్! ఈ రెండింటిలోనూ యే కారణంచేతనైనా అర్జెంటుగా రమణ్ వెళ్ళవలసి వచ్చిందా? పార్వతీశంగారివల్ల జైలుపాలయిన వారెవరైనా పగ తీర్చుకోడానికి యీ పని చేశారా? అదే జరిగివుంటే గత సం॥ లోపు అతనివల్ల జైలుశిక్షపడి విడుదలైనవాళ్ళ వివరాలు కనుక్కొని ఎంక్వయిరీ చెయ్యాలి.

''నేను ఎస్.ఐ. సుందరాన్ని కలిసి యీ విషయాలన్నీ తెలుసుకుంటాను. నువ్వు కాలేజికి వెళ్ళి వివరాలు సేకరించు,''

"ఓ.కే బాస్!" అంటూ స్కూటర్ యెక్కి వెళ్ళి పోయాడు హరి.

మరో ఐదు నిముషాల్లో శ్రీనాథ్ కూడా తన వాహనంపై బయలుదేరాడు.

## 2

"రమణ్ గురించి మాకూ పార్వతీశంగారు రిపోర్టు ఇచ్చారు. కాని ఇంతవరకూ యెటువంటి ఆచూకీ తెలియ లేదు. మీరు రంగంలోకి దిగారంటే మేం నిశ్చింతగా వుండవచ్చు" అన్నాడు ఎస్.ఐ. సుందరం.

శ్రీనాథ్ యేదో చెప్పబోతుండగా సుందరం టేబులు మీది ఫోన్ "గణగణ" మంటూ మోగింది. రిసీవర్ ఎత్తి అవతల్నుంచి వింటున్న మాటలతో సుందరం మొహంలో రంగులు మారడం గమనించాడు శ్రీనాథ్.

"ఆల్ రైట్, నేనూ డిటెక్టివ్ శ్రీనాథ్ కలసి ఇప్పుడే వచ్చేస్తున్నాం. అంతవరకూ ఆ పెట్టె అలాగే వుండనివ్వండి" అంటూ రిసీవర్ పెట్టేశాడు సుందరం.

ప్రశ్నార్థకంగా చూసాడు శ్రీనాథ్.

"పార్వతీశంగారికి పెద్దపెట్టె ఒకటి పార్శలుగా వచ్చిందట. లాయర్ గారుకదా...తన కొడుకుతో బాటు తనకి యేదో కీడు చేయాలని యే బాంబులో అందులో పెట్టించి వుండవచ్చని అనుమానిస్తున్నారు."

"ఫ్రం ఎడ్రస్ చూడలేదా?"

"చూసారుట. అందుకే అనుమానం మరింతగా బల పడిందిట. ఆ ఎడ్రస్ గలవాళ్ళెవరూ తనకు తెలిసినవాళ్ళలో లేరట. అందుకే యెందుకైనా మంచిదని నాకు ఫోను చేసాడుట. పదండి ఇద్దరం వెళదాం."

కుర్చీలోంచి లేచాడు శ్రీనాథ్.

# 3

పోలీస్ జీప్ పార్వతీశం ఇంటిముందు ఆగింది. శ్రీనాథ్, సుందరం దిగి వరండాలోకి నడిచారు. మూడడుగుల ఎత్తు, రెండున్నర అడుగుల వెడల్పుతో తయారైన చెక్క పెట్టె అక్కడుంది. పార్వతీశం కొంతమంది పనివాళ్ళు అక్కడ నిల్చుని వున్నారు.

టైంబాంబులాంటిదేమైనావుందేమోనని పరిశీలించాడు సుందరం. పెట్టెలో నుండి యెటువంటి శబ్దం వినబడ లేదు...

పెట్టె ఓపెన్ చేయడానికి ఆర్డరిచ్చాడు సుందరం. కొంతసేపు కష్టపడ్డాక మూత తెరిచారు పనివారు.

లోపలకి తొంగిచూసిన సుందరం అదిరిపడ్డాడు!

శ్రీనాథ్ ఒళ్ళు జలదరించింది!

పార్వతీశం కొయ్యబారినట్లు నిలబడిపోయాడు!

పార్వతీశం భార్యకు యేం అర్థంకాక గదిగుమ్మందగ్గర నిల్చుని ఆందోళనగా చూసింది.

"ఈ దారుణానికి పాల్పడిన వారెవరో రాక్షసులు గాని, మానవుల్లా కనిపించడంలేదు."

"ఈ హత్య జరిగిన తీరు పరిశీలిస్తుంటే హంతకులకి అతనిపై యెంతో పగ, ద్వేషం ఉన్నట్లు అనిపిస్తోంది" అన్నాడు శ్రీనాథ్.

ఆ చెక్క పెట్టెలో ఓ మానవ శరీరాన్ని యే భాగానికి ఆ భాగం కట్ చేసి పెట్టి పార్సిలుగా పంపించారు. సుందరం పోలీస్ సిబ్బందికి ఫోన్ చేసాడు. పదినిముషాల్లో ఫోటోగ్రాఫర్, వేలిముద్రల నిపుణుడితో సహా అందరూ వచ్చేసారు.

పెట్టెలో శరీర భాగాలన్నీ తీయించాడు. అందులో నుండి తీస్తున్న షర్టు, పేంటు, వాచీ చూస్తూనే 'కెవ్వున' కేక వేసాడు పార్వతీశం.

శ్రీనాథ్ అసలు విషయం గ్రహించగలిగాడు. పార్వతీశాన్ని లోనికి తీసుకుపోయాడు. పార్వతీశం పిచ్చిపట్టినట్లుగా జుట్టు పీక్కున్నాడు. అతని భార్యకు కూడా అసలు విషయం బోధపడిందో లేక భర్త పరిస్థితి చూసో శోకాలు ప్రారంభించింది.

అప్పటికే వీధిలో జనం ఆ ఇంటిదగ్గరకు చేరిపోయారు. పోలీసులు వారిని కంట్రోలుచేస్తూ, తమ రొటీన్ వర్క్ ప్రారంభించారు.

"సుందరం, ఇది రమణ్ శవం అయివుంటుంది అనడంలో ఎటువంటి సందేహంలేదు. ఇందులోవున్న షర్టు, పాంటు, వాచీ అతనిదే అయివుండవచ్చు. అందుకే పార్వతీశం అంతలా చలించిపోయాడు. పూర్తి డాక్టర్ పరిశీలన జరిగితే నిర్ధారణ అయిపోవచ్చు."

"ఇతణ్ని ఇంత భయంకరంగా హత్యచేయడానికి కారణం ఏమిటి? సాధారణంగా హంతకులు ఇటువంటి పార్సిలుతో యేదో ఒక ఉత్తరం రాసి పెడుతుంటారు. కాని వీళ్లెవరో మనకు ఎటువంటి ఆచూకి తెలియకూడదని కాబోలు అలాంటిదేమీ చెయ్యలేదు."

"ఈ పార్సిలులో పేర్కొన్న ఫ్రం అడ్రస్ బోగస్ అయివుండవచ్చు. అందువల్ల దానివల్ల మనకేం ప్రయోజనం ఉండకపోవచ్చు. నీ రొటీన్ వర్క్ పూర్తయాక, డాక్టర్ రిపోర్టురాగానే నాకు తెలియచెయ్యి. ఈలోగా మా హరితోకలసి కేసు దర్యాప్తు ఎలావుందో తెలుసుకుంటాను..." అంటూ లోనికి నడిచాడు శ్రీనాథ్.

"పార్వతీశంగారూ జరిగిందానికి నేనెంతో విచారిస్తున్నాను. ఇలా జరుగుతుందనుకోలేదు. మీ అబ్బాయిని ప్రాణాలతో అప్పగించలేకపోయినా, ఈ హత్యకు కారకులని కఠినంగా శిక్షింపచేయక మానను. మీరు నిబ్బరంగా

వుండకపోతే మీ మిసెస్ బాగా అప్ సెట్ అవుతారు,'' అని ఓదార్చి బయటికి నడిచాడు శ్రీనాథ్.

# 4

సముద్రం మీదనుండి వస్తున్న చల్లని గాలి శరీరాన్ని గిలిగింతలు పెడుతోంది మురళికి. అతనికి కొద్ది దూరంలో ఓ అందమైన అమ్మాయి సముద్ర కెరటాలతో పాదాలు తడుపుకుంటూ చిన్నపిల్లలా ఆడుకుంటోంది.

పచ్చని ఆమె పాదాలు, ఎత్తుగావున్న ఆమె పిరుదులు చూస్తుంటే అతనికి మతిపోతోంది.

ఒకసారి చుట్టూ పరిశీలించాడు. చాలా దూరంవరకూ ఎవరూ కనిపించలేదు. ఆమె ఒంటరిగానే వచ్చిందా? లేక ఎవరితోనైనా కలిసొస్తే రెండో వ్యక్తి యేదైనా పనిమీద వెళ్ళాడా?

'కవ్వు' మనకేకతో తుళ్ళిపడి ఈలోకంలోకివచ్చాడు మురళి.

పెద్ద కెరటం ఒకటి ఆకస్మాత్తుగా రావడంతో, ఆ వేగానికి తట్టుకోలేక సముద్రంలోకి పడిపోయింది ఆమె.

మెరుపులా వెళ్ళి ఆమెను పొదివి పట్టుకుని భుజంమీద వేసుకుని ఒడ్డుకు తెచ్చి ఇసకమీద పడేసాడు.

తడిసిన ఆమె పైట పక్కకి తొలగిపోవడంవల్ల బలమైన ఆమె యవ్వన సంపద ఎగిరెగిరి పడుతోంది. చీర మోకాలు దాటిపోడంతో పిక్కలు పచ్చగా, అందంగా మెరుస్తున్నాయి.

ఇంతలో ఆమె కళ్ళు తెరిచి చూసింది. గబగబా లేచి చీర సర్దుకుని ప్రశ్నార్థకంగా మురళివైపు చూసింది.

జరిగింది చెప్పాడు మురళి.

"చాలా థాంక్స్! సమయానికి మీరే రాకపోతే ఈ సునీత సముద్ర గర్భంలో కలిసిపోయి ఉండేది. మీ ఋణం ఎలా తీర్చుకోవాలో?"

"మీలాంటి అందమైన శరీరం ఈ సముద్రానికి ఆహుతి కాకుండా కాపాడగలిగినందుకు నేనెంతో గర్విస్తున్నాను."

"నేను అంత అందంగా వున్నానా?" నవ్వుతూ అడిగిందామె.

"మీకు తెలివొచ్చేసిందిగాని, మరొక్క నిముషం అలాగేవుంటే నిగ్రహం కోల్పోతున్న నేను యేం చేసేవాణ్ణో?"

"ఏం చేస్తారబ్బా?' సున్నాలా మూతిచుట్టి కొంటెగా అడిగింది ఆమె.

"ఏం చేస్తానా?..." బలంగా ఆమెను హృదయానికి హత్తుకుని బలంగా ఆమె పెదవులతో తన పెదవులు కలిపాడు.

"ఏయ్! కొంటె పిల్లాడా! ఒంటరిగావున్న ఆడపిల్లను ఇలా చేయొచ్చునా?..." బలమైన అతని కౌగిలి విడిపించుకుంటూ అడిగింది.

"మరి ఒంటరిగావున్న కుర్రాణ్ని నీ అందంతో రెచ్చగొట్టొచ్చా?"

"అబ్బా! నీలో రసికత్వమేకాదు, మాటల చాతుర్యం కూడా ఉందే. రండి మా ఇంటికి వెళదాం."

"ఓకే! దేవిగారి ఆజ్ఞ."

ఇద్దరూ టాక్సీ ఎక్కారు నవ్వుకుంటూ.

టాక్సీ ఓ ఇంటి ముందు ఆగింది.

టాక్సీ ఫేర్ మురళీ చెల్లించాడు. ఆమె లోనికి దారి తీసింది. మేడ ఎక్కి విశాలమైన గది దాటి ఇంకో గది

లోకి నడిచింది. మురళీ మౌనంగా ఆమెను అనుసరిస్తు న్నాడు.

ఆమె గోడకున్న బటన్ ఒకటి నొక్కింది. ఆ గది నేలలో కొంత భాగం తెరుచుకుని మార్గం ఏర్పడింది. అక్కడనుండి క్రింది భాగానికి మెట్లున్నాయి.

"కమాన్ మిస్టర్ మురళీ. నా గదికి వెళదాం."

"ఇదేమిటి ఈ పద్ధతిలో ఉంది మీ ఇల్లు. మీ వాళ్ళెవరూ ఇంట్లో లేరా?" ఆమెతోపాటు మెట్లు దిగుతూ అడిగాడు మురళి.

"మా ఫాదర్ ప్రతీ పనిలోనూ యేదో వింత, ప్రత్యేకత ఉండాలని భావిస్తారు. అందుకే ఈ విధంగా ఇల్లు కట్టించారు. ఇంట్లో వాళ్ళంతా పిక్చర్‌కు వెళ్ళినట్టుంది. మనకే మంచిదిగా" అంటూ ఓ గదిలోకి తీసుకెళ్ళి డబుల్ కాట్ పై కూర్చోపెట్టింది.

"డియర్! ఐదు నిముషాల్లో డ్రెస్ ఛేంజ్ చేసుకుని వచ్చేస్తా" అంటూ వెళ్ళిపోయింది.

ఐదు...పది...పదిహేను...ఇరవై నిముషాలు గడిచినా ఆమె రాలేదు. మురళికి విసుగ్గావుంది అప్పటికే. అరడజను సిగరెట్లు తగలేసాడు. అక్కడున్న పుస్తకాలు తిరగేసాడు. అసహనంగా అటూ-ఇటూ పచార్లుచేసాడు. ఇక భరించలేక మెట్లు ఎక్కబోతుండగా.

"హలో మిస్టర్ మురళీ! కామకేళీ విలాసాల్లో గడప వలసిన ఇరవై నిముషాలు వృధాగా గడచిపోయినందుకు చింతిస్తున్నావా? మరో ఐదు నిముషాల్లో అన్నీ చవి చూద్దువుగాని..." అంటోంది స్త్రీ కంఠం.

వెనక్కి తిరిగిన మురళి ఆ వ్యక్తిని చూస్తూ అలాగే వుండిపోయి "నువ్వు...నువ్వు..." అన్నాడు.

"అవును నేనే. ఆగస్టు 14వ తేదీ రాత్రి గుర్తుందా?"

ఆ మాట అనగానే ఒక్కసారిగా అతనిలో భయం ఆవహించింది. శరీరం స్వేతబిందువులతో నిండిపోయింది.

"మస్తాన్..." అని కేక వేసింది బెల్ బాటమ్ డ్రస్‌లో వున్న ఆ యువతి.

మస్తాన్ నల్లని కండలు తిరిగిన ఆకారం చూడగానే మురళి గుండె గుభేలుమంది. మస్తాన్ చేతిలో పదునైన కత్తి తళుక్కుమని మెరిసింది. మురళిని ఒక కుర్చీకి బంధించాడు. కుడిచేయి మాత్రం లూజ్‌గా వుంచాడు.

"ఊ! కానియ్!" ఆజ్ఞాపించింది ఆమె.

అంతే! మురళి కుడిచేయి శరీరంనుండి వేరై కింద పడింది. రక్తం జివ్వున యెగిరిపడింది.

'కెవ్వు'మని కేకేసి బాధతో గిలగిలా కొట్టుకున్నాడు మురళి.

వికటాట్టహాసం చేసింది ఆ యువతి. కారుతున్న రక్తంతీసి అతని మొహానికి పులిమింది.

"ఇలా ఒక్కొక్క అంగాన్ని వేరుచేస్తూ చిత్రవధ చేసి ఆ భాగాలన్నింటిని పార్సిలుచేసి వాడి బాబుకు పంపు..." ఆజ్ఞాపించి వెళ్ళిపోయింది ఆమె.

# 5

"సార్! మామూలుగా మన బొమ్మలు వచ్చే పార్సిల్సుతోబాటు యేదో కొత్త పార్సిలుపెట్టె మన పెరట్లో ఉంది సార్," అన్నాడు మేనేజర్.

"ఏదో కొత్త కంపెనీనుంచి వచ్చి ఉంటుంది. నిన్నా, మొన్నా నువ్వు శెలవులో వున్నావుకదా, ఆ విషయం నీకు తెలిసివుండకపోవచ్చు. ఇంకా అసిస్టెంటు మేనేజరు రాలేదా?..." అడిగాడు ప్రముఖ బొమ్మల వ్యాపారి పట్టాభిరామయ్య.

"లేదుసార్! సడన్‌గా ఫీవర్ తగలడంతో శెలవు పెట్టాడు."

"బాగుందయ్యా మీ వరస. అతనొస్తే నువ్వు రావు, నువ్వొస్తే అతను రాడు..." చిన్నగా మందలించాడు పట్టాభిరామయ్య.

"పార్శిల్సు విప్పేస్తాం సార్!"

"అదీ నాకు చెప్పాలా, నీ రొటీన్ వర్కు కానీయ్" అంటూ ఆ రోజు పేపరు చదవడంలో నిమగ్నమైనాడు పట్టాభిరామయ్య.

"అలాగే సార్!" అంటూ చెక్కపెట్టెల మూతలు ఊడదీయించి బొమ్మలు పైకి తీయిస్తున్నాడు మేనేజరు. నాలుగు పెట్టెలు పూర్తయ్యాయి. కొత్తగా కనిపిస్తున్న పెట్టె మూత తెరవమని ఆర్డరిచ్చాడు.

ఆ పెట్టె మూత ఓపెన్ చేసారు. అందులో నాలుగు మూటలున్నాయి. అందులో ఒక మూట స్వయంగా విప్పాడు మేనేజరు.

"అమ్మోయ్!" అంటూ ఆ మూటను అలాగే వదిలేసి గట్టిగా అరిచాడు మేనేజరు.

ఆ మూటలోనుండి మనిషి తల ఒకటి ఫుట్‌బాలులా జారి కిందపడింది.

"ఏమిటయ్యా ఆ గావుకేకలు?" అంటూ అక్కడి కొచ్చిన పట్టాభిరామయ్యకి అక్కడి దృశ్యాన్ని చూసేసరికి కళ్ళు తిరిగిపోయాయి.

అప్పటికే అక్కడక్కడా పనిచేస్తున్న పనివాళ్లంతా అక్కడ గుమిగూడారు. అందరి మొహాల్లోను, భయం, ఆశ్చర్యం చోటుచేసుకున్నాయి.

అంతలో వాళ్ళలో ఒకడు తేరుకుని పోలీసుస్టేషన్‌కు ఫోన్ చేశాడు.

మరో పది నిముషాల్లో పోలీస్ జీపునుండి సుందరం, శ్రీనాథ్ దిగారు.

ఒక యువకుడు వాళ్ళకి యెదురెళ్ళి "మీకు ఫోన్ చేసిన వ్యక్తిని నేనే. ఇక్కడ వర్కర్‌గా పని చేస్తున్నాను" అని పరిచయం చేసుకుని జరిగిందంతా చెప్పాడు.

"పట్టాభిరామయ్యాగారు యెక్కడున్నారు?" ఆతృతగా ప్రశ్నించాడు సుందరం.

"ఇక్కడి సంఘటన చూడగానే ఆయన కళ్ళు తిరిగి పడిపోయారు. అర్జెంటుగా ఆయన ఫేమిలీ డాక్టర్ని పిలిపించాము. ప్రస్తుతం ఆయన పర్సనల్ రూమ్‌లో వున్నారు" అన్నాడు ఆ యువకుడు.

వెంటనే ఇద్దరూ ఆ రూమ్‌లోకి వెళ్ళారు. పట్టాభిరామయ్య సోఫామీద పడుకుని ఉన్నాడు. వీళ్ళిద్దరినీ చూసి విష్ చేసాడు డాక్టర్.

"ఏం జరిగింది డాక్టర్...?" శ్రీనాథ్ ప్రశ్నించాడు.

"ఊహించలేనిది, భయంకరమైనది చూడడంతో స్పృహతప్పిపోయారు. మరో ఐదు నిమిషాలలో తెలివి వస్తుంది..." అన్నాడు డాక్టరు.

"ఈలోగా మనం ఆ పార్శిలు సంగతి చూద్దాం" అని బయటకు దారితీసాడు శ్రీనాథ్. సుందరం అతడ్ని అనుసరించాడు.

మొత్తం నాలుగు మూటల్లోనూ ఒక మనిషి శరీరంలోని వివిధ భాగాలు కోసి పార్శిలు చేయబడినాయి. వాటిని చూడగానే కడుపులో దేవినట్లయింది ఇద్దరికీ. మేనేజరును పిలిపించి ఒక గదిలో తీసుకెళ్ళాడు

శ్రీనాథ్. అతడుకూడా ఆ షాక్‌లోంచి తేరుకోలేదేమో చిన్నగా వణుకుతున్నాడు.

"మీకు యీ పార్సిలు యెలా వచ్చిందో చెప్ప గలరా?" ప్రశ్నించాడు శ్రీనాథ్.

"సాధారణంగా పార్సిలుఆఫీసుకెళ్ళి మా కొచ్చే పెట్టెలను విడిపించుకుని తెచ్చి పెరట్లో వున్న మా స్టోరు రూమ్‌లో భద్రపరుస్తాము. వాటి తాళాలు పట్టాభి రామయ్యగారిదగ్గర వుంటాయి. ఉదయం ఆయన రాగానే తాళాలు మాకిస్తారు. ఆయన ఆర్డరు ఇవ్వగానే వాటిని ఓపెన్ చేసి మెటీరియలుని ఆయనకు చూపుతాము.

సాధారణంగా ముందు రోజున వచ్చే పార్సిల్సు మర్నాడు ఓపెన్ చేస్తాము. సాయంకాలం షాప్ క్లోజ్ చేసాక స్టోర్సు తాళాలు తీసుకుని పట్టాభిరామయ్యగారు వెళ్ళిపోతారు."

"అయితే యీ పార్సిలు నిన్న మీకు మామూలుగా వచ్చేవాటితోనే వచ్చిందా?"

"రొటీన్‌గా జరిగే వర్కే కదా అని నేను పరిశీలించ లేదు. అయినప్పటికీ పట్టాభిరామయ్యగారికి యీ కొత్త పెట్టె గురించి చెప్పాను. ఉండండి దీనికొక రిజిస్టరు ఉంది. దానిలో ఏ రోజు యెన్ని పార్సిల్సు వస్తాయో, ఎవరిదగ్గర్నుంచీ వస్తాయో రాసుంటుంది. ఆ రిజిస్టరులో నేను గాని అసిస్టెంటు మేనేజరు గాని సంతకం చేసాక పట్టాభిరామయ్యగారుకూడా సంతకం చేసేసి, సాయంకాలం ఎకౌంట్ పూర్తవగానే తాళాలు తీసుకుని ఆయన వెళ్ళిపోతారు.

రెండు రోజులై శెలవులో ఉన్నందున యేం జరిగిందో నాకు తెలియదు. రొటీన్ వర్కే కదా అని పార్సల్సు

ఓ.పెన్ చేయించాను. ఉండండి ఆ రిజిస్టర్ తెచ్చి చూపిస్తాను,'' అని వెళ్ళి రెండు నిముషాల్లో ఓ రిజిస్టర్ తెచ్చి చూపించాడు.

''అన్నీ సరిపోయాయా?'' సిగిరెట్ పొగ వదులుతూ అడిగాడు శ్రీనాథ్.

''లేదు. ఒక పార్సిలు ఎక్కువగా ఉంది. ఆ కొత్త పార్సలు వివరాలేవీ ఇందులో లేవు.''

''పొరపాటుగా రాయడంలోనో, లెక్క వేయడంలోనో మరచిపోయి వుండవచ్చు కదా?''

''అంత పెద్ద పెట్టె కళ్ళముందు కనిపిస్తుంటే అటువంటి పొరపాటు జరగడానికి అవకాశంలేదు.''

''మరి ఆ పార్సలు ఇందులోకి ఎలా వచ్చింది? అసిస్టెంట్ మేనేజర్ ఈ పెట్టెకు సంబంధమున్న వాళ్ళతో లాలూచీపడి ఈ పార్సలు లెక్కలోకి రాకుండా చేసి ఉంటాడా?''

మేనేజర్ కొంతసేపటివరకు మాట్లాడలేదు.

''నాకు తెలిసినంతవరకూ అటువంటి లాలూచీపనులు, కక్కుర్తి పనులకు అతను దిగడు. అందుకే అతను ఎక్కువగా శెలవులు పెడుతున్నా అతని నిజాయితీకీ, పనితనంకు ఆకర్షితులై పట్టాభిరామయ్యగారు ఉద్యోగం లోంచి తీయకుండా వుంచుతున్నారు.''

''అతను పనిలోకి సరిగ్గా రాలేకపోడానికి కారణం?''

''అతను యువకుడే అయినా యేదో వ్యాధితో బాధపడుతున్నాడు. ఎవరం అడిగినా యేమీ చెప్పకుండా నవ్వేస్తాడు. ఎంత అవసరం వచ్చినా ఇతరులను అడక్కుండా తనకున్న దాంట్లోనే సర్దుకుపోతాడు. అతనికి యెవ్వరూ లేరని యెప్పుడో మాటల సందర్భంలో తెలిసింది.''

"అయితే ఆ పార్సిలు ఆ స్టోరురూమ్‌లోకి ఎలా వచ్చిందో ఊహించగలరా?"

"ఊహించడం కష్టంగానే వుంది."

శ్రీనాధ్ తీవ్రంగా యేదో ఆలోచిస్తూ స్టోర్ రూమ్ వైపు వెళ్ళాడు.

ఆఫీసుకు వెనకాల కొంత ఖాళీజాగా ఉంది. అందులో ఒకవైపు స్టోరురూము ఉంది. పెరటిచుట్టూ తొమ్మిదడుగుల ఎత్తున ప్రహరీగోడ వుంది. స్టూలొకటి తెప్పించి ప్రహారీగోడ అవతలిభాగం పరిశీలించాడు. వెనకాతల యిరుకైన సందు మాత్రం వుంది.

స్టూలు దిగి స్టోర్సురూముకొచ్చి దాని తలుపుకున్న తాళంకప్పను పరిశీలించాడు. అది శుభ్రంగా, చెక్కు చెదరకుండా వుంది. పోనీ ఎవరైనా తాళం బద్దలుకొట్టి ఆ పార్సల్ అందులో పెట్టి ఉంటారనుకుందాం అంటే తాళంకప్ప శుభ్రంగానే ఉంది.

అదీగాక అంత పెద్ద పెట్టె లోనికి తెచ్చిపెట్టాలంటే నైట్ వాచ్‌మన్‌కు తెలియకుండా వుండదు. మరి యీ పార్సిలు ఎలా వచ్చింది? దెయ్యాలు-భూతాలు వచ్చి ఇందులో వుంచాయా?

ప్రహరీగోడకు వెనుకనున్న యిరుకువీధిని పరిశీలించాడు. అక్కడున్న చిన్న కాలవలో పచ్చగా మెరుస్తున్న వస్తువొకటి కనిపించింది.

జాగ్రత్తగా దాన్ని బయటకు తీసాడు. అచ్చం అది స్టోరు రూమ్‌కు వున్న తాళంకప్పలాగే ఉంది.

హంతకులు చాలా తెలివిగానే ప్రవర్తించారు. స్టోరుకున్న తాళం బద్దలుకొట్టి, ఆ రూమ్‌లోకి ఈ పార్సిలు ప్రహరీగోడమీంచి దాటించి లోనికి చేర్చారు. ఆ తాళం

కప్ప ఇలా కాలవలో పడేసారు. ఇటువంటిదే తాళంకప్ప మళ్ళీ ఆ స్టోరురూమ్‌కు వేసేసారు.

దీన్నిబట్టి ఇక్కడి విషయాలు బాగా తెలుసుకుని ప్రీప్లాన్డ్‌గా ఈ వ్యవహారం నడిపించారు. అయితే యీ పార్సిలు లోనికి చేరుస్తుంటే నైట్ వాచ్‌మన్ యేంచేస్తున్నాడు?

వెంటనే సుందరం దగ్గరకు వెళ్ళి ఆ తాళంకప్ప అందించి, తను ఊహిస్తున్నదంతా చెప్పాడు. నైట్ వాచ్‌మన్‌ను పిలిపించి ఒక రూమ్‌లోకి తీసుకెళ్ళాడు.

వాడు భయంగా శ్రీనాథ్ వైపు చూసాడు.

వాడి కళ్ళలోకిసూటిగా చూస్తూ "ఆ పార్సిలు స్టోరు లోమ్‌లోకి యెలా వచ్చింది...?" అని ప్రశ్నించాడు శ్రీనాథ్.

"పార్సిలా...ఏమో...నాకేం...నాకేం... తెలుసు? అవన్నీ మేనేజరుగారిని, అసిస్టెంటుమేనేజరుగార్ని అడగండి," అన్నాడు తడబడుతూ.

"అలాగా. సరే నువ్వు లాకప్‌లో పోలీసుల చేతుల్లో తన్నులు తింటేగాని అసలు విషయం చెప్పవు?"

పోలీస్ స్టేషన్ అనేసరికి గడగడ వణికిపోయాడు వాడు. శ్రీనాథ్ కాళ్ళమీద పడ్డాడు.

"ఇటువంటి వెధవ్వేషాలు వేసినంత మాత్రాన నీవు చేసిన నేరం తప్పిపోదు. జరిగింది దాచకుండా చెబితే నీవు నిర్దోషివనే నమ్మకం కలిగితే తప్పక రక్షిస్తాను."

"నిజంగా యీ పార్సిలుతోగాని, దానికి సంబంధించినవారితోగాని ఎటువంటి సంబంధం లేదు. కాని నిన్న రాత్రి జరిగిన సంఘటన తలచుకుంటే వాళ్ళే ఈ పని చేసివుండవచ్చని అనిపిస్తోంది?"

"ఏం సంఘటన...?" ఆత్రుతగా ప్రశ్నించాడు శ్రీనాథ్.

"నిన్న రాత్రి సుమారు రెండు గంటలు దాటిపోయి వుండవచ్చు. జేబులో బీడీలు అయిపోయాయి. నోరు లాగేస్తోంది. వెళ్ళి తెచ్చుకుందామంటే ఆ టైమ్‌లో షాపు లేమీ వుండవు. ఎక్కడో సినిమా థియేటర్ దగ్గరున్న దుకాణానికి వెళ్ళాలి.

ఇంతలో అటుగా ఓ వస్తాదులాంటి వ్యక్తి వచ్చాడు. "అగ్గిపెట్టుందా?" అనడిగాడు. ఉందని ఇచ్చాను. అత డొక సిగరెట్టు వెలిగించి, నాకొకటి ఇచ్చాడు.ఎడారిలో ఒయాసిస్ దొరికినట్లుంది నాకు ఆ సిగిరెట్టు చూస్తుంటే. అందుకే మొహమాటం పడకుండా నేనుకూడా సిగిరెట్టు వెలిగించాను. అతను అగ్గిపెట్టె యిచ్చేసి వెళ్ళిపోయాడు.

నేను గేటుదగ్గర స్టూలుమీద కూర్చుని సిగరెట్ కాలుస్తున్నాను. సిగిరెట్ సగం కాగానే నాలో ఏదో మత్తు ఆవహించింది. ముందు అదేదో కాస్ట్లీ సిగిరెట్ అయినందున అలవాటులేక అలా గైందనుకున్నాను. కాని నాకు తెలియకుండానే తెలివితప్పిపోయాను.

మరో రెండుగంటలయాక నాకు తెలివొచ్చింది. నేను ఆత్రుతగా అన్నీ పరిశీలించాను. ఆఫీసులో యెటువంటి దొంగతనంగాని, అనుమానించదగిన సంఘటనగాని జరగకపోవడంతో నా మనస్సు తేలికపడింది. బహుశా, అదేదో కొత్త సిగిరెట్ అయివుంటుందని, నాకే యేదో ఒంట్లో బాగులేక తల తిరిగి పడిపోయి వుంటానని అను కున్నాను.

కాని ఇప్పుడు యిదంతా ఆలోచిస్తే రాత్రి వాడికీ దీనికీ యేదైనా సంబంధం ఉండవచ్చునని అనిపిస్తోంది.

అయితే ఉద్యోగం ఊడుతుందని ఎస్.ఐ. గారు అడిగినా ఈ విషయం చెప్పలేదు. మీరే నన్ను రక్షించాలి. నిజంగా నాకేం తెలియదు,'' అని చెప్పాడు వాడు.

''నువ్వు సిగిరెట్ పూర్తిగా కాల్చేసావా?'' ప్రశ్నించాడు శ్రీనాథ్.

''లేదు, సగమే కాల్చాను. బహుశా మిగిలినముక్క ఆ గేటుదగ్గరే వుండవచ్చు.''

శ్రీనాథ్ వాడితో గేటుదగ్గరకు వెళ్ళి పరిశీలించాడు. ఒకవార పడివున్న సిగిరెట్ పీక చూపించాడు వాచ్ మన్. దాన్ని జాగ్రత్తగా కేబురుమాలుతో తీసి, సుందరంవద్దకు వెళ్ళి జరిగిందంతా చెప్పాడు.

సుందరం దాన్ని జాగ్రత్తగా దాచాడు.

''ఈ హత్య జరిగిన తీరు పరిశీలిస్తుంటే, రమణ్ హత్య జరిగిన తీరులోనే జరిగినట్టు అనిపిస్తోంది. రెండింటికీ యేదైనా సంబంధం వుందా? ఇంత దారుణంగా హత్య చేసారంటే పట్టాభిరామయ్యకు చెందిన శత్రువులుగాని. వాతుని శత్రువులుగాని చాలా పగతో చేసి వుండవచ్చు, ఇంతకీ హత్య చేయబడిని వ్యక్తి పట్టాభిరామయ్యగారి కొడుకేనా?'' అడిగాడు శ్రీనాథ్.

''అవును'' జవాబిచ్చాడు సుందరం.

''అందుకే ఆయన అంతలా అప్ సెట్ అయ్యారు. పద, వెళ్ళి ఆయనతో మాట్లాడుదాం...'' లోపలకి వెళ్ళాడు శ్రీనాథ్.

వీళ్లని చూడగానే భోరుమని ఏడ్చేశాడు పట్టాభిరామయ్య.

''నేనేం చేసానని భగవంతుడు నాకీ శిక్ష వేసాడు? అప్పుడే నా మురళీకి నూరేళ్ళు నిండిపోయాయా? ఇంత

దారుణంగా చంపడానికి ఆ రాక్షసులకు చేతులెలా వచ్చాయో?" అంటూ సోఫాకేసి తల బాదుకున్నాడు అతను.

వెంటనే అతన్ని వారించి ఓదార్చారు.

"జరిగిందానికి మేమూ ఎంతో విచారిస్తున్నాం. మీ అబ్బాయి ప్రాణాలు తెచ్చి యివ్వలేకపోయినా యీ రాక్షసత్వానికి పాల్పడినవారిని బంధించి తీర్తాము. దయ చేసి గుండెదిటవు చేసుకుని,అడిగే ప్రశ్నలకు సమాధానం యిచ్చి మా పరిశోధనకు సహకరించండి. మీ మురళిని ఆఖరిసారిగా మీరు ఎప్పుడు చూసారు?" ప్రశ్నించాడు శ్రీనాథ్.

"నిన్న ఉదయం. ఒక్కడే అయినందువల్ల చాలా గారాబంగా పెంచాను. ఒక్కొక్కసారి రాత్రిళ్ళు వాడి ఫ్రెండ్స్ రూమ్‌లో వుండి మర్నాడు ఇంటికి వచ్చేవాడు. నిన్న రాత్రి ఇంటికి రాకపోతే మామూలుగా ఉదయం వచ్చేస్తాడనుకున్నాను," అన్నాడు గద్గద స్వరంతో ఆయన.

"మీరు చేసే బిజినెస్ యేమిటి? మీకుగాని, మురళికి గాని అనుమానించదగినంత శత్రువు లెవరైనా వున్నారా?"

"బొమ్మలు, అందమైన నగిషీ సామగ్రి తయారుచేసి అమ్మడం, ఫాన్సీ వస్తువులు అమ్మడం చేస్తుంటాను. వివిధ ప్రాంతాలనుండి అందమైన బొమ్మలు తెప్పించడం, స్థానికంగా బొమ్మలు తయారు చేయడంలో నైపుణ్యం ఉన్న వారి బొమ్మలు సేకరించి అమ్ముతుంటాను.

వాటి మెటీరియల్సు, బొమ్మలు మాకు రోజూ పార్సిల్సుగా వస్తుంటాయి.

నాకు తెలిసినంతవరకూ వ్యక్తిగతంగాగాని, వ్యాపార రీత్యాగాని ఎవరికీ ఎటువంటి అన్యాయం చెయ్యలేదు. సాధారణంగా నేను ఇతరుల విషయాల్లో జోక్యం చేసుకోను. అందువల్ల నామీద ఇంత దారుణంగా పగతీర్చుకునే శత్రువులుండరు. పోతే మురళికికూడా శత్రువు లున్నట్టు నేనెప్పుడూ వినలేదు."

# 6

"హెల్ప్! హెల్ప్!"

సడన్‌గా మోటార్ బైక్ ఆపి, చుట్టూ చూసాడు కామరాజు. మళ్ళీ అవే కేకలు వినిపించాయి. మోటార్ బైక్ ఆపి లాక్ చేసి ఆ శబ్దం వచ్చిన వైపు నడిచాడు.

అక్కడ గుబురుగా ఉన్న చెట్లచాటున ఒక యువతిపై ఇద్దరు యువకులు అఘాయిత్యం చేయబోతున్నారు.

ఆ యువతి వేసుకున్న షర్టు చీలికలై పోయింది. తన గుండెలను చేతులతో కప్పుకుంటూ పెనుగులాడుతోంది. దాంతో వారిద్దరూ మరింత పశువుల్లా తయారయ్యారు.

వారిలో ఒకడు ఆమెను క్రిందికి తోసి లేవకుండా గట్టిగా అదిమి పట్టుకున్నాడు. రెండవవాడు ఆమె పాంట్ గుండీలు విప్పి ఆమె మీదకు ఒంగాడు.

'ఫట్'మని ఒక్క కిక్ ఇచ్చాడు కామరాజు ఆ వ్యక్తికి.

ఫుట్‌బాలులా ఎగిరి దూరంగా పడ్డాడు వాడు.

ఆ యువతిని పట్టుకున్నవాడు ఆమెను వదిలేసి కామరాజుపై విరుచుకు పడ్డాడు.

'ధన్', 'ధన్'మని పిడుగుల్లాంటి గుద్దులతో వాడి కళ్లు పచ్చబడి చెట్టుకేసి గుద్దుకున్నాడు.

ఇంతలో మొదటివాడు వచ్చి మీదపడ్డాడు. ఒడుపుగా వాడి చెయ్యిపుచ్చుకుని పొట్లకాయ తిప్పినట్లు తిప్పాడు కామరాజు.

'పళక్'మంటూ విరిగిందా చెయ్యి. 'బాబోయ్' అని అరుస్తూ విరిగిన చెయ్యి మోసుకుంటూ పారిపోయాడు.

చెట్టుకు గుద్దుకుని పచ్చడైన మొహంతో వాణ్ని అనుసరించాడు రెండోవాడు. మరో నిముషంలో స్కూటరు కదిలిన శబ్దం విని నిట్టూర్చాడు కామరాజు.

ఆ యువతి చెట్లచాటుగా నిల్చుని జరిగింది చూస్తూ ఉండిపోయింది.

"నిజంగా దేముడనేవాడు ఎలా వుంటాడో చూడలేకపోయినా ఈ రోజు మీ రూపంలో చూస్తున్నాను. సమయానికి మీరు రాకపోతే నామానం, ప్రాణం రెండూ దోచుకుని ఉండేవారు. మీ ఋణం ఎలా తీర్చుకోవాలో తెలియడంలేదు" అంటూ చేతులు జోడించిందా యువతి.

"మీరు నన్ను అనవసరంగా ఆకాశానికి ఎత్తేస్తున్నారు. తోటి మానవుడిగా నేను చేయగలిగింది నేను చేసాను. ఇది తీసుకోండి" అని తన కోటు ఆమె పైకి విసిరాడు.

ఆమె ఆ కోటు ధరించి చెట్ల చాటునుంచి ఇవతలకు వచ్చింది. ఆమె సౌందర్యానికి అతని కళ్ళు చెదిరిపోయాయి. అయినా శమాయించుకున్నాడు.

"ఊరికి ఇంతదూరంలోవున్న ఇక్కడికి ఒంటరిగా మీరెందుకువచ్చారు? వీళ్ళిద్దరూ మీకెలా తారసపడ్డారు?" ముందుకి దారితీస్తూ ప్రశ్నించాడు కామరాజు.

"నాకు చిత్రలేఖనంలో ప్రవేశం, అభిరుచి బాగా వున్నాయి. ముఖ్యంగా ప్రకృతి పరమైన చిత్రాలు

గీయడం అంటే నాకెంతో ఇష్టం. ఈ ప్రాంతంలో సూర్యాస్తమయం అవుతుంటే చక్కగా వుంటుందనీ, వచ్చే నెలలో జరగబోతున్న చిత్రలేఖన పోటీకి దాన్ని గీసి పంపమని సలహా ఇచ్చారు. ఫ్రెండ్స్‌తో వస్తే ఏకాగ్రత కుదరదని ఒంటరిగా సైకిలుమీద వచ్చాను.

సూర్యాస్తమయం పూర్తయి చీకటి పడగానే వెంటనే బయలుదేరి పోదామనుకున్నాను- కాని ఆ అద్భుత సౌందర్య దృశ్యం పరిశీలిస్తున్న నాకు సమయమే తెలియ లేదు.

వీళ్ళిద్దరూ ఎప్పట్నుంచీ నన్ను వెంబడిస్తున్నారో తెలియదుగాని పరాగ్గావున్న నన్ను ఆ చెట్లు చాటుకు లాక్కుపోయి అఘాయిత్యానికి పూనుకోబోతున్నారు. ఇంతలో ఆపద్బాంధవుడిలా మీరొచ్చారు" కృతజ్ఞత నిండిన కంఠంతో అతనివైపు చూస్తూ చెప్పింది ఆమె.

ఇద్దరూ అతని మోటార్ బైక్ దగ్గరకువచ్చారు. ఆమె కొద్ది దూరంలోవున్న సైకిలు చూపించింది. ఏదో గుచ్చుకున్నట్లు ఉంది. టైర్ పంచరయింది.

"దీన్ని ఈ చెట్లవారే ఉంచేయండి. తరువాత మా వాళ్ళెవరినైనా పంపి తెప్పించేస్తాను. మనం ఈ బైక్ మీద పోదాం," అన్నాడు.

ఆమె అలాగేనంటూ తలూపింది. మోటార్ బైక్ బాణంలా పరుగెత్తించాడు. ఆమె అతని నడుం చుట్టూ చేతులువేసి పట్టుకుంది.

"మీకు మోటార్ బైక్ ఎక్కడం భయమా?"

"అవును, స్పీడ్ గాపోతే మరీ భయం" చిలిపిగా నవ్వుతూ అందామె.

మరింత వేగంగా నడిపించాడు కామరాజు. ఆమె మరింత గట్టిగా కౌగలించుకుని కూర్చుంది. ఆమె బలమైన

ఎత్తులు అతని వీపును పొడుస్తుంటే అతనిలో ఉద్రేకం పొంగుకొస్తోంది. ఆమె దారి చెబుతుంటే నడిపిస్తూ ఓ ఇంటి ముందు ఆపాడు.

సమయం యేడు గంటలు దాటింది. ఆమె బైక్ దిగుతూ, "ఇదే మా ఇల్లు. రండి లోనికి వెడదాం. కాఫీ తాగి వెళుదురుగాని," అంటూ ఆహ్వానించింది.

అందమైన అమ్మాయి ఆహ్వానాన్ని తిరస్కరించలేక బైక్‌ను గేటు దాటించి లోనపెట్టి ఆమెను అనుసరించాడు.

ఆ ఇంటికి కొద్ది దూరంలో తచ్చాడుతున్న మహేశం గబగబా అక్కడకొచ్చి చూసాడు. ఎవరూ కనిపించక పోవడంతో నీరసంగా నిట్టూర్చాడు.

ఓ యువతీ, యువకుడు మోటార్ బైక్ పై రావడం చూసాడు తను. వాళ్ళేమైనా సహాయం చేయగలరేమో నని, కనీసం వివరాలైనా చెప్పగలరేమోనని అను కున్నాడు. కాని తన దురదృష్టం కొలది వాళ్ళిద్దరినీ కలిసే లోగా లోనికి వెళ్ళిపోయారు.

మళ్ళీ ఎవరైనా వస్తారేమో? యేదో విషయం తెలుసుకోనిదే ఇంటికి వెళ్ళకూడదని నిశ్చయించుకుని ఆ ఇంటికి ఎదురుగావున్న గడ్డి జాగాలో కూర్చుని ఆలోచనల్లో పడిపోయాడు మహేశం.

మహేశం నిరుద్యోగిగా మారి నాలుగేళ్ళు దాటింది. ఉద్యోగాలకు దరఖాస్తులు చేస్తూవున్నా ఏదీ కలసి రావడంలేదు. కొంతమంది అనుభవం కావాలంటారు. అసలు ఉద్యోగాలే దొరకందే అనుభవం ఎక్కడినుండి వస్తుంది? కొన్నిచోట్ల రికమెండేషన్ అవసరంకాగా మరికొన్నిచోట్ల లంచం కట్టవలసి వచ్చింది. అతను ఏదీ చెయ్యలేక పోయినందున యే ఉద్యోగమూ సంపాదించ లేకపోయాడు.

ఉదయం అనగా బయలుదేరాడు. ఎక్కడా ఏమీ లాభం లేకపోయింది. అనాలోచితంగా ఇటువైపు వచ్చిన అతడు "పద్మా ఫైనాన్స్ కార్పొరేషన్" బోర్డు చూడగానే సంబరపడ్డాడు. కాని అప్పటికే సాయంకాలం ఆరుగంటలు కావడంతో ఆఫీసు మూసేసి అందరూ వెళ్ళిపోయారు. ఎవరైనా కనిపిస్తారేమోనని తచ్చాడాడు. కాని ఎవరూ కనిపించలేదు.

తన పిచ్చిగాని ఆఫీసు కట్టేసి వెళ్ళిపోయి ఉంటారు. అందరూ. పోనీ ఉదయం వస్తే? అమ్మోయ్! ఒక్క నిముషంలో ఎన్నోసార్లు ఉద్యోగం తారుమారు కావడం తాను చవిచూసాడు. ఎవరు లేకపోయినా కనీసం నైట్ వాచ్‌మన్ అయినా వుంటాడు కదా? వాడ్ని కలుసుకుని అసలు ఈ ఆఫీసులో యేవైనా ఖాళీలున్నాయా? వుంటే ఎవర్ని పట్టుకుంటే పనవుతుంది? మొ॥ వివరాలన్నీ సేకరించాలి.

అక్కడే నిల్చుని వినుగు పుట్టడంతో కొద్దిగా అటూ-ఇటూ తిరగడం ప్రారంభించాడు. ఎంతదూరం వెళ్ళినా అతని దృష్టి గేటుమీదేవుంది. చాలా సేపయ్యాక దూరంగా వున్న అతనికి ఎవరో ఇద్దరు మోటార్ బైక్ మీదవచ్చి ఆ ఇంటి ముందు ఆగడంతో సంతోషంతో వచ్చేసరికి వాళ్ళిద్దరూ లోనికి వెళ్ళిపోయారు..

ఎవరో ఆ ఇంటినుండి వస్తున్న అలికిడి అవడంతో ఈ లోకంలోకి వచ్చాడు మహేశం. ఇందాక చూసిన అమ్మాయి ఒంటరిగా వస్తోంది.

"మేడమ్" ఆత్రుతగా పిలిచాడు మహేశం.

ఉలిక్కిపడి వెనక్కి తిరిగిందామె.

"మీరేం అనుకోకపోతే చిన్న ఇన్ఫర్మేషన్ ఇవ్వాలి..." ఆశగా అడిగాడు.

ఆమె తడబడుతూ "నేనా?" అంది.

"అవును, మీరే" కొంచెం ధైర్యంగా అన్నాడు.

ఆమె ఎందుకో కంగారు పడింది. అతని వాలకం ఆమెకు అనుమానం కలిగించింది. ఎందుకైనా మంచిదని "ఓయస్! రండి మా ఆఫీసులో కూర్చుని మాట్లాడుకుందాం," అంది.

అప్పుడే తనకు ఉద్యోగం వచ్చినంత సంబరపడ్డాడు అతను. మౌనంగా ఆమెను అనుసరించాడు.

ఆమె అతన్ని భూగృహంలోకి తీసుకుపోయింది. ఆ మార్గాలు చూసి ఉలిక్కిపడ్డాడు అతను. ఇదేమిటి ఇలా తీసుకొచ్చింది? ఈ ఆఫీసేమిటి భూగృహంలో వుంది? ఈ ప్రశ్నలన్నీ అతణ్ని దొలిచేస్తున్నాయి.

"బాస్! ఇతనెవరో ఇన్ఫర్మేషన్ కావాలంటూ నా వెంట పడ్డాడు. అనుమానం వేసి ఎందుకైనా మంచిదని ఇక్కడకు తీసుకొచ్చాను..." అని ఓ బెల్ బాటమ్ డ్రస్ ధరించిన యువతికి మహాశాన్ని చూపిస్తూ అంది ఆమె.

"ఏం మిస్టర్! సమాచారం కావాలా? నిజం చెప్పు. నువ్వు పోలీసుల మనిషివా?" గద్దించి అడిగిందా బెల్ బాటమ్ యువతి.

"లేదు మేడమ్! నేను పోలీసు వ్యక్తిని కాను. ఉద్యోగంకోసం నాలుగు సం॥లనుండీ ప్రయత్నిస్తున్నాను. మేడ మీద బోర్డు చూసి ఉద్యోగ వివరాలు తెలుసుకుందామని గేటు దగ్గర నిల్చున్నాను. అంతే!..." అన్నాడు భయంగా.

అతని చేతిలో ఫైలు విసురుగా లాక్కుని చూసింది ఆ యువతి. అవన్నీ సర్టిఫికెట్లే.

"ఎందుకైనా మంచిది ఆ కామరాజుతోబాటు వీణ్ణి బంధించి ఉంచుదాం. మన దర్యాప్తులో పోలీసు వ్యక్తి కాదని తేలితే యేం చెయ్యాలో అప్పుడు ఆలోచిద్దాం," అంది ఆ బెల్ బాటమ్ యువతి.

ఆ యువతి మహేశాన్ని ఓ గదిలోకి తీసుకెళ్ళింది.

"యూ డెవిల్! ఇంత మోసం చేస్తావా? ఆపదలో వున్నావని రక్షిస్తే నువ్విచ్చే గౌరవం ఇదా?..." ఉద్రేకంగా అరిచాడు అదే గదిలో ఓ కుర్చీకి బంధించబడివున్న కామరాజు.

"షటప్!_" అప్పుడే ఆ గదిలోకి ప్రవేశించిన బెల్ బాటమ్ యువతి చాచి లెంపకాయ కొట్టింది. బుగ్గ బూరెలా బుస్సున పొంగి ఐదువేళ్ళు అచ్చుతేరాయి కామరాజుకి.

"అందమైన అమ్మాయిల్ని భక్షించే నువ్వు వాళ్ళని రక్షిస్తావా? ఆ విధంగా వాళ్ళని మంచి చేసుకుని ఆమెను మోసపుచ్చి అనుభవించి వదిలేయడం నీకు వంశ పారంపర్యగుణం కాదా? నిన్ను ఇక్కడకు రప్పించాలనే ఆ అమ్మాయిచేత నాటకం ఆడించాను. ఆగస్టు 14 వ తేదీ రాత్రి అనుభవం గుర్తుందా?..." క్రోధంగా అడిగిందా బెల్ బాటమ్ యువతి.

ఆ మాట వినగానే భయంతో కామరాజు రోమాలు నిక్కబొడుచుకున్నాయి. చెమటతో ఒళ్లు తడిసిపోయింది.

అంతవరకూ మహేశం ఉనికిని ఆ యువతులిద్దరూ మరచిపోయారు. కామరాజుని చూడగానే మహేశ్‌లో ఉద్రేకం పొంగింది, నరాలు ఉబ్బాయి, ముహం ఎర్రగా కందగడ్డలా తయారైంది.

అంతే! ఉద్రేకంగా రామరాజు దగ్గరకు వెళ్ళి, అతని తలను పట్టుకేసి 'ఫెడీ', 'ఫెడీ'మని బాదేసాడు మహేశం.

అదిచూసి ఆ యువతు లిద్దరూ ఆశ్చర్యపోయారు.

"మిస్టర్ మహేశం! యేమిటీ ఆవేశం? ఎందుకలా ఉద్రేకపడుతున్నావు?"

"వీడ్ని ముక్కలు ముక్కలుగా నరికి పోగులు పెట్టాలి. వీడివల్లే నా గీత మరణించింది..." ఉద్రేకంతో ఊగిపోతూ చెప్పాడు మహేశం.

"గీతా? ఆమె ఎవరు?"

"నా ప్రాణంలో ప్రాణం! మేమిద్దరం ఎంతగానో ప్రేమించి పెళ్లి చేసుకోవాలని కూడా నిశ్చయించుకున్నాం. అయితే నాకు ఉద్యోగం లేనందున పెళ్ళి వాయిదాపడుతూ వచ్చింది. గీతకు ఈ రామరాజు తండ్రికి చెందిన 'మీనా టెక్స్టైల్స్'లో ఉద్యోగం వచ్చింది. ఒకసారి అర్జెంటు పని ఉందని కబురు పెట్టడంతో వీళ్ళింటికి వెళ్ళింది. గదిలో కెళ్లిన ఆమెను వీడు బలవంతం చెయ్యబోగా అందుకు ఆమె ప్రతిఘటించగా, ఫర్వాలేదు పెళ్ళి చేసుకుంటానని మభ్యపెట్టాడట. అయినా లొంగక పోయేసరికి పశుబలంతో లొంగదీసుకున్నాడట.

మర్నాడు ఆమెవిషయమంతా చెప్పి నాదగ్గర భోరుమంది. ఆనాడే వాణ్ణి హత్య చేయాలన్న భావం కలిగింది. అయినా పేదవాడి కోసం పెదవికి చేటుకదా, యేమైనా జరిగింది పీడకలగా మరచిపోయి గీతను నాదానిగా చేసుకోడానికే సిద్ధపడ్డాను. కాని మలినమైన శరీరంతో నా జీవిత భాగస్వామిని కాలేనని చెప్పింది గీత.

తరువాత ఆమె వీడిదగ్గరకు వెళ్ళి, పెళ్ళి చేసుకోమని అడిగితే వ్యంగ్యంగా నవ్వి 'నేను ఎన్నోవాణ్ణి?' అని

అడిగాట్ట. ఆమె వెళ్ళి విశ్వేశ్వరయ్యకు జరిగింది చెబితే తనకు ఉంపుడుగత్తెగా వుండమన్నాట్ట.

ఆ విషయం నాతో చెప్పి, అదేరోజు రాత్రి నూతిలో దూకి ఆత్మహత్య చేసుకుంది. అప్పట్నుంచీ అవకాశం కోసం ఎదురుచూస్తున్నాను. మీరు నాకు అవకాశం ఇస్తే, వీడ్ని చిత్రవధచేసి నా పగ తీర్చుకుంటాను..." క్రోధంగా కామరాజువైపు చూస్తూ అన్నాడు మహేశం.

"నీ సంగతి దర్యాప్తు చేసాక నిజమని రుజువయితే నీకు ఉద్యోగం యివ్వడమేకాక పగ తీర్చుకునే అవకాశం ఇస్తాను.అంతవరకూ నిన్ను బంధించక తప్పదు..." అని అతణ్ణి వేరొక గదిలో వుంచి తాళంవేసి మస్తాన్ను కాపలా వుంచి వెళ్ళిపోయింది, ఆ బెల్ బాటమ్ యువతి.

మహేశం గీత జ్ఞాపకాల్లోకి జారిపోయాడు.

## 7

"ఈ హత్యలు చాలా గందరగోళంగా వున్నాయి. ఎవరు చేస్తున్నారో, ఎందుకు చేస్తున్నారో అవగింజ తయినా ఆధారం దొరకడంలేదు.

దీనికితోడు ప్రముఖవ్యాపారి విశ్వేశ్వరయ్యగారి కొడుకు కామరాజు ఎలిమెంటరీస్కూలు టీచరు వర్ధనమ్మగారి తమ్ముడు మహేశంరెండురోజులనుంచి కనిపించడంలేదని రిపోర్టు ఇచ్చారు. అప్పుడే పైఅధికారుల హెచ్చరికలు ప్రారంభమయినాయి. ప్రజలు, పత్రికలూ మా అసమర్ధత వేలెత్తి చూపుతున్నారు.

వారం రోజుల్లో ప్రారంభం అయ్యే అసెంబ్లీలో ఈ విషయంపై సభలో చర్చించడానికి కొందరు ప్రజాప్రతి

నిధులు నిశ్చయించుకున్నట్లు తెలుస్తోంది. ఈలోగా ఈ కేసుల సంగతి తేలకపోతే యేం జరుగుతుందో మీకు తెలియందికాదు,'' నీరసంగా నిట్టూర్చాడు సుందరం.

''నేను ఇంతవరకూ ఎన్నో కేసులు టేకప్ చేసాను గాని, ఇంత మందకొడిగా దర్యాప్తు ఎప్పుడూ సాగలేదు, ఒకే వయసులోవున్న యువకుల్ని ఎవరో మాయం చేస్తున్నారు. వారిని అతి దారుణంగా వధిస్తున్నారు. చనిపోయిన ఇద్దరికీ కాలేజీ యూనియన్ విషయాల్లో సంబంధంలేదని, లవ్ ఎఫైర్స్ ఉన్నట్లుకూడా ఖచ్చితంగా యెవరూ చెప్పలేకపోతున్నారని, మా హరి పరిశోధనవల్ల తేలింది. మరి వారి హత్యలకు కారణం? హంతకులు చాలా తెలివిగా వ్యవహరించి మనకు ఎటువంటి ఆధారాలు దొరకకుండా చేస్తున్నారు...'' అన్నాడు డిటెక్టివ్ శ్రీనాథ్.

ఇంతలో శ్రీనాథ్ టేబులుమీద టెలిఫోన్ మోగింది. రిసీవర్ అందుకున్నాడు శ్రీనాథ్.

''హలో! డిటెక్టివ్ శ్రీనాథ్ స్పీకింగ్. ఎవరూ వరధమ్మగారా? చెప్పండి. ఆ! ఎస్.ఐ. సుందరం ఇక్కడే ఉన్నాడు. ఏమిటి? మీ తమ్ముడు యింటికి వచ్చేసాడా?...''

''శవంరూపంలో కాదుగదా?..''ఆదుర్దాగా అడిగాడు సుందరం.

కాదన్నట్లు సంజ్ఞచేసి మళ్ళీ మాట్లాడడం ప్రారంభించాడు.

''మీ తమ్ముడు ఈ రెండురోజులు కనిపించకపోవడానికి కారణం ఏమిటో చెప్పాడా?... లేదు...ఏమడిగినా చిరాకుపడుతున్నాడా... సరే! మా హరిని పంపుతాను'' అంటూ రిసీవర్ పెట్టేసాడు శ్రీనాథ్.

"పోలీస్ స్టేషన్‌కు ఫోన్ చేస్తే నీవు లేవని ఇక్కడకు ఫోన్ చేసారట."

"అమ్మయ్య! ఇతను ప్రాణాలతో ఇంటికి రావడం మన ప్రాణాలకు హాయిగా వుంది."

సుందరం మాటలకు హరి, శ్రీనాథ్ నవ్వారు.

# 8

హరి, వర్ధనమ్మగారింటికి చేరేసరికి లోపల నుండి గట్టిగా మాటలు వినబడడంతో గుమ్మందగ్గరే నిల్చుండి పోయాడు.

"ఏమిటక్కా నీ చాదస్తం! నేనేం చంటి పిల్లాణ్ణా, తప్పిపోవడానికి? ఆ మాత్రం దానికి పోలీసులు, డిటెక్టివ్‌ల దగ్గరికి పరుగెత్తావ్."

"అవేం మాటలురా? నా కంగారు నీకేం తెలుసు. ఈమధ్య నీ వయసు పిల్లాళ్లని ఎత్తుకుపోయి చంపేసి పంపుతున్నారట! రెండురోజులైనా కనిపించకపోతే, భయం వేసి వాళ్లకి రిపోర్టు ఇచ్చాను. ఏదో మన రోజులు బాగున్నాయి కనుక ఆ హంతకులకు చిక్కకుండా రాగలిగావు. సరేలే వెళ్ళి స్నానం చేసిరా..." అందో స్త్రీ కంఠం.

వారిద్దరూ మహేశం, వర్ధనమ్మ అయివుండవచ్చని భావించాడు హరి. నెమ్మదిగా తలుపుతట్టాడు. వర్ధనమ్మ తలుపుతీసి హరిని ఆహ్వానించింది.

"మీ తమ్ముడు తిరిగొచ్చాడటకదా? విషయాలేమైనా చెప్పాడా?..." హరి ప్రశ్నించాడు.

"ఏదడిగినా చిరాగ్గా జవాబిస్తున్నాడు. పద్మా ఫైనాన్స్ కార్పొరేషన్‌లో ఉద్యోగం దొరికిందిట. నెలకు నాలుగు వందల రూ॥ జీతం. పోన్లెండి...ఇప్పటికైనా మా

కష్టాలు గట్టెక్కుతున్నాయి. ఉండండి, కాఫీ తెస్తాను" అంటూ వంట గదిలోకి వెళ్ళింది.

హరి ఇల్లును పరిశీలించాడు. రెండే గదులు ఉన్నాయి. పెద్దగా ఫర్నిచర్ లేదు. చాలా సామాన్య జీవితం గడుపుతున్నట్టుగా ఆ వాతావరణం చెబుతోంది. ఆమె అన్నట్లు ఇతనికి అంత పెద్ద జీతంతో ఉద్యోగం రావడం వీళ్ళ కష్టాలు గట్టెక్కడమే అవుతుంది.

మహేశం అక్కడికి రావడంతో హరి ఆలోచనలకు అంతరాయం కలిగింది. ఈలోగా వర్ధనమ్మగారు కాఫీ తెచ్చి, ఇద్దరికీ చెరోకప్పూ ఇచ్చి హరిని అతనికి పరిచయం చేసింది.

డిటెక్టివ్ అనగానే మహేశం కంగారు పడ్డాడు. అతని చేతులు చిన్నగా వణకడం గమనించాడు హరి.

అయినా వెంటనే సర్దుకుని "మా అక్క అనవసరంగా కంగారుపడి మిమ్మల్ని, పోలీసుల్ని శ్రమపెట్టింది. నేను వచ్చేసాను గనక ఇక మీరు ఈ కేసు వదులుకోవచ్చు. ఇంతవరకూ మీరు పడ్డశ్రమకు వెంటనే ఫీజు చెల్లిస్తాను," అంటూ లోనికి వెళ్ళి ఐదు పచ్చనోట్లు తెచ్చి హరి కిచ్చాడు మహేశం.

వాటిని చూసి హరి ఆశ్చర్యపోయాడు. ఫస్టు తారీకు దాటిన పదిరోజుల్నుంచే తిరిగి ఎప్పుడొస్తుందా అని ఆలోచించే పరిస్థితిలోవున్న అతను ఇంత డబ్బు ఎలా ఇవ్వగలుగుతున్నాడు?

హరి ఆలోచన్లు పసిగట్టినట్టున్నాడు "నేనేం దొంగతనం చేయలేదు లెండి. నాకు రెండు నెలల జీతం అడ్వాన్సుగా ఇచ్చారు. అదే ఇచ్చాను..."

అతనివైపు తీవ్రంగా చూస్తూ "ఆల్ రైట్ మిస్టర్ మహేశం! మంచి ఉద్యోగం దొరికినందుకు చాలా

సంతోషం. పోతే, ఇందులో మేం చేసిన కృషి ఏమీ లేదు గనుక ఫీజు అనవసరం...'' అంటూ డబ్బు వాపస్ చేసి చరచరా వెళ్ళిపోయాడు హరి.

# 9

మారువేషంలో మహేశాన్ని వెంబడిస్తున్నాడు హరి.

మహేశం టిప్‌టాప్‌గా తయారై పద్మా ఫైనాన్స్ కార్పొరేషన్ ఆఫీసులోకి వెళ్ళిపోయాడు. హరికి యేం చెయ్యాలో అర్థం కాలేదు. తను అనవసరంగా అతణ్ణి అనుమానిస్తున్నాడా?

ఎలాగో ఇంతవరకూ వచ్చాడుగనుక పూర్తిగా పరిశీలించాలని నిశ్చయించుకున్నాడు. ఆ యింటికి ఎదురుగ్గా ఎటువంటి దుకాణాలు లేవు. ఖాళీ మైదానం, అందులో వరుసగా కొబ్బరిచెట్లు మాత్రమే ఉన్నాయి. ఆఫీసుకి ఎడంవైపుగా కొద్దిదూరంలో ఒక చిన్న తాటాకుపాకలో టీ దుకాణం ఉంది. అది దాటగానే మెయిన్ రోడ్ తగులుతుంది.

టీ దుకాణంకి వెళ్ళి టీ తాగి ఆ ఆఫీసు గురించి ఎంక్వయిరీ చేసాడు. టీ కొట్టువాడు చెప్పిన విషయాలనుబట్టి అది ప్రారంభించి నాలుగు నెలలే అయిందిట.

"నువ్వెప్పుడయినా ఆ ఆఫీసు నడుపుతున్న వాళ్ళని చూసావా? ఆఫీసులోకి వెళ్ళావా?"

"లేదు బాబూ! నేను ఎవర్నీ చూడలేదు. ఆఫీసులోకి వెళ్ళలేదు. వాళ్ళకి కాఫీ, టీ కావలసివస్తే ఫ్లాస్కు పంపుతారు, అందులోపోసి పంపుతాను."

"సరే! మా ఫ్రెండు లారీ ఒకటి ఇలా వస్తుందని చెప్పాడు. ఎప్పుడొస్తుందో ఖచ్చితంగా టైమ్ చెప్ప

లేదు. కాబట్టి ఇక్కడే వెయిట్ చేస్తూ వుండాలి. నీకేం అభ్యంతరం లేకపోతే అదొచ్చేవరకూ ఇక్కడే వుంటాను...” అని జేబులోనుండి ఐదు రూపాయలనోటు తీసి వాడికిస్తూ “నేను వెళ్ళేవరకూ తాగే టీలకు, తినే టిఫెన్లకు, తీసుకునే సిగరెట్లకు ఈ డబ్బు ఉంచు. ఇంత కన్నా ఎక్కువైతే ఇచ్చేస్తాను, మిగిలితే అది నీకే...” అన్నాడు హరి.

ఒక్కసారిగా అంతబేరం కళ్ళచూడ్డం చాలా అరుదు కాబోలు వాడి కళ్లు మెరిసాయి. ఓ పాత్ర గుడ్డతో అక్కడున్న కుర్చీలలో ఒకదాన్ని బాగా తుడిచివేశాడు. దాన్ని గుమ్మం దగ్గర వేసుకుని సాయంత్రంవరకు ఆఫీసు గేటువైపు చూస్తూ కూర్చున్నాడు హరి.

హరి దృష్టి అంతా ఆఫీసు గేటు మీదేవుంది.

ఆఫీసు మూసేవేళ కావడంతో అందులోనుండి ఉద్యోగస్తులు జంటలు, జంటలుగా కలిసి వెళ్ళిపోతున్నారు. వాళ్ళంతా స్త్రీలే.

మరో పావుగంట గడిచినా మహేశం జాడలేదు. నెమ్మదిగా లేచి ఆఫీసు దగ్గరకొచ్చాడు. మేడమీద కిటికీ తలుపులన్నీ వేసేసివున్నాయి. అంటే ఆఫీసు మూసేసారన్నమాట. మహేశం ఏమైనట్టు?

మళ్ళీ టీ దుకాణం దగ్గరకువెళ్ళి స్ట్రాంగ్ టీ తాగాడు. మెల్లిగా చీకట్లు ముసురుకుంటున్నాయి. ఇక ఈ ముసుగులో గుద్దులాటకంటే సరాసరి ఆఫీసులోకి వెళ్ళిపోయి అనుమానం నివృత్తి, చేసుకుంటే?

ఇంతలో గేటు దగ్గర యేదో శబ్దం అయింది. గేటు దాటివచ్చిన మహేశం తలవంచుకుని గబగబా వస్తున్నాడు. ఒక వారగా తప్పుకున్నాడు హరి.

మహేశం అటుగా వస్తున్న ఖాళీ ఆటో ఎక్కిపోయాడు.

హరి అటూ యిటూ చూసాడు. ఏ వాహనం కనిపించలేదు. పరుగెత్తాడు. ఇరవై గజాలు పరుగెత్తగానే పక్క సందులోనుండి ఓ ఖాళీ ఆటో వస్తూ కనిపించింది.

దాన్ని ఆపి, మహేశం ఎక్కిన ఆటో చూపిస్తూ "ఆ ఆటోని అతనికి తెలియకుండా వెంబడించాలి. అదెక్కడ ఆగితే అక్కడ ఆపేయ్. నీకు మామూలుగా అయ్యే ఛార్జికన్నా పది రూపాయలు ఎక్కువగా ఇస్తాను" అన్నాడు హరి.

ఆటోవాడు హుషారుగా ఈలవేసి వెంబడించడం ప్రారంభించాడు.

మహేశం ఎక్కిన ఆటో ఓ పెద్ద భవంతి ముందు ఆగింది. మహేశం గూర్ఖావాడికి యేదో చెప్పి, లోనికి వెళ్ళిపోయాడు.

కొద్ది దూరంలో ఆటో ఆపించాడు హరి. వాడికి ఛార్జితోపాటు పది రూ॥లు చెల్లించి "నువ్వు ఈ వీధి చివర్న వెయిట్ చేస్తూవుండు. నీకో పది రూ॥ అడ్వాన్సుగా ఇస్తాను. అరగంట దాకా చూడు. రాకపోతే వెళ్ళిపో. కాని ఈలోగా చెక్కేసావంటే, నీ ఆటో నంబరు బాగా జ్ఞాపకం ఉందిలే. ఏం జరుగుతుందో అప్పుడు చూద్దువుగాని," అని హెచ్చరించి పంపేశాడు హరి.

గబగబా ఆ భవంతివైపు నడిచాడు. గూర్ఖాని ఎందుకో? ఎవరో? పిలిచినట్టున్నారు గేటు దగ్గరలేడు.

ఒకసారి అటూ-ఇటూ చూసి ఎవరూ గమనించడం లేదని గమనించి గబుక్కున గేటుదాటి చెట్లవారకి వెళ్ళిపోయాడు హరి.

చెట్ల వారనుండి పాక్కుంటూ ఒక గది దగ్గరకు వెళ్ళాడు. ఆ గదిలోనుండి యేవో మాటలు వినిపించాయి.

"అయితే నా కొడుకు ఎక్కడున్నాడు? ఎందుకు దాచిపెట్టారు?" విశ్వేశ్వరయ్య కోపంగా ప్రశ్నించాడు.

"అదేం పిచ్చి ప్రశ్న. డబ్బున్న వాడి కొడుకును ఎందుకు దాస్తారు?" మహేశం నవ్వుతూ అన్నాడు.

"డబ్బుకోసమా? ఇప్పుడే పోలీసులను పిలిచి నిన్ను అప్పగిస్తే యేం చేస్తావ్?"

"నేను జీవితంలో తెగించేసాను. వాళ్ళు నన్ను జైలులో పెడతారు. నేను మరి ఉద్యోగం కోసం వెతుక్కోనవసరంలేదు. కాకపోతే నీ కొడుకు అడ్రస్సు ఉండదు."

"ఏం చేస్తారు? చంపేస్తారా? నిన్ను షూట్ చేసి... సర్లే తగువెందుకు...నీకో ఇరవై వేలిస్తాను...నా కంపెనీలో ఉద్యోగం ఇస్తాను...నాతో చేతులు కలుపు... వాడెక్కడున్నాడో చెప్పు... పోలీసులతో చెప్పి వాళ్ళని బంధించి వాళ్ళ పీడ లేకుండా చేసుకుందాం."

"శభాష్! విశ్వేశ్వరయ్యా! శభాష్! ఇంత పెద్ద వాడివి ఎలా కాగలిగావో అర్థమయింది. ఇప్పుడు నాతో చేతులు కలిపి నీ అవసరం కాగానే కుక్కను తరిమినట్టు తరుము దామనా? నక్కజిత్తులు మాని అసలు విషయానికిరా. మరో పదిహేను నిముషాలలో లక్ష రూ॥తో నాతో బయులుదేరి రాకపోతే నీ కొడుకు శరీరంలో యే భాగానికి ఆ భాగం వేరుచేసి రేపు పార్సిల్ పంపుతారు..." అని మహేశం హెచ్చరించాడు.

"సరే నీ షరతుకు అంగీకరిస్తున్నాను. ఐదు నిముషాలు అలా కూర్చో..." అన్నాడు విశ్వేశ్వరయ్య.

మరో అయిదు నిముషాల్లో వాళ్ళిద్దరినీ మోసుకుంటూ కారు కదలిపోయింది.

హరి పరుగెత్తుకుని వీధి చివర్ని ఉన్న ఆటోవాణ్ని పిలిచి, పద్మా ఫైనాన్స్ కార్పొరేషన్‌కి తీసుకు పొమ్మన్నాడు.

మధ్యలో ఓ పబ్లిక్ టెలిఫోన్ బూత్ దగ్గర ఆటో ఆపి, శ్రీనాథ్‌కు ఫోన్ చేసి జరిగిందంతా చెప్పాడు.

"మరో గంటలో నా దగ్గర్నుంచీ ఎటువంటి సమాచారం రాకపోతే వెంటనే బయలుదేరి రండి..." అని మళ్ళీ ఆటో ఎక్కాడు.

ఆటోని రోడ్డు చివరే ఆపి, ఫేర్ చెల్లించి పంపేశాడు.

పద్మా ఫైనాన్స్ కార్పొరేషన్ ఆఫీసు ముందు విశ్వేశ్వరయ్య కారు లేకపోవడంతో తికమకపడ్డాడు హరి. వాళ్ళు ఇక్కడికి రాలేదా? మరెక్కడికైనా వెళ్ళారా? విశ్వేశ్వరయ్య కొడుకును ఎక్కడ దాచారు? ఇక్కడ కాకపోతే అతని కారేది?

బహుశా ముందు జాగ్రత్తకోసం కొద్ది దూరంలోనే కారాపి నడిపించి తీసుకొచ్చారేమో మహేశం. ఎలాగో శ్రీనాథ్ గార్ని గంట పోయాక రమ్మన్నాడు గనుక ఈలోగా ఈ భవనాన్ని పరీక్షిద్దాం" అనుకుంటూ ఆ ఇంటి ఆవరణలోకి వెళ్లాడు.

కుడివైపాక సందు, ఎడమవైపాక సందు కనిపించాయి. రెండు చోట్లా దీపాలులేవు. ఎటువైపు వెళ్లాలా అని కాస్సేపు ఆలోచించి, ఎడమవైపు సందులోకి వెళ్లాలని నిశ్చయించుకుని తడుముకుంటూ చీకటిగావున్న ఆ సందు దగ్గరకు చేరాడు.

ఇంతలో యేదో శబ్దం అయి వెనక్కి తిరగబోయాడు,

కాని అప్పటికే ఆలస్యం అయింది. నెత్తిమీద యేదో బరువుగా పడడంతో స్పృహ తప్పిపోయాడు హరి.

# 10

"ఏడీ నా కొడుకెక్కడ? త్వరగా మీ డబ్బు తీసుకుని వాణ్ని అప్పగించండి." ఆదుర్దాగా కేకలేసాడు విశ్వేశ్వరయ్య.

"ముందా కేకలు తగ్గించి అలా కూర్చో. వెళ్ళి మా బాస్‌తో మాట్లాడి వస్తాను..." అని అతణ్ని ఆ గదిలోనే వుంచి వేరొక విశాలమైన గదిలోకి వెళ్ళాడు మహేశం.

అక్కడ ఒక కుర్చీకి బంధించబడివున్నాడు కామరాజు. అతనికి దగ్గరలో పెద్ద ఇటుకల పొయ్యిమీద అతి పెద్ద మూకుడిలో నూనె సలసలా కాగుతోంది. అదెందుకో అర్థం కాలేదు మహేశానికి.

ఆ గదిలో ఓ వార నిల్చునివుంది బెల్‌బాటమ్ యువతి. ఆమె వెనుక భాగమే కనిపిస్తోంది మహేశానికి.

"బాస్! వాడొచ్చాడు."

"ఈ గదిలోకి తీసుకురా." చాలా కఠినంగా ఉంది ఆమె కంఠం.

లోపలి కొచ్చిన విశ్వేశ్వరయ్యకి ఆమె వెనుక భాగమే కనిపించడంతో ఆమె ఎవరో అర్థం కాలేదు.

"మేడమ్! నువ్వెవరో తెలియడంలేదు. అయినా నాకది అనవసరం. నీకు కావలసింది డబ్బేగా. ఇదిగో తీసుకుని, ఇక నా కొడుకుని వదిలెయ్."

"అబ్బా! ఏం ప్రేమ? నిజంగా నీ పుత్ర ప్రేమకి ఇవే నా జోహారులు. నీ కొడుకు ప్రాణం నీకు తీపి. కాని ఇతరుల ప్రాణాలతో, మానాలతో చెలగాటలు ఆడతావ్.

మిస్టర్ మహేశం! ఇతణ్ని కూడా కుర్చీకేసి బంధించు" వెనక్కి తిరక్కుండానే ఆజ్ఞాపించింది ఆమె.

మరు క్షణంలో అతణ్ని కుర్చీకేసి బంధించాడు. విశ్వేశ్వరయ్య తిడుతూ విడిపించుకోడానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు. కామరాజు తండ్రివంక జాలిగా చూడడం తప్ప, ఏమీ చేయలేకపోయాడు.

ఆమె గిరుక్కున వెనక్కి తిరిగింది. ఆమెను చూడగానే విశ్వేశ్వరయ్య గతుక్కుమన్నాడు.

"నువ్వు...నువ్వు..."

"ఆ నీ కామదాహానికి, నీ కొడుకు పశుబలానికి ఆహుతైపోయిన రీటాని...గుర్తున్నానా?..." రౌద్రంగా అడిగింది ఆమె.

"అయితే నువ్వు సముద్రంలో పడి చావలేదా?" కంపిస్తున్న స్వరంతో అడిగాడు విశ్వేశ్వరయ్య.

"లేదు. నీ పాలిట మృత్యుదేవతను కావడం కోసం బ్రతికేవున్నాను. నీలాంటి కామాంధులకు బుద్ధి చెప్పడానికే ఇంకా వున్నాను."

"అయితే నన్నేం చేస్తావ్?".

"భయపడుతున్నావా? చంపుతానని. చంపనులే నీ కళ్ళముందే నీ కొడుకుని చిత్రవధ చేసి ఒక్కొక్క అంగమే నరుకుతూ ఆ నూనెలో వేయించి నా కసి తీర్చుకుంటాను. ఆ దృశ్యం చూసి నీవు మతిచలించి పిచ్చివాడిలా గెంతుతుంటే పగలబడి నవ్వుకుంటాను."

"నో...నో...అలా జరగడానికి వీల్లేదు. ఆ ఘోరం నేను చూడలేను. నన్నే ముందు షూట్ చేసి చంపేయ్!"

ఇంతలో మస్తాన్, హరని తెచ్చి కిందపడేసి, కదలకుండా తాళ్ళతో కట్టేసాడు.

"వీడెవడో సందులో తచ్చాడుతుంటే స్పృహ తప్పించి తెచ్చేసాను..." అన్నాడు మస్తాన్.

మస్తాన్‌ను చూడగానే గుండెలో రైళ్ళు పరిగెత్తాయి విశ్వేశ్వరయ్యకి.

విశ్వేశ్వరయ్యను చూస్తూనే పళ్ళు పటపటలాడించాడు మస్తాన్. కళ్ళు చింతనిప్పుల్లా ఎర్రగా మారిపోయాయి. ఆవేశంగా రీటావైపు చూశాడు.

"మస్తాన్! ఈరోజు నీ కసి, నా కోపం తీరే సమయం వచ్చింది. వెంటనే పదునైన కత్తి తీసుకురా! ఈ రామరాజుగాడి శరీరంలో ప్రతీ అంగమూ తెగ్గోసి ఆ నూనెలో వేయించు. అది చూసి ఈ విశ్వేశ్వరయ్యగాడు కుమిలి, కృశించిపోవాలి..." అని తీవ్రమైన స్వరంతో ఆజ్ఞాపించింది రీటా.

మస్తాన్ కత్తి తేవడానికి వెళ్ళిపోయాడు. ఈలోగా వారికి తెలివొచ్చింది.

"మహేశం! ఏమిటిదంతా? ఏదో ఉద్యోగం దొరికిందన్నావు? ఇదేనా? ఇలా అందర్నీ బంధించారెందుకు?"

ఆ కంఠం వినగానే ఉలిక్కిపడ్డాడు మహేశం.

"ఓ డిటెక్టివ్ శ్రీనాథ్ అసిస్టెంట్ వారిగారా? మీరు వాపై నిఘా మానలేదన్నమాట. నా ఉద్యోగం సంగతి నీ కనవసరం. మర్యాదగా నోరు మూసుకుని పడుండు" అని కసిరికొట్టాడు.

"ఓహో! శ్రీనాథ్ గారి అసిస్టెంటా...?" అని తల పంకించింది రీటా.

మరో రెండు నిముషాల్లో మస్తాన్, తిరిగొచ్చాడు. వారి యెలా విడిపించుకోవడమా? అనే ఆలోచనలో పడ్డాడు.

"ఛ్ఛో! శానీయ్!" అంది రీటా.

'ఫట్'మని కామరాజు కుడిజబ్బ తెగి అంతదూరంలో పడింది. బాధతో గిలగిలా తన్నుకున్నాడు కామరాజు. పిచ్చివాడిలా కేకలుపెట్టాడు విశ్వేశ్వరయ్య. హరి ఆ దృశ్యం చూడలేక కళ్ళు మూసుకున్నాడు.

కిందపడ్డ చేతిని సలసల కాగుతున్న నూనెలో వేసాడు మస్తాన్. బజ్జీలా వేగిపోతోంది ఆ చెయ్యి.

ఆ భయంకరదృశ్యం చూడలేక గావుకేక లేస్తున్నాడు విశ్వేశ్వరయ్య. ఎప్పుడూ అటువంటి సంఘటనలు చూసి ఉండకపోవడంలో తల పక్కకు తిప్పేసాడు మహేశం.

తన కళ్ళముందే అంతటి దారుణం జరుగుతుంటే ఏమీ చెయ్యలేని తన అసమర్థతకు కోపం వచ్చింది హరికి. మస్తాన్, రీటా మాత్రం వికటాట్టహాసాలు చేస్తున్నారు.

చివరకు హరే తేరుకుని "రీటా! నీకు వీళ్ళపై ఎంత పగా, ద్వేషం, కక్షా ఉన్నా యిలా దానవుల్లా ప్రవర్తించడం అన్యాయం. అసలు మీరెందుకింత నిర్దాక్షిణ్యంగా ప్రవర్తిస్తున్నారు? ఇంతకుముందు జరిగిన రెండు హత్యలూ మీరు చేసినవేనా?..." ఇలాంటి ప్రశ్నలతో మెల్లిగా మాటల్లో దించితే ఈలోగా శ్రీనాథ్ గారు రావచ్చు, అని ఆలోచిస్తున్నాడు హరి.

"మైడియర్ యంగ్ డిటెక్టివ్! ఎన్నో కేసులు అవలీలగా పరిశోధించగలిగిన మీరు, ఈ కేసులో అవగింజంత అయినా పరిశోధన చెయ్యలేకపోయారు కదూ? ఈ హత్యలు చాలా రోజులనుండి పకడ్బందీగా వేసుకున్న ప్లాన్ ప్రకారం జరిగినవి.

ఈ విశ్వేశ్వరయ్యా, వాడి కొడుకు కామరాజు గాళ్ళకు స్త్రీ అంటే ఒక భోగవస్తువు మాత్రమే. కంటికి కనిపించిన అందమైన స్త్రీలను అనుభవించి,విసిరి పారెయ్యడం

వీళ్ళకొక హాబీ. అందులో సంసార స్త్రీ అయినా, పెళ్ళి కాని యువతైనా వీళ్ళకి ఎటువంటి పట్టింపు లేదు.

ఈ మస్తాన్ వీడింట్లోనే పనిచేసేవాడు. ఇతని అందమైన భార్య రజియా వీడి దృష్టిలో పడి వాడి కామదాహానికి బలైపోయింది. తిరగబడిన మస్తాన్‌పై దొంగ సాక్ష్యాలు సృష్టించి, ధనాన్ని, పలుకుబడిని వినియోగించి చేయని దొంగతనంకి మస్తాన్‌ను జైలుపాలు చేసాడు ఈ నీచుడు.

పగతో జైలులో కుమిలిపోతున్న మస్తాన్ జైలులో నుండి కొంతమందితో తప్పించుకుని పారిపోయాడు. ఒక బాంకు దొంగతనంలో తన వంతు వచ్చిన వాటాతో ఈ యిల్లు కొనుక్కొనిఉంటూ విశ్వేశ్వరయ్యపై పగ తీర్చుకోడానికి పథకాలు వేస్తున్నాడు మస్తాన్.

ఈ విశ్వేశ్వరయ్య కంపెనీ ఒకదాంట్లో స్టెనోగా పని చేస్తున్న నన్ను పనుందని ఒకరోజు అర్జెంటుగా కబురు చేసి తనింటికి రప్పించాడు. నాకు అనేక ప్రలోభాలు చూపించి లొంగదీసుకోబోయాడు. కాని నేను ప్రతిఘటించాను. అయినా పశుబలంతో నా మానాన్ని దోచుకున్నాడు.

అదే సమయంలో యీ కామరాజు, రమణ్ మురళీలు కూడా అక్కడకు రావడం జరిగింది. నన్ను చూసి పిచ్చి వాళ్ళయిపోయారు.

నా శరీరాన్ని ఫుట్‌బాలులా విచక్షణ లేకుండా పశువుల్లా అనుభవించి, మలినమైవున్న నా శరీరాన్ని మరింత మలినం చేసేసారు వాళ్ళు.

ఏమీ చెయ్యలేక ఆత్మహత్య చేసుకోడానికై సముద్రపు ఒడ్డుకు వెళ్ళిన నన్ను విచిత్రంగా కలిసిన ఈ మస్తాన్ వారించి విషయం తెలుసుకున్నాడు. ఇద్దరం వీడిమీద పగ

తీర్చుకోవాలని నిశ్చయించుకున్నాం. వెంటనే అయితే మామీద అనుమానం కలిగే అవకాశం వుంటుందని కొంతకాలం ఆగాం.

వీళ్ళకి ఆడపిల్లను చూస్తే ఒంటిమీద బట్ట నిలవదు. ఈ కామాంధులను వారిద్వారా మా వలలోకి లాగాలని నిశ్చయించి, పద్మా ఫైనాన్స్ కార్పొరేషన్ ప్రారంభించి అందమైన అమ్మాయిలకు ఉద్యోగాలిచ్చాం. ఈ విశ్వేశ్వరయ్య, కామరాజు, రమణ్, మురళీల ప్రతి చర్య గమనిస్తూ వాళ్ళని ఎలా లోబరచుకోవాలో ఆ యువతులకు ట్రయినింగ్ ఇచ్చాము.

ఊహించినట్లుగానే రమణ్, మురళి మా వలలో పడడం, వాళ్ళని చిత్రవధచేసి మా కసి తీర్చుకోడం జరిగింది.

ఉద్యోగాలకు సంబంధించిన సమాచారంకనుక్కుంటామని, ఈ కామరాజును వలలోవేసి యిక్కడకు తెచ్చిన అమ్మాయి వెనక ఈ మహేశం పడగా, ఆమె అనుమానంతో మాకు అప్పగించింది. లోనికి వచ్చి కామరాజుని చూసి ఉద్రేకపడ్డాడు అతడు.

తన ప్రియురాలి జీవితాన్ని నాశనం చేసిన వీడిపై పగ సాధించేందుకు మాతో చేతులు కలపడానికి సిధపడ్డాడు.

అతడిగురించి, అతని ప్రియురాలి కథను గురించి వాకబుచేసి, అతను చెప్పింది నిజమే అని తేలాక మాతో అతడ్ని కలుపుకోడానికి అంగీకరించాము.

అప్పటికే విశ్వేశ్వరయ్య తన కొడుకు కనిపించడం లేదని పోలీసులకు రిపోర్టు ఇవ్వడం, అంతకుముందు జరిగిన రెండు హత్యలతో పోలీసుల గాలింపు ఎక్కువగా ఉంటుందని, ఆలస్యంచేస్తే లాభంలేదని, వెంటనే విశ్వే

శ్వరయ్యను యిక్కడకు తెమ్మని మహేశాన్ని పంపిం చాము. ఎక్కడ పొరపాటు జరిగిందో తెలియదుగాని నువ్వు ఇక్కడకు రాగలిగావు.

స్త్రీ అంటే కేవలం విలాస వస్తువుగా ఆటబొమ్మగా భావించే ఇలాంటి కామాంధులకు, నీచులకు బుద్ధి చెప్ప డమేగాక వీళ్ల హత్యలతో ఇటువంటి అకృత్యాలకు పాల్పడేవాళ్ళ గుండెలు బద్దలు గొడతాను. ఈ కామ రాజును చిత్రవధ చేస్తాను..." ఆవేశంతో ఊగిపోయింది రీటా.

"మిస్! నీకు జరిగిన అన్యాయానికి నేను ఎంతో విచారి స్తున్నాను. నువ్వు పగ తీర్చుకోవాలి అని అనుకోడంలో తప్పులేదు. కాని వీళ్లను శిక్షించడానికి న్యాయస్థానాలు, చట్టాలున్నాయి. వాటిని నీ చేతుల్లోకి తీసుకుని నువ్వే వీళ్ళని శిక్షించాలనుకోవడం అక్రమం..." అన్నాడు హరి.

"చట్టం? న్యాయం? ఎక్కడున్నాయి ఆ రెండు? చట్టాలు పేదలను మాత్రమే శాసిస్తాయి, కాని వాటినే శాసించగలరు ఈ విశ్వేశ్వరయ్యలాంటివాళ్ళు. లేకపోతే ఏ నేరం చేయని మస్తాన్ దొంగగా జైలుశిక్ష అనుభవిం చడమేమిటి? ఎన్నో అక్రమాలుచేస్తున్న వీళ్ళు హాయిగా ఉండడమేమిటి? వాటిమీద నమ్మకం నశించిపోయింది. మస్తాన్ వెంటనే ఈ కామరాజుగాడి తల తెగ్గొట్టి, ఆ మూకుట్లో వెయ్!" అని ఆజ్ఞాపించింది రీటా.

ఫట్ మని ఫుట్ బాలులా ఎగిరిపడింది మూకుడులోకి కామరాజు తలకాయ.

హరికి కడుపులో దేవినట్లయింది. తన ప్రయత్నం అంతా వృధా అయినందుకు బాధపడుతున్నాడు.

ఆ దృశ్యం చూడగానే కేక వేసుకుంటూ స్పృహతప్పి పోయాడు విశ్వేశ్వరయ్య.

ఇంతలో పైభాగాన పోలీసు విజిల్సు, బూట్ల చప్పుళ్ళు వినిపించాయి. హరి ముఖం వికసించింది.

మహేశం, మస్తాన్ రీటావైపు కంగారుగా చూస్తున్నారు. వారిద్దర్నీ పారిపోమని చెపుతోంది ఆమె. అయినా వాళ్ళు కదల్లేదు.

"శ్రీనాథ్ ..." గట్టిగా అరిచాడు హరి.

పైన బూట్ల శబ్దం ఆగింది. మళ్ళీ గట్టిగా అరిచాడు హరి.

మస్తాన్ ఆవేశంగా కత్తి తీసుకుని హరిమీదకు పోబోయాడు. కాని రీటా అతడ్ని వారించింది. మంత్రం వేసినట్లు ఆగిపోయాడు మస్తాన్.

రీటా చిటికెనవేలుగోరు నోట్లో పెట్టుకొని కసిక్కున కొరికింది. అంతే! రీటా శరీరం క్షణాలలో నల్లగా మారి నురుగలు కక్కుతూ నేలకూలింది. హరి, మస్తాన్, మహేశం మ్రాన్పడిపోయారు.

ఇంతలో తలుపు తెరుచుకున్న శబ్దం అవడంతో అందరూ ఆవైపు చూశారు. డిటెక్టివ్ శ్రీనాథ్, సుందరం పోలీసులు బిలబిల్లాడుతూ కిందకు దిగారు.

అక్కడ దృశ్యాన్ని చూసి అదిరిపడ్డారు వాళ్ళు. మూకుళ్ళో కామరాజు తలకాయ బూరెలా వేగిపోతోంది.

—: ఐపోయింది :—

# దురభిమానులు!

ఏ. వి. మోహన్రావ్

"ఆరు లీటర్లుపొయ్యి!" అన్నాడు కారులోవున్న డ్రైవరు.

"డీసెలా? పెట్రోలా?" అడిగాడు ఆనందరావు.

"ఇది అంబాసిడర్ కారు! కనపడటంలా?" వెక్కిరింపుగా అన్నాడు కారు డ్రైవరు.

అతనితో వాదనకు దిగకుండా పెట్రోలుపోసి, టాంక్ మూత బిగించి, డబ్బులు అందుకున్నాడు. మేనేజరు దగ్గర బిల్లు తీసుకుంటూ గోడ గడియారం కేసి చూశాడు. పదయింది.

బిల్లు డ్రైవరు కిచ్చి, డ్రమ్ములోవున్న నీళ్ళలో చేతులు కడుక్కొని, రుమాలుతో తుడుచుకుంటూ వెళ్ళి "సార్! పదయింది! ఇంక వెళ్తాను." అన్నాడు ఆనందరావు.

"ఏంటోయ్! ఇంటి దగ్గర పెళ్ళాం నీ కోసం ఎదురు చూస్తున్నట్లు అలా తొందరపడతా వెందుకు? ఎదురు చూసే పెళ్ళామున్నా, ఇక్కడ నేను కూర్చోలా?" అన్నాడు మేనేజరు.

"అది కారు సార్! కొద్దిగా పనుంది. అవసరమైతే రేపు ఓవర్ టైమ్ చేస్తాను లెండి!" అన్నాడు ఆనంద రావు.

"అయితే వెళ్ళు!" అన్నాడు మేనేజర్.

"ఈ వారం జీతం ఇవ్వనేలేదు।" నసుగుతూ నిల్చు న్నాడు ఆనందరావు.

"ఈ నలభై పట్టుకెళ్ళు. లెఖ చూచి రావలసి వుంటే మిగిలింది రేపిస్తాను." అన్నాడు.

ఆనందరావు ఆ కాగితాలు అందుకుని ఈల వేసుకుంటూ రోడ్ పైకివచ్చాడు. అదే టైముకు అతనికి కావలసిన బస్సువచ్చి ఆగింది. తక్కున ఎక్కి కూర్చున్నాడు.

అతని కళ్ళముందు సినీతార 'సితార' రూపం మెదిలింది. బంగారంతో శృంగారం రంగరించి, అంగాంగాలు, అతి లావణ్యంగా మలిచినట్లనిపించింది. ఆమె కళ్ళు తేనె రంగులో వుంటాయని ఒక పత్రిక రాసింది. వాటికేసి ఒక్కమారు చూస్తే, ఎదుట మనిషి శరీరంలో కొన్ని కోట్లు కిలోవాట్ల విద్యుత్తు పుట్టుకొస్తుందని మరో విలేఖరి చమత్కరించాడు. ఆమెకు నడుము లేదని కొందరు, వుందని మరి కొందరు, ప్రారంభించిన వాదులాట, ఇంకా తెగి తెల్లవారలేదనీ, ఈ పాయింటుపై మా పత్రిక దేశమంతా రెఫరెండమ్ పెట్టాలనుకుంటున్నదని, ఒక పత్రిక ఎడిటర్ రాశారు.

సితార నటించిన ప్రతి సినిమా రెండు వందల రోజులు ఆడి తీరుతున్నది. ఆమె సినిమాల్లో ప్రవేశించింది మొదలు ఇప్పటిదాకా, జరిగిన ప్రతి సంఘటన, పత్రికల్లో ప్రచురించిన ప్రతిఫొటో, ఆనందరావు దగ్గర వున్నాయి. సితార గురించి, ఆమెకే తెలియనన్ని వివరాలు, ఆనంద

రావు దగ్గర వున్నాయంటే ఆశ్చర్యపోవలసిన అవసరం లేదు.

"మిస్టర్! ఐస్‌హావుప్ వచ్చేసింది!" అన్నాడు కండక్టరు ఆనందరావును తట్టి వూపుతూ.

ఆనందరావు చటుక్కున లేచి, గబగబ బస్సు దిగాడు.

మెల్లగా నడుచుకుంటూ తను అద్దెకు తీసుకున్న చిన్న గుడిసె చేరుకున్నాడు. తలుపులా అడ్డువున్న తడికకు పెట్టిన తాళంకప్ప తొలగించి లోనికి వెళ్ళాడు.

మట్టిగోడలనిండా, సందు లేకుండా అతికించివుంచిన, 'సితార' బొమ్మలు చూడగానే, అతని ఒళ్ళంతా మత్తుతో నిండిపోయింది. ప్రతి బొమ్మలోంచి ఆమె, అతన్నే చూస్తున్నట్లుగా ఫీలయినాడు.

ఆ బొమ్మల బదులు, ఆమె నిజంగా తన్ను ఆప్యాయంగా, చూసేరోజు ఎప్పుడొస్తుందో ననుకుంటూ, చిన్న రేకుపెట్టె తీసి, అందులోవున్న ఖరీదైన, పాంటు, చొక్కా వెలుపలకు తీసి, వేసుకున్న ఆయిల్ మరకలైన బట్టలు విప్పి, వాటిని ధరించాడు. నీట్‌గా తయారై, పెట్రోలుబంకులో తెచ్చుకున్న నల్లభైరూపాయలు జేబులో వేసుకుని, మళ్ళీ వీధిన పడ్డాడు.

## 2

'ఫోర్ ఏసెస్'హోటలులోకి అడుగుబెట్టాడు ఆనందరావు.

ఒక డాన్సర్ దాదాపు బట్టలన్నీ విప్పేసి, టేబుల్సు మధ్య పాట పాడుతూ, తిరుగుతూంది.

ఆనందరావు ఖాళీగావున్న టేబులుకోసం చూశాడు. ఎక్కడా కనుపించలేదు. మూలగా వున్న టేబులువద్ద

ఇద్దరు మనుషులు కూర్చొని వున్నారు. వాళ్లమధ్య పొడువు పాటి బ్రాందీసీసా వుంది. అందులో సగం ఖాళీ అయి వుంది. ఆనందరావు ఆ టేబులువద్దకు వెళ్ళి "మీకు అభ్యంతరం లేకుంటే!" అన్నాడు ఖాళీగా వున్న కుర్చీ చూపిస్తూ.

బట్టతల వున్న వ్యక్తి, పెదాల నడుమనున్న డ్రింకు గ్లాసు తీసి క్రిందపెడుతూ "కూర్చోండి!" అన్నట్లు చేత్తోనే సైగచేశాడు.

బేరర్ వచ్చి నిలుచున్నాడు. ఆనందరావు చెప్ప బోయేంతలో, "మరో గ్లాసు పట్రా!" అన్నాడు బట్టతల వ్యక్తి.

"నేను ఆర్డర్ చేస్తాను!" అన్నాడు ఆనందరావు.

"ఫరవాలేదు. మనం టేబులుమేట్సు మిప్పుడు." అన్నాడు అతను.

అందరూ కలసి ఒక రౌండ్ పుచ్చుకున్నారు.

"ఇవాళ షో ఎన్నిగంటలకు తెలుసాండి?" అడిగాడు ఆనందరావు తనకు సీటు ఆఫరుచేసిన వ్యక్తిని.

"ఏం షో?" అర్ధంగానట్లుగా అడిగాడు.

"మీకు తెలీదా? ఇక్కడ బ్లూ ఫిలింషోస్ వారాని కొకసారి జరుగుతుంటాయి."

"అరె మాకు తెలీదే!" ఇద్దరూ ఆశ్చర్యపోయారు.

అంతలో బేరర్ వచ్చాడు.

బట్టతల వ్యక్తి బేరర్‌ను అడిగాడు షో గురించి. అతను మెల్లగా చెప్పాడు ఇంకో గంటలో పైనున్న హాల్లో వేస్తారని.

"మిస్టర్! నీ పేరేమన్నావ్?" అడిగాడు ఆనంద రావును బట్టతల వ్యక్తి.

ఆనందరావు అతన్ని గురించి వివరాలు చెప్పాడు.

"నా పేరు డేవిడ్! కార్ల బ్రోకరుగా వున్నాను. ఇతను నా ఫ్రెండు జేమ్స్. ఇంతకుముందు ఆర్మీలో పని చేశాడు. ఇప్పుడేదో తంటాలుపడుతున్నాడు" అన్నాడు బట్టతలవ్యక్తి.

డేవిడ్ కొంత సాధువులా కనిపించాడు. జేమ్స్ మొహం, కళ్ళు చేతులు సిగరెట్ తాగే తీరూ అన్నీ చూస్తే. అతను అన్నింటికీ తెగించినట్లుగానూ, ఎంత ఘోరమైనా చెయ్యటానికి వెనకాడనట్లూ అనిపించింది ఆనందరావుకి.

"బ్లూ ఫిలిం షోలో హీరోయిన్ ఎవరు?" అడిగాడు జేమ్స్.

"తెలీదు!" అన్నాడు ఆనందరావు.

"ఏం సినిమా తార సితారను కున్నానా?" అడిగాడు బట్టతల వ్యక్తి.

"ఆమె గనక అయితే, ఆ రీల్ మొత్తం మనం కాజెయ్యాలి." అన్నాడు జేమ్స్.

"మీరు 'సితార' అభిమానులా?"

"అంతా ఇంతా కాదు. మా వాడు లక్షరూపాయలు దొంగతనం చేసైనా సంపాయించి, ఒక్క రాత్రి సితారతో గడపాలని చూస్తున్నాడు. ఏమయినా అందం అంటే ఆమెది. అటువంటి మనిషి ఇంతకు ముందు పుట్టలేదు. ఇక ముందు పుట్టదు." అన్నాడు డేవిడ్.

"మీ కూడా ఆవిడంటే అభిమానమా?" అడిగాడు ఆనందరావు.

"నాకు పెళ్ళయింది. ప్రతిరోజూ, నా భార్యనే సితారనుకుంటూ ఆనందిస్తుంటాను. అంతటితోనే తృప్తి పడుతున్నాను." అన్నాడు డేవిడ్.

తనతో సితారను ఆరాధించే మరో ఇద్దరు వారికి నందుకు ఆనందరావుకు సంతోషం కలిగింది.

"దేవిడ్ గారూ? మీరు సితారను ఎప్పుడన్నా చూశారా?" అడిగాడు ఆనందరావు.

"చాలాసార్లు చూశాను. సినిమాల్లో" అన్నాడు.

"నేనూ అంతే!" వంతపాట పాడాడు జేమ్స్.

"ఆమెను అనుభవించాలన్న కోరికుందా మీకు?" అడిగాడు ఆనందరావు.

"కోరికయితే వుంది. కానీ ఏం లాభం? కుదురుతుందా? డబ్బెంతయినా ఖర్చుపెట్టగలను" అన్నాడు దేవిడ్.

"ఇందులో డబ్బు ప్రమేయంలేదు. డబ్బుకు అమ్ముడు పోవలసిన అవసరం ఆమెకులేదు. ఆమె దగ్గిర అది కుప్పలు కుప్పలుగా పేరుకుపోయివుంది." అన్నాడు ఆనందరావు.

"అయితే మార్గం ఏమిటి?" అడిగాడు జేమ్స్.

"ఈ మధ్య స్టేట్ మెంట్లో మీరు గమనించలేదనుకుంటాను. ఆమె వివాహం ఫలించలేదు. ఆరునెలలు అవకముందే ఆమె భర్తను వదలివేసింది. అతను డబ్బును మాత్రమే ప్రేమిస్తున్నాడన్న విషయం తెలుసుకొంది. వ్యక్తిగా, ఆమెను ప్రేమించే మనుషులకోసం, వాతావరణంకోసం తపించి పోతుంది. ఎవ్వరికీ చెప్పకుండా, ఎవ్వరికీ తెలీకుండా, ఎటో వెళ్ళిపోయి, మామూలు మనిషిలా కొన్ని దినాలు కాలం వెళ్ళబుచ్చాలన్న కోరిక కూడా పత్రికాముఖంగా తెలియపరచింది—సితార." అన్నాడు ఆనందరావు.

"ఆమె గురించి బాగా స్టడీ చేసినట్లున్నావ్?"

"ఆమె నా ఆరాధ్య దైవం! నా దగ్గర ఆమెకు సంబంధించిన వివరాలు ఎన్నోవున్నాయి."

"అయితే ఆమెను మనం పొందడం ఎలా వీలవుతుం దంటావ్?" అడిగాడు జేమ్స్.

"నేను పెట్టే కొన్ని నిబంధనలకు మీరు ఇద్దరూ ఒప్పు కుంటే పథకం తర్వాత వివరించి చెపుతాను," అన్నాడు ఆనందరావు.

"ఏమిటవి?"

"రేపు రాత్రికి బీచ్‌కి రండి! అక్కడ మాట్లాడు కుందాం!" అన్నాడు ఆనందరావు.

అంతలో బేరర్ వచ్చి 'షో'కు టైమైందని చెప్పాడు. ముగ్గురూ లేచి వెళ్ళారు.

# 3

ఆనందరావు గదిలో కూర్చుని ఆలోచించసాగాడు. పరిచయంలేని క్రొత్త మనుషులతో, ఇలాటి వ్యవహా రంలో కుమ్మక్కు కావడం ఎంతవరకు మంచిదో అతనికి అర్థంగాలేదు.

సితారకు సంబంధించిన కొన్ని ఫైళ్ళు వెలికితీసి, పేపర్లలో ప్రచురించిన ఆమె ఉపన్యాసాలు మళ్ళీ చదివాడు.

ఆమె క్రొత్త బంగళా కొనుక్కొని గృహప్రవేశం చేసిన నాటి పత్రికలు కొన్ని తీసి, అందులో ఇంటి గురించి రాసిన వివరాలు చదివాడు. ఆమె దినచర్య మొత్తం ఒక కాగితంపైన నోట్ చేసుకున్నాడు.

బాగా చీకటి పడ్డాక, లేచి, నడక మొదలెట్టాడు బీచ్ వైపుకు.

మెరీనా కాంటీన్ వెనుక వైపునున్న, సరుగుడు చెట్ల క్రింద కూర్చునివున్న డేవిడ్, జేమ్స్ కనుపించారు. వెళ్ళి వాళ్ళ దగ్గరగా కూర్చున్నాడు.

"రావేమో ననుకున్నాం!" అన్నాడు డేవిడ్.

"ఎందుకు?"

"ఇలాంటి విషయాల్లో భాగస్తులుండటం కొంతమందికి నచ్చదు." జేమ్స్ చెప్పాడు.

"అదీ నిజమే! కానీ భాగస్తుల్ని చేర్చుకునేందుకు కొన్ని కారణాలున్నాయి." అన్నాడు ఆనందరావు సిగరెట్ తీసి అంటించుకుంటూ.

"నీ పథకం వివరిస్తావా?"

"ఆఁ! కానీ ముందు మనం పాటించవలసిన నియమాలు చెబుతాను."

"చెప్పు!"

"సితారను మనం కిడ్నాప్ చేస్తాం. ఆమె తనకు తను ఇష్టపడి, మనతో సహకరిస్తే తప్ప, ఆమెను అనుభవించకూడదు. ఆమెకు ఏ పరిస్థితుల్లోనూ ఎలాంటి హాని మనం తలపెట్టకూడదు. ఆమె మన కస్టడీలో వున్నంత కాలం అవసరమయిన అన్ని సదుపాయాలు, మనం చేకూర్చాలి."

"ఆమె సహకరించకపోతే..." అడిగాడు జేమ్స్.

"ఎలా తెచ్చామో ఆమెను అలా వదిలెయ్యాలి."

"ఆ మాత్రానికి ఎందుకీ వృథా ప్రయాస. నయాన నచ్చ చెప్పూదాం. ఒప్పుకుంటే సరే! అలా గాకుంటే బలవంతంగానైనా మనకోరిక మనం తీర్చుకోవాలి. అలా కానప్పుడు ఈ పథకం అంతా అనవసరం," అన్నాడు జేమ్స్.

"మనం మామూలు మనిషితో వ్యవహరించడంలేదు. ప్రఖ్యాత సినిమా తారతో. ఆమెకుడబ్బు, అంతస్థు, అధికారం, పలుకుబడి అన్నీవున్నాయి. ఆమెను నొప్పించి వదిలా మనుకుందాం. మన అంతు చూచేందుకు అవసర

మైన అన్ని యేర్పాట్లు చెయ్యగలదామె. అలాటి స్థితి తెచ్చుకో కూడదు.'' అన్నాడు ఆనందరావు.

''అంత మాత్రాన ఆమెకు మనపైన కోపం వుండ దంటావా?''

''వుండదు.''

''నీ ఊహ ప్రకారం ఆమె మనతో సహకరిస్తుందా?'' అడిగాడు డేవిడ్.

''సహకరిస్తుంది. నాకు నమ్మకం వుంది.'' అన్నాడు ఆనందరావు.

''ఆ నమ్మకానికి కారణం.''

''ఆమె ప్రస్తుత మానసిక స్థితి. ఆమెకు మనలాంటి మామూలు మనుషుల్తో స్వేచ్ఛగా, ఆనందంగా, కొద్ది రోజులన్నా గడపాలని వున్నట్లు పదేపదే పత్రికల్లో ప్రకటనలు చేస్తూంది. అది చాలు!''

''ఈ దేశంలో మనల్ని మించిన మామూలు మనుషులు కొన్ని కోట్లమంది వున్నారు. మనతోనే గడపాలని ఆమెకు వుందని, నువ్వెలా ఊహిస్తున్నావ్?'' అడిగాడు జేమ్స్.

''మనతోనే గడపాలని ఆమె కుందని నే చెప్పలేదు. మనం రిస్కు చేసి ఆమెను, ఆ కృత్రిమ వాతావరణంలోంచి ఆమె యిష్టాయిష్టాలతో పనిలేకుండా పట్టుకొచ్చి, మామూలు మనుషుల్ని, పరిస్థితుల్ని చూపిస్తాం.

ఒకటి రెండు రోజులు ఆమె క్రొత్త వాతావరణానికి అలవాటు పడలేక తన్నుకుంటుంది. మనపైన కోపంగా వుంటుంది. ఆ తర్వాత ఆమెకై ఆమె మారిపోతూంది. అలా ఆమెలో మార్పువచ్చిందాకా మనం మంచి మనుషుల్లా, ఎదురుచూస్తాం. ఆమె పైని దౌర్జన్యంచేసే అవకాశం

వుండీ, మనం అలా ప్రవర్తించక పోవటంతో, మన మంచితనం ఆమెకు అర్థమవుతుంది- ఆ తర్వాత మనకు ఆమెపై ఎంత ఆరాధనా భావం వుందో గ్రహించ గలుగుతుంది.'' అన్నాడు ఆనందరావు.

''ఇదేదో కథలా రాసుకునేందుకు బాగుంటుందను కుంటాను.'' అన్నాడు జేమ్స్.

''అలా కొట్టిపారెయ్యకు. అతను చెప్పేది కూడా బాగానేవుంది.'' అన్నాడు డేవిడ్.

''అలా ఆమె సహకరించకపోతే ఆమెను వదిలెయ్యాలి. ఆమెను ఇన్నేళ్ళనుండి ఆరాధించిన వ్యక్తిగా, నా కళ్ళ ముందామెకు యే విధమైన అన్యాయం జరగడం నేను సహించను. ఇందుకు మీ రిద్దరూ ఒప్పుకుని నాకు చేతిలో చెయ్యివేసి ప్రమాణం చెయ్యాలి.''అన్నాడు ఆనందరావు.

వాళ్ళిద్దరూ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. ఆ తర్వాత ఆనందరావు చెప్పినట్లే ప్రమాణం చేశారు.

''ముందుగా మనం సిటికి దగ్గరో, ఎక్కడైనా నిర్మా నుష్యంగావున్న ప్రాంతాల్లో, మనం వుండడానికి వీలుగా వుండే ఒక చిన్న యిల్లులాంటిదేదన్నా చూసుకోవాలి. తర్వాత ఒక కారు సంపాదించాలి. ఓ వారం రోజులకు సరిపోయే ఆహారం, బట్టలు, మొదలైనవి సమకూర్చు కోవాలి'' అన్నాడు ఆనందరావు.

''ఇంటిది ప్రాబ్లంగాదు. నా ఫ్రెండొకతను మహా బలిపురం వెళ్ళేదోవలో,ఒక తోట కొన్నాడు. అందులో ఒక చిన్నబంగళావుంది. అందులో అన్నివసతులున్నాయి. అయితే అక్కడో వాచ్ మెన్ వున్నాడు. వాడ్ని ముందుగా పంపించెయ్యాలి. ఆ ఏర్పాట్లు చూస్తాను. రెండోది కారు. నాకో కారువుంది. అది సరిపోతుం

దనుకుంటాను.మిగిలిన విషయాలకు డబ్బుంటే చాలు.''
అన్నాడు డేవిడ్.

''నా దగ్గర డబ్బేమీ లేదు!'' అన్నాడు ఆనందరావు.

''అప్పుడే అనుకున్నాను''అన్నాడుజేమ్స్‌వ్యంగ్యంగా.

''ఏమని?''

''ఉండదని. లేదుగాబట్టే మమ్మల్ని భాగం కలుపు కుంటున్నావ్. పెట్టుబడి పెట్టని వాళ్ళను వర్కింగ్ పార్ట నర్స్ అంటారు. వాళ్ళకు నష్టాలతో పనిలేదు. లాభంలో నే భాగం వుంటుంది. దీనిపైన మేము పెట్టే డబ్బుకు తగిన ఆదాయం రాబట్టుకోనడం మా విధి. అందువల్ల నిబంధనలు పెట్టే వాక్కు నీకు లేదనుకుంటాను.'' అన్నాడు జేమ్స్.

''అయితే మళ్ళీ మనం మొదటికి వచ్చాం.''అన్నాడు ఆనందరావు.

డేవిడ్ కలుగ చేసుకుంటూ ''జేమ్స్ మాటల పట్టించు కోవద్దు. మేము మనుషులం ఇద్దరం కావచ్చు, కానీ నా మాటే అతనిమాట. నువ్వు చెప్పినట్లే కానీ. ఇంతకూ యే మాత్రం ఖర్చవుతుంది?''

''దాదాపు పదివేలు కావచ్చు.''

''నువ్వెంత పెట్టుబడి పెడతావ్?''

''నా దగ్గర డబ్బులేదు. చెప్పాను కదా!''

''అది లేకుండానే నా ఇన్ని ఆలోచనలూ...'' వెక్క సరిగా అన్నాడు జేమ్స్.

''నా దగ్గర డబ్బు లేకున్నా ఈ పథకం తయారు చేయడానికి నేను వెచ్చించిన కాలం, సంపాదించిన సమా చారం చాలవా? అవి లేకుండా ఏం చెయ్యగలుగుతాం?'' ఎదురు ప్రశ్న వేశాడు ఆనందరావు.

''అనవసరపుచర్చ అవసరంలేదు. నీ దగ్గర డబ్బులేదు. మొత్తం మేము పెట్టాలి! అంతేనా?'' అడిగాడు జేమ్స్.

"అంతే!"

"అయితే నాదొక కండిషను. సితార మన చేతుల్లో చిక్కాక ఆమె మనలో ఎవరితోనన్నా వుండి పోదలచు కుంటే ఆ అవకాశం మొదట నాకివ్వాలి. నన్ను కాదన్న తర్వాతే మీ ఇద్దరూను. అదీగాక, ఆమె మీలో ఎవర్న న్నా కోరుకున్నా, నాకు ఇష్టమైనప్పుడు ఆమెను అను భవించే హక్కు నాకుండాలి! ఏమంటారు?" అడి గాడు డేవిడ్.

ఇద్దరూ మౌనంగా వుండిపోయారు.

"ఆమె పతివ్రత కాదు! కన్నెపిల్ల కాదు!! ఆ విషయం మీ ఇద్దరికీ తెలుసు. అలాంటప్పుడు మీరు నాకీ ప్రమాణం చెయ్యడంలోని ప్రమాదం యేమిటో అర్థం కావటం లేదు!" అన్నాడు డేవిడ్.

"అలాగే! నాకు అభ్యంతరం లేదు!" అన్నాడు జేమ్స్.

"నాకు అభ్యంతరం వుంది." అన్నాడు ఆనందరావు.

"ఎందుకని?" అడిగాడు డేవిడ్.

"ఆమె చరిత్ర ఎటువంటిదైనా, నన్ను కావాలను కున్న క్షణంనుంచి, ఆమె నా భార్య అవుతుంది. అందు వల్ల నువ్వు కోరిన విధంగా నేను హామీలు ఇవ్వడం వీలు కాదు. మన ప్రయత్నం మానివేద్దాం!" అన్నాడు ఆనందరావు.

"ఇందులో రాజీకి యే విధమైన ఆస్కారం లేదు!" అన్నాడు డేవిడ్.

"అదే నేను చెప్పేది కూడా!"

"అయితే మనం ఎందుకు టైం వేస్టుచేస్తున్నాం. వెళ్ళి పోదాం పద!" అన్నాడు జేమ్స్.

ముగ్గురూ లేచారు.

మాటా పలుకూ లేకుండా ఇసుకలో నడుచుకుంటూ లైట్లవేపు సాగిపోయారు.

# 4

"వీడికి బుర్ర చెడట్టుంది!'! అన్నాడు జేమ్స్, ఆనంద రావు బస్సెక్కి వెళ్ళిపోయాక.

"అలా ఎందు కనిపించింది?"

"లేకుంటే 'సితార'ను లేవదీసుకు పోవడమేమిటి? ఆమెను మనం అందుకోగలమా?"

"అందుకో లేమా?"

"ఆమె చుట్టూ రకరకాల కుక్కలు, వాట్నిమించి నమ్మకంగా ఆమెను అనుక్షణం కాపాడుకునే మనుషులు, దాన్నిమించి రక్షణ కల్పించే కోట్లకు మించి డబ్బూ, యిన్నివున్నాయి మనకు అడ్డుగా. అసలు ఆమెకు గజం దూరందాకా వెళ్ళగలమాని సందేహం!" అన్నాడు జేమ్స్.

"సితార గురించి ఆ ఆనందరావు చాలా పరిశోధన చేశాడు. పకడ్బందీగా ప్లాను తయారుచేశాడు. ఆమెను అనుభవించడం నా కోరిక కాదు. ఎంత అందకత్తెయినా ఆమెకూడా ఆడదే! నాకు ఆడవాళ్ళలో పెద్ద భేదం కనుపించదు" అన్నాడు దేవిడ్.

"అయితే ఇంతదాకా అతనితో ఎందుకు మాట్లాడావ్?"

"దానికీ కారణం వుంది. మనం చిల్లర దొంగతనాలు, స్మగ్లింగులు చేస్తున్నాం. మనం సంపాదించే డబ్బుకన్నా, కటకటాలు తప్పించుకునేందు కిచ్చుకునే మామూళ్ళు ఎక్కువగా వున్నాయి. అందువల్ల, మన దరిద్రం తీరేలా యేదైనా పెద్ద పథకం వెయ్యాలి. అది దృష్టిలో వుంచుకునే యింత సేపూ మాట్లాడాను" అన్నాడు దేవిడ్ పైప్ తీసి వెలిగిస్తూ.

"గురువుగారు పెద్ద ప్లాను వేశారన్నమాట."

"అవును!"

"వివరంగా చెప్పండి. విని ఆనందిస్తాను."

"ఆనందరావు చెప్పిందాని ప్రకారం, నిజంగా సితారను మనం ఎగరేసుకు రాగలిగితే, ఆ తర్వాత కోరినంత డబ్బు రాబట్టుకోవడం పెద్ద విచిత్రంగాదు!" అన్నాడు దేవిడ్.

"అంటే ఆమె మన చేతికి చిక్కాక, బేరానికి దిగుతావన్నమాట!" అడిగాడు జేమ్స్.

"అవును!"

"అయితే అతన్ని మధ్యలోనే పంపావెందుకు? అతను చెప్పినట్లు చేసివుంటే పోయేది గదా?"

"అలా పోకూడదు. మనల్ని గురించి అతనికింకా తెలీదు. అతను చెప్పిందానికల్లా తల వూపితే, మనం వేరే ఆలోచనలో వున్నామన్న అనుమానం అతనికి రావచ్చు. అందువల్ల ఆమె శరీరంపైన, అందంపైన, అతనిలా మనకూ తీరని కోరిక వుండటంవల్లే అతనితో జట్టు కలిశామన్న నమ్మకం కలగాలి. అది కలిగించాలంటే ఇంతకన్నా వేరే మార్గం లేదు" అన్నాడు దేవిడ్.

"మరి అతని పథకం తెలుసుకోకుండానే అతన్ని దూరంగా తరిమేశావుగా?"

"అది చిన్న నాటకం. రెండ్రోజులు ఆగి చూద్దాం. నేను పెట్టిన షరతు కంగీకరించి అతనే మనల్ని కలుసుకునేందుకు రావచ్చు. అలా రాని పక్షంలో మనమే మనసు మార్చుకున్నామని చెప్పి, అతనితో మళ్ళీ జట్టు కట్టవచ్చు" అన్నాడు దేవిడ్.

ఇద్దరూ పార్కింగ్ లో వున్న కారెక్కారు. రాయ

పేటవేపు పోనిచ్చాడు కారు. తారురోడ్డుపైన మెత్తగా జారిపోతున్నాయి టైర్లు. కొంతదూరం పోయాక, జనం పెద్ద గుంపుగా రోడ్డుకు అడ్డంగా నిలుచుని వుండటం గమనించి కారాపాడు డేవిడ్.

"ఏమిటో గొడవ కనుక్కో!" అన్నాడు ప్రక్కనున్న జేమ్స్‌తో.

జేమ్స్ దిగివెళ్ళాడు. ఒకతన్ని పిలిచి "ఏమిటీ హడావుడి?" అడిగాడు.

"సినిమా తార సితార ఈ రోడ్‌న రాబోతూంది!" అన్నాడతను.

"నడిచి వస్తుందా?" అడిగాడు జేమ్స్.

అవతల వ్యక్తి హేళన చేసినట్లు చూస్తూ "సితార నడిచి వస్తుందా? నీకు పిచ్చా. ఆమె విమానంలో రోడ్డు మీద రాగలదు!" అన్నాడు.

"నాకు తెలీదు! ఏమీ అనుకోకు?" అంటూ ఇంకొంత ముందుకు జనాన్ని తోసుకువెళ్ళి, మొఖాల్ని చకచక పరీక్షగా చూశాడు. రోడ్డు నానుకుని, ఆత్రతగా చూస్తున్న ఆనందరావు కనిపించాడు.

అంతలో ఓ జీప్ వచ్చింది. అందులో నిండా జనం వున్నారు.

"సితారగారు వస్తున్నారు. కారు మా వెనుకనే వుంది. రోడ్డు కడ్డురాకుండా ప్రక్కగా చూడండి" అంటూ మైక్‌లో చెప్పుకుంటూ వెళ్ళిపోయారు.

రెండు నిముషాల తర్వాత పొడవుగా వున్న తెల్ల ఇంపాలా కారు వచ్చింది. అందులో వెనుకసీటులో కూర్చుని, చెయ్యి కిటికీగుండా బైటపెట్టి, వూపుతూ కూర్చుంది సితార. ఆమె చెయ్యితప్ప, మొహం యెవ్వరికీ కనుపించలేదు. కారు చిన్నగా కదలుతూంది.

ఆనందరావు ఆ చెయ్యి తాకేందుకు ప్రయత్నిస్తూ కారు వెంటబడ్డాడు. అడుగులు తడబడి, తలక్రిందుగా పడిపోయాడు.

జనం చుట్టూ చేరారు. కొందరు అతన్ని పైకి లేవనెత్తారు. అందరూ హేళనగా అర్థంపర్థం లేకుండా మాట్లాడసాగారు.

అంతలో జేమ్స్ వచ్చి "ఏమిటి పడిపోయారా?" అడిగాడు.

"అవును. కాలు తడబడింది" అన్నాడు కాస్త వంచి పెడుతూ కాలును, ఆనందరావు.

"అరె నొప్పిగా వుందేమో? డేవిడ్ కారు అక్కడే వుంది. రండి దాంట్లో వెళ్దాం!" అన్నాడు జేమ్స్.

మారు మాట చెప్పకుండా కారువేపు నడిచాడు ఆనందరావు. లోన కూర్చున్నాక జేమ్స్ చెప్పాడు డేవిడ్‌తో జరిగింది.

"ఇంతకూ ఆమె చేతిని తాకావా?" అడిగాడు డేవిడ్.

"ఆఁ! కానీ ముద్దు పెట్టుకుందామని ప్రయత్నం చేశాను."

"అబ్బ! నువ్వు అసాధ్యుడివే! అడ్రసు చెప్పు తీసుకెళ్లి దించుతాను" అన్నాడు డేవిడ్.

ఆనందరావు చెప్పిన గుర్తుల ప్రకారం కారు ముందుకు పోనిచ్చాడు డేవిడ్. ఐదారు మలుపులు తిరిగాక, ఒక కొబ్బరిఆకులతో కప్పిన గుడిసెముందు ఆపమన్నాడు కారు. డేవిడ్ బ్రేక్ వేశాడు.

"అదే నా గది!" అన్నాడు ఆనందరావు.

"ఇంత చిన్న ఇంట్లోనా వుంటున్నావ్?"

"ఏం! పెద్ద ఆలోచనలు చేసేందుకు పనికిరాదనా?"

"కాదు! ఇంతకన్నా మంచిచోట వుండివుంటావను కున్నాను. పోనీలే! నీకు మంచి గది చూడమన్నావా?" అడిగాడు డేవిడ్.

"నువ్వు చూసినదానికి అద్దె ఇచ్చుకోవద్దూ!"

"అద్దె సంగతి నాకొదిలేయ్."

"అద్దె కట్టనవసరంలేకుండా అందరికీ గదులు కుదుర్చు తుంటావా కొంపదీసి" ఆశ్చర్యంగా అడిగాడు ఆనంద రావు.

"అలాగే అనుకో! అయితే వాళ్ళు స్నేహితులయి వుండాలి!" అన్నాడు డేవిడ్.

"ఆ అవసరం నాకు లేదు. ఈ గది బాగానే వుంది!" అన్నాడు ఆనందరావు.

"తలుపుతీసి చూపిస్తే బాగుందీ లేనిదీ చెప్పగలం" అన్నాడు జేమ్స్.

ఆనందరావు తాళం తీశాడు. ముగ్గురూ లోనికి వెళ్ళారు. గదిలో లైటు వెలిగించగానే, కనుపించిన సితార ఫొటోలు చూసి పిచ్చెక్కిపోయింది ఇద్దరికీ. నాలు గైదు దేవదారు పెట్టెలున్నాయి. వాట్ని గురించి అడగ నవసరం లేదనిపించింది వాళ్ళకు.

"ఎలా వుంది?"

"సితార ఒళ్ళో పడుకుని హాయిగా నిద్రపోతున్న ట్లుంది" అన్నాడు చుట్టూ వున్న బొమ్మలను తదేకంగా చూస్తూ జేమ్స్.

"ఆనందరావుగారూ! ఇక మేం వెళ్తాం. మీ కాలు నొప్పి తగ్గేందుకు రెండ్రోజులు పడుతుందేమో. ఈ వంద ధూపాయలుంచండి" అంటూ అందించాడు డేవిడ్.

"అవసరంలేదు!" అన్నాడు ఆనందరావు.

"అదేం! డబ్బేం చేసిందయ్యా పాపం! అవసరానికి వాడుకో. ఆ తర్వాత నీకు డబ్బు రాగానే నా అప్పు తీర్చెయ్యి" అన్నాడు డేవిడ్.

ఆనందరావు మెత్తబడ్డాడా మాటతో. నోటు తీసి జేబులో పెట్టుకున్నాడు.

"మేం వస్తాం!" అంటూ సెలవు పుచ్చుకుని డేవిడ్, జేమ్స్ వెలుపలకు వెళ్ళిపోయారు.

## 5

ఆనందరావుకు సితార చెయ్యికి తన చెయ్యి తగిలినప్పుడు పుట్టిన విద్యుత్ గుర్తొచ్చింది.

ఆమె వ్రేళ్ళ మృదుత్వం అతన్ని ఆశ్చర్యపరచింది. అంత అందమయిన వేళ్లతో, ఆమె ఎలాంటి పనులు చేస్తుందో ఊహించసాగాడు.

అంతలో డేవిడ్ గుర్తొచ్చాడు. అతన్ని ఇంటిదాకా దిగబెట్టి, ఖర్చుల నిమిత్తం వందరూపాయలిచ్చిన మనిషిలో అంత మంచితనం వుండీ, పశువులా, నీచమైన కోరిక ఎలా కోరగలిగాడో, ఎంత ఆలోచించినా అతనికి అంతుపట్టలేదు.

అతని పథకం, ఫలించేరోజు దగ్గిర కావచ్చిందని ముందురోజంతా మురిసిపోయాడు. కానీ అది మళ్ళీ మొదటికే రావటం అతనికి చాలా నిరాశ కలిగించింది. అతనికోరికకు ఒప్పుకుంటేనో... అనుకున్నాడో క్షణం. ఆ తర్వాత ప్రేమించి పెళ్ళాడిన సితారను చేజేతులా మరో నీచుడికి అప్పగించినట్లువుతుందని అనుకున్నాడు.

దొరికిన శాస్త్ర ఆధారాన్ని, ముందుచూపు లేకుండా పోగొట్టుకున్నట్లుగా తోచింది ఆనందరావుకు.

అతని బుర్ర ఆలోచనలతో గిర్రున తిరగసాగింది. మాట వరుసకు డేవిడ్ కోరినట్లు ఒప్పుకొని, ఆ తర్వాత అదృష్టం కలిసివచ్చి, ఆమె తనదయితే...అప్పుడు కలిగే అంతస్తు, హోదా, ఆ ఆధారంతో డేవిడ్‌ను దూరంగా వుంచవచ్చుననిపించింది. అదే సరయిన మార్గమనిపించింది ఆనందరావుకు.

ఆ ఆలోచన రాగానే అతనికి ఆనందం కలిగింది. తెల్లవారాక వెళ్ళి డేవిడ్‌ను కలుసుకుందామని తీర్మానించుకున్నాడు.

తెలీకుండానే నిద్ర ముంచుకొచ్చింది.

మళ్ళా కళ్ళు తెరిచి చూసేసరికి తెల్లగా తెల్లవారిపోయి వుంది. గబగబ కాలకృత్యాలు ముగించుకున్నాడు. డ్రెస్ చేసుకొని వీధినపడ్డాడు.

కాకా హోటలులోనికి వెళ్ళి రెండు బన్‌లు ఒక టీ ఆర్డరు చేశాడు. వేడి టీలో బన్ రొట్టె ముక్కలు తడుపుకుంటూ తినసాగాడు.

డేవిడ్ అడ్రసు అడగకపోవడం తప్పనిపించింది ఆనందరావుకు. మొదటిసారి కలసిన, ఫోర్ ఆటీన్స్ హోటలుగానీ, రెండోసారి కలుసుకున్న మెరీనాబీచ్ కాని, రాత్రిపూట తప్ప పగలు ఆ ప్రదేశాల్లో మనుష్య సంచారం వుండదు.

టీ త్రాగడం పూర్తయ్యాక, బిల్లు చెల్లించి వెలుపలకొచ్చాడు. ప్రక్కనున్న బంకులో సిగరెట్లు, అగ్గిపెట్టెలతోపాటు సినిమా పత్రిక కూడా కొన్నాడు. అక్కడే నిలుచుని తిరగెయ్యసాగాడు.

మొదటిపేజీలో పెద్దపెద్ద అక్షలరాతో రాసిన వార్త అతన్ని ఆకర్షించింది. ఆత్రుతగా చదివాడు. సితార

మరో మూడు రోజుల్లో అమెరికా వెళ్ళబోతూంది. అక్కడ్నుంచి దాదాపు నెలరోజులదాకా తిరిగిరాదు.

ఆనందరావుకు చెమటలు ముంచుకొచ్చాయి. ఆమె అమెరికా వెళ్ళివచ్చిందాకా తన పథకం వాయిదా వేసుకోవడం అసంభవమనిపించింది. ఎలాగైనా డేవిడ్‌ను కలుసుకోవాలనిపించింది. ఎటూ రాత్రిదాకా ఆగాలి కాబట్టి, తిన్నగా గదికి వెళ్ళి, ఆలోచించుకుంటూ కూర్చోవడం మేలనిపించి తిరుగుముఖం పట్టాడు.

మళ్ళా గదికి చేరుకున్నాడు ఆనందరావు. పేపరు చదువుతూ కూర్చున్నాడు.

అరగంట గడిచింది. బైట కారాగిన చప్పుడైంది.

లేచి వెళ్ళి చూశాడు. నల్ల అంబాసిడర్ కనుపించింది. అందులోంచి దిగుతున్న డేవిడ్ కనుపించాడు.

"హల్లో ఎలా వుంది కాలు?" అడిగాడు డేవిడ్.

"బాగానే వుంది! ఏమిటిలా ప్రొద్దున్నే వచ్చారు?". అడిగాడు ఆనందరావు.

"నీ కాలెలా వుందో చూద్దామని" అన్నాడు డేవిడ్'

ఇద్దరూ లోనికి వచ్చి కూర్చున్నారు.

"రాత్రంతా ఆలోచించాను. మీ కోరిక అంత అసమంజసంగా కనుపించలేదు. అందువల్ల, ఒప్పుకోదలచుకున్నాను. ఈ విషయం మీతో చెప్పేందుకు, ఇవాళ రాత్రికి కలుసుకొనే ఉద్దేశంలో వున్నాను. ఇంతలో మీరే వచ్చారు" అన్నాడు ఆనందరావు.

"గుడ్! అయితే ఇంకేం మనం పని ప్రారంభించవచ్చు!" అన్నాడు డేవిడ్.

"మీ ఫ్రెండు రాలేదా?"

"లేదు! అతనుకూడా వుండాలా?"

"అవసరం లేదు!"

"అయితే ఎలా ఎక్కడ ఎప్పుడు మొదలెట్టాలో చెప్పు" అన్నాడు డేవిడ్ తాపీగా కూర్చుని సిగరెట్టు ముట్టిస్తూ.

"మనం ముందు పేర్లు మార్చుకోవాలి. పొరపాటున కూడా ఆమె ముందు మన అసలు పేర్లు పలకకూడదు. ఎందుకంటే, ఆమె మనపైన ఉత్తరోత్తరా పగ తీర్చుకోదలచుకుంటే పోలీసులకు మన వివరాలు చెప్పే అవకాశం ఆమెకు లేకుండా చెయ్యాలి. వీలైనంతవరకూ మన రూపాలు కూడా మార్చుకోవడం మంచిది" అన్నాడు ఆనందరావు.

"కరెక్టు. నువ్వే పేర్లు సెటిల్ చెయ్యి!" అన్నాడు డేవిడ్.

"నన్ను వేణు అని పిలవండి. మీరు గడ్డం పెంచి వున్నారు కాబట్టి మిమ్మల్ని 'యూసఫ్' అంటాము. మీ ఫ్రెండును 'సింగ్' అందాము. ఎలా వుంది?"

"వండర్ ఫుల్ గా వుంది. తర్వాత."

"ముందు మీరు చెప్పిన బంగళా చూసివద్దాం. అక్కడికి అవసరమైన సామగ్రి మొత్తం ఈ రాత్రికే చేరుద్దాం. పేపర్లో రాసిన దాని ప్రకారం సితార ఎల్లుండి రాత్రికి అమెరికా వెళ్ళాలి. వెళ్ళిందంటే నెలరోజులు తిరిగిరాదు. అంతదాకా మనం ఆగడం అవివేకం. అందు వల్ల ఆమెను ఎల్లుండి ఉదయాన్నే లేవదీసుకువద్దాం. ఏమంటారు?" అడిగాడు ఆనందరావు.

"అమెరికాకు ప్రయాణం పెట్టుకొంది గాబట్టి, తీరా కనుపించకపోతే కంగారెక్కి, పోలీసుల్ని పిలవరూ..." తన అనుమానం వ్యక్తం చేశాడు డేవిడ్.

"ఆమె ఒకచోటికి వెళ్తానని మరో చోటికి వెళ్ళడం, వెళ్ళకుండా ఆగిపోవడం చాలా మామూలు. అలా నాలుగైదుసార్లు చేసింది అందువల్ల ఆమె సెక్రెటరీ, మిగిలిన వాళ్ళూ, ఆమెను యెవరో లేవదీసుకుపోయారని అనుమానించినా ఒకపట్టానపోలీసుల్ని ఇందులోకి దింపరు. ఆ నమ్మకం నాకుంది" అన్నాడు ఆనందరావు.

"ఆమెను లేవదీసుకు వెళ్ళడం ఎలా?"

"అందుకు సరియైన సమయంవుంది. ప్రతిరోజు ఉదయం ఐదింటికి లేస్తుంది సితార. స్నానం పానం ముగించుకుని, చీకటిగా వున్నప్పుడే, శరీరాన్ని అందంగా వుంచుకోవడం కోసం, మామూలు బ్రా, అండర్ వేర్ లతో, బంగళా దగ్గరనుంచి కాంపౌండ్ గేటుదాకా పది పన్నెండుసార్లు పరుగెత్తుతుంది.

ఆ టైమ్‌లో ఎవ్వరూ ఆమెతో వుండరు. ఆమె వెంట ఒక బొచ్చుకుక్క మాత్రం అరుచుకుంటూ పరుగెత్తుతుంది. కాంపౌండ్ ప్రక్కన పెద్ద మామిడి చెట్టువుంది. ఆ చెట్టు క్రిందకు వచ్చినప్పుడు పైని ఆకుల నీడవల్ల, మసక చీకటిగా వుండటంతో, ఆమె ఎవ్వరికీ కనుపించదు. అదే సరయిన సమయం మనకు." అన్నాడు ఆనందరావు.

"సితార గురించి చాలా వివరాలు సేకరించావే?"

"ఆఁ!ఆమెనూ, కుక్కనూ మనం కారులోకి చేర్చాలి. అంతకు ముందుగానే ఆమెకు క్లోరోఫారం వాసన చూపించాలి. కుక్కకు అదే చెయ్యాలి. ఆ తర్వాత అరగంటలో మనం బంగళా చేరుకుంటాము. ఎలావుంది ప్లాను!"

"బాగుంది. కాంపౌండ్ వాల్ కున్న గేటు మూసి వుండవచ్చు. లేదా అక్కడ కాపలాగా గూర్ఖావుండవచ్చు. మరి దాని విషయం ఏమిటి?"

"కరెక్టు. కాంపౌండు గేటు తూర్పువేపునుంది. దక్షిణంవేపుకూడా కాంపౌండ్ గోడ నానుకొని రోడ్డు వుంది. మనం కారా రోడ్ లో పెట్టాలి. జేమ్స్, నేనూ లోనికి వెళ్తాం. కారు ఇంజన్ ఆన్ చేసి రెడీగా వుండాలి. మేము లోనికి ఎక్కగానే స్టార్టుచేసుకుపోవాలి. మేము ఆమెను గేటుద్వారా తీసుకురాము. గోడ దాటిస్తాం. దాని కవసరమైన ఫోల్డింగ్ లాడర్ ఒకటి మనం సంపాదించుకోవాలి."

"దక్షిణంవేపు రోడ్డు నానుకొని ఇళ్లు లేవా?"

"లేవు! అన్నీ కొండలు, రప్పలు. నరసంచారం వుండదు."

"అయితే మనల్ని యెవ్వరూ చూసే ప్రమాదం లేదన్నమాట!"

"లేదు! కారు జాగ్రత్త కూడా మనం తీసుకోవాలి...!"

"ఏమిటది?"

"కారు నెంబరు గురించి. అది కనుపించకుండా బురద ముందుగా పూసివెయ్యాలి. లేదా ప్లేటు మార్చివెయ్యాలి" అన్నాడు ఆనందరావు.

"నీ బుర్ర చాలా పదును గలది. అన్ని పాయింట్లు ఆలోచించావ్. మన పథకం విజయవంతమౌతుందని నమ్మకం కలుగుతూంది నాకు" అన్నాడు డేవిడ్.

"భగవంతుడి దయ."

"అయితే ఆలస్యం యెందుకు? పని ప్రారంభిద్దామా?" అడిగాడు డేవిడ్ ఉత్సాహంగా.

"నేను రెడీ!" అన్నాడు ఆనందరావు.

ఇద్దరూ వెళ్ళి కారెక్కారు. కారు రివ్వున ముందుకు దూసుకుపోయింది.

# 6

తెలవారుఝామున నాలుగుగంటలైంది.

కారు 'సితార' వుంటున్న బంగళా ప్రక్క దక్షిణం వేపు రోడ్‌లో పెట్టారు. జేమ్స్, ఆనందరావూ ఇద్దరూ, కాంపౌండు గోడ ఎక్కి, లోనికి దూకారు. మామిడి చెట్టు పైకెక్కి కొమ్మల్లో కూర్చున్నారు.

అరగంట పైనే దాటింది.

దూరంగా వున్న బంగళా మేడ పైభాగాన కిటికీ అద్దంలోంచి వున్నట్లుండి వెలుతురు వచ్చింది. ఆనందరావు అది గమనించాడు. 'సితార' నిద్ర లేచి వుండాలని పించింది.

ఆ తర్వాత అరగంట ఏవిధమైన సందడి కాలేదు.

ఇంతలో వున్నట్లుండి కాంపౌండు గేటుదగ్గర కారు వచ్చి ఆగింది. రెండుసార్లు హారన్ మ్రోగింది.

జేమ్స్ అర్థంకానట్లు చూశాడు ఆనందరావుకేసి. అతనూ ఆ కారుకేసి చూడసాగాడు.

గేటు తెరచుకుంది. కారు బంగళా వేపు వెళ్ళింది. ఐదు నిముషాల్లో మళ్ళీ తిరిగి వెళ్ళిపోయింది. గేటు మళ్ళీ మూసుకు పోయింది.

"ఆ కారెందుకు వచ్చినట్లు?" అడిగాడు జేమ్స్.

"పాలు, కూరలు తెచ్చివుంటుంది" అన్నాడు ఆనంద రావు.

మరో పది నిముషాలు జరిగాయి.

బంగళా క్రిందివేపు పోర్టికోలో లైటు వెలిగింది. ఆ తర్వాత రెండునిముషాలకు లైట్లక్రింద సితార ప్రత్యక్ష మైంది. ఆమె కాళ్ళవద్ద ఒక బొచ్చుకుక్క తారట్లాడ సాగింది,

అక్కడ్నుంచి చేతులు ఊపుకుంటూ నడకగాని పరుగులో కాంపౌండు వేపు రాసాగింది సితార. ఆమె వంటిపైన బ్రా, అండర్ వేరు తప్ప మరేంలేవు. తల వెంట్రుకలు అటూ ఇటూ పడకుండా, గట్టిగా రిబ్బను కట్టివుంది. చెట్టు క్రిందనుంచి గేటుదాకా వెళ్ళింది. అక్కడ్నుంచి మళ్ళా బంగళా వేపు పరుగెత్తింది.

"నీ అంచనా కరెక్టుగా వుంది!"

"మాట్లాడకు. ఆమె అలా పదిసార్లు పరుగెత్తుతుంది. మనం ఆఖరిసారి ఆమెను పట్టుకోవాలి. అప్పటికి ఆమె బాగా అలసిపోయి వుంటుంది. పెనుగులాడేందుకూ్కడా ఎక్కువ శక్తి వుండదు. నేను ఆమెను పట్టుకుంటాను. నువ్వు కుక్కను పట్టుకో!" అన్నాడు ఆనందరావు.

అలాగే నన్నట్లు తలూపాడు.

మరోసారి పరుగెత్తుకొచ్చింది సితార. గేటుదగ్గర నుంచి తిరిగి రాబోతూండగా, ఇద్దరూ పైనుంచి దిగి చెట్టు మొదట్లో నిలుచున్నారు.

చెట్టుక్రిందకు రాగానే ఆనందరావు ఆమెను వడిసి పట్టుకుని జేబురుమాలు ముక్కుదగ్గర పెట్టాడు.

జేమ్స్ కుక్కను పట్టుకుని దానికూ్కడా క్లోరోఫాం వాసన చూపించాడు. దానిగొంతు గట్టిగా పిసికి దూరంగా విసిరివేశాడు.

సితార నోటమాట రాకముందే స్పృహతప్పి పడిపోయింది.

ఇద్దరు ఆమెను నిచ్చెన పైగుండా గోడమీదకు చేర్చారు. నిచ్చెనను ఇద్దరూ పైకి లాగి, అవతలివేపు అమర్చారు. ఆమెతో సహా క్రిందకు దిగారు. చిన్నగా ఆమెను కారు వెనుకసీట్లోకి చేర్చారు.

"ఏం గోడవలేదుగా?" అడిగాడు డేవిడ్.

"లేదు!" అన్నాడు జేమ్స్.

"కుక్కపిల్లేది?" అడిగాడు ఆనందరావు.

"గొంతు నులిమి అక్కడే పారేశాను!" అన్నాడు జేమ్స్.

"చెప్పింది వేరు. చేసింది వేరు. వెళ్ళి దాన్ని తీసుకు రా?" కోపంగా అన్నాడు ఆనందరావు.

"దాంతో మనకేందుకు? మనకు కావలసింది సితార. చిక్కింది. వెళ్దాం పదండి!" అన్నాడు జేమ్స్.

"అలా కాదు! దాన్ని చూసి వాళ్ళు ఏదో ఘోరం జరిగిందని ఊహిస్తారు. దాన్ని మాయం చెయ్యకపోతే మరో గంటలోనే మనకోసం పోలీసుల వేట ప్రారంభ మవుతుంది" అన్నాడు ఆనందరావు.

"అవును. అది నిజం. జేమ్స్ నువ్వెళ్ళి ఆ కుక్కను తీసుకురా" అన్నాడు డేవిడ్.

జేమ్స్ విసుక్కుంటూ వెళ్ళి గోడ పైకెక్కాడు. మెల్లిగా లోనికి దూకాడు.

అంతకుముందు కుక్కను పారేసిన ప్రదేశంలో కెళ్ళి చూశాడు. అక్కడ కుక్కపిల్ల కనుపించలేదు. ఏమయిం దాని చూడసాగాడు. ఒకవేళ దానికి మత్తెక్కకపోవ టంతో లేచి బంగళాలోకి వెళ్ళిపోయిందేమోనను కున్నాడు. అతనికి అలా జరిగివుండే అవకాశం కనుపించ లేదు. దాని గొంతు తనే నులిమాడు గట్టిగా. ఎవ్వరైనా చూశారేమోనన్న భయం కలిగింది.

అక్కడ వుండడానికి అతనికి భయంవేసింది. ఎలా గైనా అక్కడ్నుంచి వెళ్ళి వెలుపలున్న కారు చేరుకో వడం మంచిదనిపించింది. మెల్లిగా గోడ ఎక్కాడు. అద్దే

సమయం కాంపౌండులో వున్న లైట్లన్నీ వెలిగాయి ఒక్కసారి. భయంతో పైనుంచి క్రిందికి దూకాడు.

అదే సమయంలో కారు కదిలి వెళ్ళిపోయింది వేగంగా.

జేమ్స్ దూకటంలో కాలు మడతబడి, బండరాయిపైన మోకాటి చిప్ప ఆనింది. నరాలు జివ్వుమని లాకాయి. ఎంత ప్రయత్నించినా కాలు స్వాధీనంలోకి రాలేదు.

గోడవారగా పడివుంటే, లోనున్న మనుషులెవరన్నా వచ్చి వెతికితే వాళ్ళకు తను చిక్కిపోయే ప్రమాదం వుంది. అందుకని దొర్లుకుంటూ రోడ్డు దాటి, అవతల వేపున్న తుప్పల్లోకి జారిపోయాడు.

ఒక పెద్ద రాయిని అడ్డుగా పెట్టుకుని మెల్లిగా లేచి కూర్చుని, కాలు స్వాధీనంలోకి తెచ్చుకునేందుకు ప్రయత్నం చేశాడు. కాని ఫలితం లేకపోయింది. అప్పటికప్పుడే మోకాటి చిప్ప బాగా వాచిపోయినట్లయింది. నొప్పికూడా యెక్కువైంది. అలాగే కళ్ళు మూసుకుని బండరాయినానుకుని వుండిపోయాడు జేమ్స్.

## 7

"స్పృహ పూర్తిగా తప్పిందా?" ఆక్సిలేటరుపైనున్న కాలును గట్టిగా అదిమిపెట్టి స్టీరింగ్ ముందు కూర్చున్న డేవిడ్ అడిగాడు.

"ఆఁ!" అన్నాడు ఆనందరావు.

"జేమ్స్ వాళ్ళ చేతుల్లో పడిపోయి వుంటాడా?"

"ఏమో? ఉన్నట్లుండి లైట్లన్నీ వెలిగాయి. ఆ కుక్కను అలా వదలవద్దని చెప్పాను. కానీ నా మాటను వినలేదు జేమ్స్" అన్నాడు ఆనందరావు.

కారు ముందుకు దూసుకుపోతూనే వుంది వడిసెల్లు రాయిలా.

"అతను వాళ్ళకు చిక్కితే మన పథకం వాళ్ళతో చెప్పేస్తాడేమో?" అనుమానంగా చూశాడు ఆనంద రావు.

"అలా జరగదు. అతన్ని నిలువునా చీల్చినా, చంపినా నిజం చెప్పడు!" నమ్మకం ధ్వనించింది అతని కంఠంలో.

"నీకా నమ్మకం లేకుంటే మనం ప్లాను మారుద్దాం!"

"ఎలా?"

"ముందనుకున్న చోటికి కాకుండా మరో చోటికి తీసుకెళ్దాం?"

"మరో చోటు చూడాలి గదా? అయినా మనం భయపడనవసరంలేదు. జేమ్స్ ఎలాగైనా తప్పించుకొని వచ్చేస్తాడు. నాకా నమ్మకం వుంది" అన్నాడు డేవిడ్.

ఇద్దరిమధ్యా మరే మాటలూ లేవు. వెనుకసీట్లో పడుకుని వున్న సితారకేసి చూశాడు ఆనందరావు.

ఆమె అందం అంత దగ్గర్నుంచి చూస్తుంటే అతనికి మతిపోయినట్లయింది. అందులో ఒంటిమీద పెద్దగా బట్టలు లేకపోవటంతో, ఆమెలోని వంపులు, సొంపులు వివరంగా కనుపించసాగాయి. సితారకు తెలివి వచ్చాక, ఆమెతో యేం చెప్పాలో, ఎలా చెప్పాలో, ఆమెకు ఏవిధమైన హాని జరగదని ఎలా నమ్మించాలో, నెమరువేసుకో సాగాడు.

అరగంట ప్రయాణం తర్వాత కారు అనుకున్న ప్రదేశం చేరుకుంది. ఇద్దరూ సాయంపట్టి ఆమెను బెడ్ రూంలోకి చేర్చారు. దానికి ఒకే ఒక తలుపుంది. గది లోనే బాత్ రూమ్కూడా వుంది. తలుపు బైట రెండు కుర్చీలు వేసుకుని కూర్చున్నారు ఇద్దరూ.

"ఎప్పటికి తెలివొస్తుంది?" అడిగాడు డేవిడ్.

"ఇంకో గంట పట్టవచ్చు" అన్నాడు ఆనందరావు.

"ఈలోగా జేమ్స్ రాగలిగితే బావుణ్ణు," అన్నాడు డేవిడ్.

"వస్తే మంచిదే! రాకుంటే మనం ఖచ్చితంగా ప్రమాదంలో చిక్కుకున్నట్లే. నేను ఈమెను చూస్తుంటాను. నువ్వెళ్ళి ఏం జరిగిందో చూసి రాకూడదూ?" అడిగాడు ఆనందరావు.

"అవసరంలేదు. పైగా నువ్వొక్కడివీ ఆమెను కంట్రోలు చెయ్యగలగడం అసాధ్యం! జేమ్స్ గురించి మనం మరచిపోదాం.మనపని మనం నిర్వహించుకుందాం." అన్నాడు డేవిడ్.

ఆనందరావు మాట్లాడకుండా వుండిపోయాడు.

డేవిడ్ ప్రక్క గదిలోంచి ఒక బ్రాంది సీసా, రెండు గ్లాసులూ తెచ్చి పెట్టాడు స్టూలుపైన.

"తాగుతావా?" అడిగాడు ఆనందరావును.

"వద్దు. నువ్వూ ఇప్పుడు తాగకు."

"ఆమెకు తెలివొచ్చేసరికి వొళ్ళు తేలిక చేసుకోవాలి. నాకు అడ్డు చెప్పకు."అంటూనే బాటిల్ ఓపెన్ చేశాడు.

మెల్ల మెల్లగా తాగటం మొదలెట్టాడు డేవిడ్. అర్థం వున్నవీ, లేనివీ, ఏవేనా మాటలు అతని పెదాలపైనుంచి దొర్లిపోతున్నాయి.

గదిలోంచి 'సితార' కదలిన చప్పుడవుతుందేమోనని చెవులు రిక్కించి వినసాగాడు ఆనందరావు. అతని గుండె దడదడ లాడుతుంది.

గంట గడిచింది.

లోపల మంచంపైన మనిషి కదలిన చప్పుడైంది. ప్లష్ డోర్ తొలగించి చూశాడు. సితార కదులుతూండటం

కనిపించింది. మెల్లిగా లేచి లోనికి వెళ్ళి, తలుపు మూసి గొళ్ళెం బిగించాడు.

ఆ శబ్దానికి సితార తక్కున లేచి కూర్చుంది.

"ఎవరు నువ్వు? నేనెక్కడున్నాను? నన్నెందుకు బంధించారు?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించింది.

"నా పేరు వేణు. నీ అభిమానిని. ఆరాధకుణ్ణి. నిన్ను నేనే తీసుకొచ్చాను. మనం మద్రాసు మహానగరానికి దూరంగా, ఎవ్వరూ కనిపెట్టలేని ప్రదేశంలో వున్నాం. నావల్ల నీకే విధమైన అపాయం జరగదు. అనవసరంగా భయపడవద్దు!" అంటూ కుర్చీలాక్కుని కూర్చొన్నాడు ఆనందరావు.

"నన్నెందుకు దొంగిలించుకొచ్చావ్?"

"నీ పైన నాకెంత పిచ్చి అభిమానముందో చెప్పటానికి, నువ్వంటే నాకెంత ప్రేమో చూపించటానికి. నిన్ను నిన్నుగా, పవిత్రంగా, ప్రేమించగల మనిషి ఒకడున్నాడని, చూపించటానికి తీసుకొచ్చాను."

"నాన్సెన్స్! నీలాంటి వెధవలు లోకంలో వేల మంది వున్నారు. నాకలాంటి వాళ్ళు అవసరంలేదు!" అంది సితార కోపంగా.

"అలా ఆవేశపడకు! ఈ పత్రికలో నువ్విచ్చిన ఇంటర్వ్యూ చదువు. తెలుస్తుంది." అన్నాడు ఆనందరావు ఒక పత్రిక ఆమె కందిస్తూ.

"అదంతా పబ్లిసిటీకోసం నాకు తెలీకుండా, నన్నడగకుండా ఎవరో రాసింది. దాన్ని వదిలి వెయ్యి. లేకుంటే నువ్వు ఆజన్మఖైదు అనుభవిస్తావ్?" అంది సితార.

"లాభంలేదు. నీకై నువ్వు పరిస్థితులు అర్థంచేసుకొని మాతో సహకరిస్తే, నీకే విధమైన అపకారం జరగకుండా

చూసి, ఆ తర్వాత నిన్ను నీ యింటికి చేరుస్తాను. లేదంటే..."

"అంటే నీతోపాటు ఇంకా వున్నారా వేరే మనుషులు?"

"ఉన్నారు మరో ఇద్దరున్నారు. నీ పొందుకోసం పరితపిస్తున్నారు."

"బలవంతంగా నన్ను రేప్ చేస్తారా?"

"ఆ అవసరం రాకుండా చూసే బాధ్యతనీది. నీ ప్రవర్తనను బట్టి వుంటుంది." అన్నాడు ఆనందరావు.

"నా మనుషులు నా కోసం ఈపాటికి కంగారు పడుతుంటారు. దేశంలోవున్న ప్రతి పోలీసు మీకోసం వెతుకుతూ వుంటాడు. వాళ్ళ చేతుల్లోంచి తప్పించుకుని తిరగడం మీకు వీలుకాదు!" అంది సితార బెదిరిస్తూ.

"నీ మీద కోపంలేదు! ప్రేమవుంది. అది అర్థం చేసుకో చాలు."

వెలుపలనుండి తలుపులు తట్టిన చప్పుడైంది. ఆనందరావు లేచి వెళ్ళాడు. తలుపు తియ్యగానే డేవిడ్ లోనికి వచ్చాడు.

దుప్పటి కప్పుకుని కూర్చున్న సితారను చూసి "ఏమంటుంది రామ చిలుక." అడిగాడు డేవిడ్.

"ఆమెకు పరిస్థితి అర్థమయ్యేలా చెపుతున్నాను," అన్నాడు వేణు.

"అతను నీ తోటి మనిషా?" అడిగింది సితార.

"అవును. పేరు యూసఫ్!" అన్నాడు ఆనందరావు.

"సితారగారూ! నాకు నీ పైన ప్రేమలేదు. కానీ నీ డబ్బు పైన ప్రేమవుంది. ఈ కాగితం తీసుకొని పెన్నుతో నే చెప్పిన విధంగా రాయి. అది చేరాక నాకు

డబ్బు అందుతుంది. ఆ తర్వాత నిన్ను వదలి పెడతాను, ఆలోగా నీకు యిష్టముంటే అతనికి ఆనందం అందించు. అయిష్టంగా వుంటే అదీవద్దు!'' అన్నాడు యూసఫ్.

"యూసఫ్! మన ఒప్పందం మరచి పోయావా?''

"అప్పటి సంగతి అది. ఇప్పటి విషయం ఇది. నీదారికి నేను అడ్డు రావటంలేదు. నా దారికి నువ్వు అడ్డు రావద్దు అనవసరంగా బాధపడతావ్?'' అన్నాడు డేవిడ్.

"నువ్వడిగినట్లు రాసిస్తాను. కానీ నాకో ప్రమాణం చెయ్యాలి!'' అంది సితార.

"ఏమిటది?''

"ఆ డబ్బు అందే దాకా నా శరీరం పైన ఎవ్వరూ ఏ అత్యాచారం జరగకుండా చూచే పూచీ నీదిగా వుండాలి. నాకు ఎవ్వరిపైన ప్రేమలేదు. నేను అందరిలో అందంగా వుండాలన్నా, గ్లామరస్‌గా కనుపించాలన్నా ఇది అవసరం. ఏమంటావ్?'' అడిగింది సితార ఉత్సాహంగా.

"ఓ. కే. అలాగే!'' అన్నాడు యూసఫ్.

"ముందతన్ని బైటకి వెళ్ళమను.''

"మిస్టర్ వేణూ! ప్లీజ్ గెటవుట్!'' అన్నాడు డేవిడ్.

"నోర్ముయ్!'' అన్నాడు ఆనందరావు.

జేబులోంచి పొడవుపాటి కత్తితీశాడు డేవిడ్. దాన్ని అతని ఛాతీకేసి గురిచూపిస్తూ "నడువు వెలుపలకు!'' అని గద్దించాడు.

"మనుషులు కాదు మీరు రాక్షసులు! మీలాంటి వాళ్ళతో జట్టు కట్టటం నాదే తప్పు!'' అంటూ వెలుపలకు వెళ్లాడు ఆనందరావు.

సితార డేవిడ్ చెప్పినట్లుగా రాసి, కాగితం అందించింది.

"నువ్వు మంచివాడివిలా వున్నావ్. డబ్బెంతపోయినా నాకు బాధలేదు. తిరిగి సులభంగా సంపాదించుకోగలను. కానీ నా అందం మాత్రం చెడకూడదు. అందుకే నువ్వు పదిలక్షలని రాయమంటే నేను పదిహేను లక్షలని రాశాను. ఇది నా సెక్రెటరీ కృష్ణమూర్తిగారికి చేర్చాలి. అంత మొత్తం డ్రా చెయ్యగల స్తోమత అతనికే వుంది. అతను వెళ్లి అడిగితే ఏ బాంకూ అనుమానించకుండా ఇస్తుంది. ఇంట్లో అంత క్యాష్ వుండదుగా," అంది సితార.

"అలాగే!" అన్నాడు డేవిడ్.

"నువ్వు వెళ్లాక అతను నాపైన అత్యాచారం చేస్తే ఎలా? నాకు రక్షణ కావాలి!" అంది సితార.

"అయితే ఈ కత్తి నీ దగ్గరుంచుకో." అన్నాడు డేవిడ్.

అలాగే అని కత్తి అందుకుంది సితార.

డేవిడ్‌ను పోనిచ్చి తలుపు మూసుకుంది.

ఒకడు వెళ్లిపోయాడు మరొకడున్నాడు. వాడ్ని బోల్తా కొట్టించడం పెద్ద కష్టం కాదనుకుంది. కాగితం రాయించుకెళ్లిన మనిషి అడిగి వచ్చేలోగా తను ఇక్కడి మనిషి భరతంపట్టి తప్పించుకోవాలనుకుంది.

అరగంట అలాగే మంచం పైన పడుకుంది.

"సితారా? సితారా?" ఆమె ప్రేమికుడు బైటనుంచి పిలిచాడు.

"ఎవరు?" అంది సితార.

"నేను, వేణును."

"ఏం కావాలి?"

"సీతతో మాట్లాడాలి. తలుపుతియ్యి."

"తియ్యను. తీస్తే నువ్వు నన్ను బలవంతంచేసి కోరిక తీర్చుకుంటావని భయంగా వుంది" అంది సితార.

"అలా జరగదు. ఇందాకూరికే భయపెట్టాను. నావల్ల నీకే అపకారం జరగదు. తలుపుతియ్యి" అన్నాడు.

సితార కత్తి జాగ్రత్తగా పట్టుకుని తలుపు తెరచింది. ఆనందరావు లోపలికి రాగానే, ఒక్క దెబ్బన వీపు పైన గ్రుచ్చింది. అలాటి సీనుల్లో చాలాసార్లు నటించి వుండటంతో ఆమె కదేమంత పెద్ద కష్టంగాలేదు.

కత్తి గుచ్చుకోగానే క్రింద కూలిపోయాడు ఆనంద రావు. అదే అదనుగా దుప్పటి కప్పుకునే పరుగెత్తింది. అలా అరగంట పరుగెత్తాక మెయిన్ రోడ్ వచ్చింది.

ఆ తర్వాత గంటకల్లా ఒక టాక్సీలో బంగళా చేరు కుంది.

అప్పటికే జేమ్స్‌ను పోలీసులు అరెస్టుచేశారు. కృష్ణ మూర్తికోసం వెతుక్కుంటూ వెళ్ళిన డేవిడ్‌ను కూడా పట్టుకున్నారు. మూడో మనిషి ఎక్కడున్నదీ చెప్పింది పోలీసులకు సితార.

—: ఐపోయింది :—

సీరియల్

# అంగారక

శ్యాంబాబు



(మూడవ భాగము)

ఓడ చుక్కాని దిశవైపున మోటర్ ఆపరేటెడ్ వించ్ వుంది. వించ్ డ్రమ్‌చుట్టూ బలమై హైపర్ టెన్షన్ వైర్లు చివరన ఇనుప కొక్కాలు బిగించబడి వున్నాయి. ఓడ మధ్యలో నిర్మింపబడిన సెలూన్ కప్పు తొలగించడానికి వీలుగా నిర్మించబడింది. కప్పుమీద అమర్చిన రెండు రింగులకూ వించ్ గొలును చివరి కొక్కాలు తగిలించి వించ్ ఆపరేట్ చేస్తే ఈజీగా కప్పు తొలగించవచ్చు. గది బయట ఓడ అంతా చుట్టూతా గట్టి అల్యూమినియమ్ ట్యూబులతో రెయిలింగ్ వేసివుంది.

"పోర్టు కెనాల్ లోకి వదలిపెట్టండి. ట్రయల్ రన్‌కు

తీసుకెళతాను'' అన్నాడు లుముంబా ఓడవైపు తృప్తిగా చూస్తూ.

''మరి నా డబ్బు?''

''ఆఫీసుకు పద... అన్నట్లు నాకోసం పెద్ద అట్ట పెట్టెలు ఆయిదు వచ్చివుండాలి. వాటిని ఓడలో పెట్టించు'' అన్నాడు లుముంబా.

లిసీవాన్ చకచక తన అనుయాయులకు ఆర్డర్లు జారీ చేశాడు.

లుముంబా వెంటే ఆఫీసులోకి దారి తీశాడు.

లుముంబా సూట్ కేసు తెరచి వందడాలర్ల నోట్ల కట్టలు నాలుగు టేబిల్ మీద పెట్టాడు.

* * *

తెల్లవారేటప్పటికి హాంకాంగ్ నుండి బయటపడి దాదాపు మూడువందల యాభైమైళ్ళ పైచిలుకు ప్రయాణం చేశాడు లుముంబా...

సాయంత్రం ఆరుగంటల సమయంలో ట్రయల్ రన్ కోసం పోర్ట్ ట్రాఫిక్ కంట్రోలర్ పర్మిషన్ అడిగి సముద్ర జలాల్లో ప్రవేశించాడు. ఏడుగంటల వరకూ పోర్టుకు నాలుగుమైళ్ళ లోపునే తీరం వెంట 'షాడో'ను నడుపుతూ కంట్రోల్స్ అన్నీ చెక్ చేసుకొన్నాడు.

క్రొత్త ఇంజన్లు కావడంవల్ల నౌక అద్భుతంగా పని చేస్తోంది. దానికి తోడు నౌక సైజు, బరువుకు, ఇంజన్ శక్తికి సరైన సమన్వయం వుండడంవలన నౌకలోని ప్రతి భాగం కంట్రోల్స్‌కు చక్కని రెస్పాన్స్ యిస్తోంది.

చీకటిపడే కొలదీ నౌక మెల్లిమెల్లిగా తీరంనుండి దూరంగా తీసుకుపోసాగాడు... పదెనిమిది నాట్స్ పవర్ వున్న ఇంజన్ అది. అతివేగంగా పోయే మోటారుబోటు

కన్నా శక్తివంతమైన ఇంజన్లు రోడాల్ఫ్ టర్బయిన్ ఇంజన్లు కావడంవలన ట్రబుల్ ఫ్రీ పెర్ ఫార్మెన్స్ యిస్తాయి.

రాత్రి తొమ్మిదిగంటలకల్లా తీరం నుండి పన్నెండు మైళ్ళ బయటికి వచ్చేశాడు. రేడియోలో పోర్ట్ కంట్రోలర్ గీపెడుతున్నాడు.

"పాడో ఆఫ్ లుముంబా! యు ఆర్ టూ ఫార్ అవుట్ ఆన్ ది కోస్ట్...కమ్ బాక్" బహుశా కంట్రోలర్ రాడార్ స్క్రీన్ మీద తన నౌక చిన్న చుక్కలా కనిపిస్తూ వుండాలి...

జవాబివ్వలేదు లుముంబా.

థ్రోటిల్స్ ముందుకు త్రోసి నౌక వేగం పన్నెండు నాట్స్ కు పెంచాడు. సముద్రజలాల్ని కోసుకుంటూ రాకెట్ లా దూసుకుపోతోంది 'పాడో'.

దూరంగా ఏవో సైరన్లు వినిపించాయి. తల త్రిప్పి చూశాడు లుముంబా.

హాంకాంగ్ పెట్రోలు బోట్లు పాడోవైపే దూసుకొస్తున్నాయి. మనసులోనే నవ్వుకొని నౌక లైట్లన్నీ ఆర్పేసి నలభై అయిదు డిగ్రీల కోణంలో నౌక దిశ మార్చాడు. నౌక కాస్త ప్రక్కకు తిరగడం వలన పెట్రోలుబోట్లు దగ్గరయినట్లనిపించాయి.

నిజానికి పాడో వేగాన్ని అందుకోగల వేగం లేదా పెట్రోలుబోట్సుకు. మాక్సిమమ్ పదిహేను నాట్స్ వేగం పోతాయి అవి. క్రమక్రమంగా ఇంజన్ స్పీడు పెంచసాగాడు. అరగంటలో పెట్రోలుబోట్సు కనుచూపుమేర దూరంలో లేకుండాపోయాయి.

గంటవరకూ అదే వేగంతో ప్రయాణం చేశాడు

లుముంబా. తరువాత మలక్కా జలసంధివైపు కోర్స్ సెట్ చేసుకొని పన్నెండు నాట్స్ వేగంతో స్టడీగా పోనివ్వసాగాడు.

తెల్లవారేప్పటికల్లా మలక్కా స్ట్రియిట్స్ దాటి బంగాళాఖాతంలోకి ప్రవేశించింది నౌక. రాత్రంతా నిద్రలేదు. మలక్కా స్ట్రియిట్స్ హెవీ ట్రాఫిక్ వుండే సముద్రమార్గం...వివిధ దేశాలకు చెందిన రకరకాల నౌకలు ఆ మార్గాన ఇరవైనాలుగ్గంటలూ ప్రయాణం చేస్తూ వుంటాయి. పైగా ఈ ప్రాంతంలో సముద్రయానానికి అనువైన మార్గం కేవలం మైలు నుండి మైలున్నర మాత్రమే వుంటుంది. అంచేత రాత్రంతా మేలుకొని చాలా దీక్షగా ఓడ నడపాల్సి వచ్చింది.

తూర్పున వుదయరేఖలు కనబడగానే నౌకను ఆటో పైలట్ లోకి పెట్టి, డెక్ మీద మూడు డెక్ చెయిర్లు వేశాడు. తను కొన్న బట్టతలవాడి బొమ్మను, పొడుగాటి ఆడదాని బొమ్మనూ, సన్నటివాడి బొమ్మను మూడు కుర్చీలలో కూర్చోబెట్టాడు.

తర్వాత పొట్టి బాబ్డ్ హెయిర్ అమ్మాయి బొమ్మను డెక్ కు ఓ మూల టవల్ పరచి దానిమీద బోర్లా పడుకోబెట్టాడు. మరో లావుపాటి వ్యక్తిబొమ్మను డెక్ మీద వెల్లకిలా పడుకోబెట్టాడు.

దూరంనుండి నౌక వేపు ఎవరయినా చూస్తే, నౌకలోని ప్యాసింజర్లందరూ డెక్ మీద సన్ బాతింగ్ చేస్తున్నట్లుగా కనిపిస్తుంది.

తర్వాత క్యాబిన్ రూమ్ లో నౌకను ఆటోపైలట్ లోనే వుంచి, సాండ్ విచెస్ తిని, ఆపిల్ జ్యూస్ త్రాగి పన్నెండున్నరకు అలారం పెట్టి, బంక్ లో నిద్రకుపక్రమించాడు.

పన్నెండున్నర వరకూ ఒళ్ళు తెలియకుండా నిద్ర పోయాడు లుముంబా. పన్నెండున్నరకు అలారం మ్రోగగానే మెలకువ వచ్చింది. ఆకాశం మేఘావృతమై వుంది.

సాయంత్రం నాలుగుంబావుకు 'షాడో' పాసేజ్ ఐలెండ్ ప్రాంతానికి చేరింది.

పాసేజ్ అయిలాండ్ నికోబార్ దీవుల్లోని వందలాది మనుష్య నివాసంలేని దీవుల్లో ఒకటి. చాలా చిన్న దీవి. చిన్న చిన్న రాళ్ళగుట్టలతోనూ వెదురు చెట్లతోనూ నిండి వుంటుంది. దీవిచుట్టూ మోకాలిలోతు నీళ్ళతో దాదాపు అరమైలు బీచ్ వుంటుంది. నౌక చేర్చడానికి లుముంబా ఈ దీవిని ఎన్నుకోవడానికి కారణం అదే.

నాలుగున్నరయ్యేప్పటికి సముద్రంలో ఎక్కడలేని ప్రశాంతత ఏర్పడింది. సముద్రపు ఆటుపోటులు పూర్తిగా తగ్గిపోయాయి. నౌక జెండా కదిలే మాత్రం గాలి కూడా వీచడంలేదు.

త్వరలో తుఫాను ప్రారంభమవుతుంది అనుకొన్నాడు లుముంబా మనసులో.

'షాడో'ను దీవికి ఎదురుగా తిప్పాడు. దూరంగా గుంపుగా తాడిచెట్లు, దట్టంగా వెదురుదుబ్బులు, రాళ్ళ గుట్టలు కనిపిస్తున్నాయి.

మెల్లిగా నౌకను లోతులోని నీళ్ళల్లోకి నడిపించాడు. బీచ్ లాండింగ్ వైపు నౌకల్లో వున్న ఎడ్వాంటేజి అదే. నౌక అడుగుభాగం మామూలు నౌకలవమల్లే కాకుండా సమతలంగా వుండడంవలన అతి తక్కువ లోతున్న ప్రదేశంలోకూడా నౌక సులువుగా కదుల్తుంది. రెండవ ప్రపంచయుద్ధంలో నార్మండీదగ్గర బీచ్‌లలో

సైన్యాల్ని దింపడానికి అమెరికన్ సైన్యం యిలాంటి నాకలనే వాడింది.

నీరు అడుగు లోతుకన్నా యెక్కువ వుండదనుకో గానే 'షాడో' స్పీడు పెంచాడు. ఆ వేగానికి బీచ్ మీద ఇసుకనుకూడా తోసుకుంటూ ఒడ్డెక్కేసింది నాక. నాక తీరాన్ని తాకినప్పుడు ఆ తాకిడికి నాక ముందుభాగం విరిగిపోతుందేమో నన్నంతగా కదిలిపోయింది.

నాక రాళ్ళగుట్టలదగ్గరకు చేరేవరకూ ఇంజన్ ఆఫ్ చెయ్యలేదు.

ఇంజన్ ఆఫ్ చేసి వెంటనే నాక నాలుగు మూలలా బలమైన ఇనుపగొలుసులకు అతికించబడిన లంగర్లను బీచ్ మీద వున్న రాళ్ళగుట్టలో దిగ్గొట్టాడు. ఒకవేళ తుఫాను వచ్చి సముద్రం పొంగితే ఆ వరదకు నాక ఎటూ కొట్టుకు పోకుండా ఈ లంగర్లు పట్టి వుంచుతాయి. ఒక్కో గొలుసు దాదాపు వంద అడుగుల పొడవు వుండడంవలన నీటిమట్టం వంద అడుగుల ఎత్తుకు లేచినా నాక నీటిమీద తేలుతూనే వుంటుంది.

లుముంబా నాకలోని రబ్బరుబొమ్మల్ని కత్తితో చిన్న చిన్న ముక్కలుగా కోసి ఒక్కొక్క ముక్కే నీటిలో పడేశాడు.

తర్వాత కాబిన్ రాక్‌లోంచి చిన్న ఇన్‌ఫ్లేటబుల్ రబ్బరు డింగీ, వన్ అండ్ హాఫ్ హార్స్‌పవర్ డీసిలు ఇంజను, $CO_2$ కార్ట్రిట్జ్ ఒకటి, పెద్ద చేపలుపట్టే వల బయటకు తీశాడు లుముంబా.

వలను నాకంతా కప్పి, వల త్రాళ్ళను నేలలో దించిన చిన్నచిన్న మేకులకు కట్టేశాడు. తర్వాత చుట్టుపక్కల వున్న చిన్నచిన్న పొదలు, వెదురుదుబ్బులు నరికి వల

నిండా గ్రుచ్చాడు. ఇప్పుడు ఆకాశంలోనుండి గాని, దూరంనుండిగాని చూస్తే మోటారుబోటు కనిపించదు. కేవలం యెత్తుగా పెరిగిన గుబ్బులు మాత్రం కనిపిస్తాయి...

తర్వాత $CO_2$ కార్ట్రిడ్జ్ పేల్చి ఆ గ్యాస్‌ను ఇన్‌ప్లేటబులు రబ్బర్ డింగీకి ఎక్కించాడు. తలగడా సైజులో వున్న రబ్బరు డింగీ పొంగి చిన్న సైజు నావలా తయారైంది. దానికో మూల డీసిలు ఇంజను బిగించాడు.

బీచంతా కలయజూసి, ఏమీ బయట వదలి పెట్టనట్లు నిర్ధారించుకొని డింగీని నీళ్లలోకి యీడ్చుకొంటూ పోయాడు.

మొదటి వందగజాలు అలలపైనుండి నెట్టుకొంటూ, ఈదుకొంటూ రబ్బరుడింగీని సముద్రంలోకంటా తోసుకెళ్ళాడు. కాస్త కెరటాల ఒరవడి తగ్గిన తరువాత ఎగిరి డింగీమీద కూర్చొని ఇంజన్ స్టార్ట్ చేశాడు.

సన్నని శబ్దంతో ఇంజన్ స్టార్టయింది. డింగీకి ఓవైపు చిన్న చెక్కముక్కను చుక్కానిలా ఉపయోగిస్తూ పాసేజ్ ఐలండ్‌కు వంద కిలోమీటర్ల దూరంలోవున్న ట్రాలెర్స్ ఐలెండ్ వైపు బయలుదేరాడు లుముంబా.

ట్రాలెర్స్ ఐలెండ్ స్మగ్లింగ్‌కు ప్రసిద్ధి. అక్కడినుండి ఏదో రకంగా మద్రాసు చేరడం అంత కష్టమైన పనేమీ కాదు.

రబ్బరు మోటారుబోటు మెల్లిగా ట్రాలెర్స్ ఐలండ్ వైపు కదలసాగింది.

* * *

ఉదయం పదకొండు గంటలయింది...

సెషన్స్ జడ్జి కోర్టులో జయపాండ్యన్ హత్యా

నేరంపై వాదప్రతివాదనలు అంతకు ముందురోజే ముగిశాయి.

జడ్జి తీర్పుకోసం అందరూ వేచివున్నారు.

భార్యను, పోలీసు ఇన్‌స్పెక్టర్ని హత్యచేసిన నేరానికి జయపాండ్యన్ శిక్ష అనుభవించడానికి సిద్ధంగా వున్నాడు.

ఇన్‌స్పెక్టర్‌ని చంపడంలో ముత్తు ప్రమేయం లేదనీ, అతను గుడిశెలో లేనప్పుడే ఇన్‌స్పెక్టర్ని చంపి తనే స్వయంగా తోటలో పాతిపెట్టాననీ, ఈ విషయం ముత్తుకు ఏమాత్రం తెలియదనీ జయపాండ్యన్ తన వాఙ్మూలంలో చెప్పాడు.

ఆక్సిడెంట్‌లో బలమైన గాయాలు తగిలి మరణావస్థలో వున్న జయపాండ్యన్‌ను ఆస్పత్రిలో చేర్చారు పోలీసులు.

ఆక్సిడెంట్ సమయంలో జయపాండ్యన్ వుపయోగిస్తున్న పోలీసు గుర్తులున్న మోటారుసైకిలు, కోర్టై పోలీసులు అందజేసిన సమాచారం, మోటార్ సైకిల్ తాలూకు ఇన్‌స్పెక్టర్ కనిపించకపోవడం,జయపాండ్యన్ జేబులో దొరికిన పోలీస్ స్పెషలు పిస్తోలు—ఇవన్నీ పోలీసుల దర్యాప్తుకు చాలా తోడ్పడ్డాయి.

జయపాండ్యన్ ప్రమాదస్థితినుండి బయటపడేప్పటికి జయపాండ్యన్ మీద బలమైన కేసు ఎస్టాబ్లిష్ చేసి,హత్యానేరానికి సెషన్స్‌లో కేసు పెట్టారు పోలీసులు. తన నేరాలన్నిటినీ యధాతధంగా ఒప్పుకొని వాఙ్మూలం వ్రాసిచ్చాడు జయపాండ్యన్.

కోర్టు గడియారం పదకొండున్నర కొట్టింది.

ఇరవై ఎనిమిది పేజీల జడ్జిమెంట్ చదవడం మొదలు పెట్టాడు సెషన్స్ జడ్జి.

జయపాండ్యన్ నిర్వికారంగా వింటున్నాడు. చివరి పేజీలో జయపాండ్యన్ లాంటి చదువుకొన్న వ్యక్తులు, బాధ్యతాయుతమైన అధికారిగా పనిచేసినవాళ్ళు నేరస్తులుగా పారిపోవడంపట్ల తన విచారాన్ని వ్యక్తం చేశాడు జడ్జి.

జయపాండ్యన్ కు ఉరిశిక్ష పడింది.

మార్చి పధ్నాలుగో తారీఖు వుదయం ఉరి అమలు చేస్తారని తెలిసింది.

జయపాండ్యన్ లో ఏ విధమైన రియాక్షన్ కనిపించలేదు.

*   *   *

కెప్టెన్ విన్నర్ ప్రొఫెసర్ రామన్న, ఎయిర్ వైస్ మార్షల్ గోవింద్ నాయర్ మరో టెస్ట్ పైలట్, ప్రేమ్ సింగ్, నేషనల్ ఎయిరోనాటిక్ అండ్ స్పేస్ రిసెర్చి సెంటర్ హాంగర్స్ లో నిలబడివున్నారు.

ఎదురుగా సూపర్ సీక్రెట్ 'అంగారక' కు లాస్ట్ మినిట్ ఫ్లైట్ చెకింగ్ చేస్తున్నారు మెకానిక్ లు.

యన్. ఎ. యస్. ఆర్. సి., ప్రవేశార్హత వున్న వ్యక్తులుకూడా ఈ హాంగర్ లోకి రావడానికి వీలులేదు. ప్రత్యేకమైన అనుమతిపొందిన ఓ డజను మంది వ్యక్తులు మాత్రమే ఈ హాంగర్ లోకి రాగలరు.

ప్రొఫెసర్ రామన్న ముఖంలో విజయగర్వం తొంగి చూస్తోంది.

ఇంతవరకూ మున్పైరెండుసార్లు 'అంగారక'ను ఆకాశంలోకి తీసుకెళ్ళి టెస్టుజేశారు పైలట్లు. ఈ క్రొత్త విమానంలోని వివిధ పరికరాలు, అవి పనిచేసే తీరు తెన్నులు పరీక్షించడానికి వుద్దేశింపబడినవి ఈ టెస్ట్ ఫ్లైయిట్ లు.

సాధారణంగా క్రొత్తగా తయారుచేయబడే ప్రతీ జెట్ విమానాన్ని కొన్ని వందలసార్లయినా పరీక్షించందే మామూలు వుపయోగానికి అనుమతించరు. భారీ ఎత్తున వుత్పత్తి మొదలుపెట్టారు.

ఈ క్రొత్త సూపర్ జెట్ 'అంగారక'లో అనేక రకాల క్రొత్త పరికరాలు, ఆయుధాలు అమర్చడం జరిగింది. దానికితోడు 'వర్టికల్ టేకాఫ్' సిస్టమ్‌తో పనిచేసే యుద్ధవిమానాల్లో ఇది మొదటిది.

అంతేకాక దీనిలో అమర్చిన జెట్ ఇంజన్లు దాదాపు పన్నెండుగంటలు నిర్విరామంగా పని చేయగలవని ప్రొఫెసర్ రామన్న అంచనా...అంటే ఈ జెట్ విమానం దాదాపు పదిగంటలకు పైబడి ఆకాశంలో ఎగురుతూ వుండగలదని అర్థం. ఇంతవరకూ ప్రపంచానికి తెలిసిన యుద్ధ విమానాల్లో ఏదీ ఆయిదారు గంటలకు మించి ఆకాశంలో ఎగురగలది లేదు.

దీనికి కారణం యుద్ధవిమానాల సైజు. తేలికగా గాలిలో పల్టీలు కొట్టడానికి వీలుగా దాదాపు అన్ని యుద్ధ విమానాలు చిన్నసైజులోనే తయారు చేస్తారు. అందువలన వాటిబరువు తక్కువగా వుండి, ఆకాశంలో ఆక్రోబాటిక్స్ చేసే అవకాశం వుంటుంది.

ఆకాశంలో విమానం ఎక్కువసేపు వుండాలి అంటే, విమానంసైజు పెద్దదిగా వుండాలి, ఎక్కువ పెట్రోలు తీసుకెళ్ళగలిగి వుండాలి. పాసింజర్ సర్వీసులకు వుపయోగించే జంబోజెట్స్, ఎయిర్‌బస్ మొదలయిన విమానాలు జట్ విమానాలకన్న దాదాపు ఆరేడు రెట్లు సైజులో పెద్దదిగా వుంటాయి. కనుకే అవి దాదాపు పదిహేను గంటలవరకు ఎగురుతూ వుండగలవు.

ఇంతవరకూ జరిగిన ఫ్లయిట్ టెస్ట్‌లలో 'అంగారక'ను ఎప్పుడూ నాలుగైదు గంటలకన్నా ఎక్కువకాలం ఆకాశంలో వుంచలేదు. ఈ కాలంలో 'అంగారక'లోని వివిధ పరికరాలను, అవి పనిచేసే తీరుతెన్నులు క్షుణ్ణంగా పరీక్షించటం జరిగింది.

ఈరోజు ఫుల్‌లోడ్‌తో, అంటే అంగారక మొయ్య గలిగినంత బరువుతో ఆకాశంలో ఎంతసేపు వుండగలదో నిర్ణయించడానికి 'ఎండ్యూరెన్స్' టెస్ట్‌లు మొదలు పెడుతున్నారు.

విమానంలో పరికరాలన్నీ పూర్తిగా అమర్చి పెట్రోలు టాంకులు నిండా ఇంధనం నింపి టెస్ట్‌పైలట్ జెట్‌ను ఆకాశంలోకి తీసుకెళతాడు. విమానంలో ఇంధనం పూర్తిగా అయిపోయేవరకూ వివిధ స్పీడ్స్‌లో విమానం ఎండ్యూరెన్స్ ఎంతవుంటుందో పరీక్షించడం జరుగుతుంది.

చాలా ప్రమాదంతో కూడుకున్న పని అది.

'అంగారక' జెట్ విమానంలో కూర్చొని కంట్రోల్ పానల్‌లోని వివిధ పరికరాల్ని చెక్ చేసుకొన్నాడు కెప్టెన్ విన్నర్.

కమ్యూనికేషన్ సెట్ తలుపు తగిలించుకొని టైమ్ చూశాడు విన్నర్. పన్నెండుంబావయింది.

జెట్‌ఫైటర్ తోకమీద, రెక్కలమీద వైట్ పెయింట్‌తో ఇండియన్ ఎయిర్‌ఫోర్స్ మార్కింగ్స్ వేసివున్నాయి. మిట్టమధ్యాహ్నం ఎండలో అద్దంలా అల్యూమినియం పెయింట్‌తో పాలిష్ చేయబడిన విమానం ధగధగ మెరిసిపోతోంది. విమానాన్ని అలా విపరీతంగా సూర్యకిరణాలు రిఫ్లెక్ట్ అయ్యేలా పాలిష్

చెయ్యడంలో ఒక ప్రత్యేకమైన ఉద్దేశ్యం వుంది. విమానం ఆకాశంలోకి లేస్తున్నప్పుడు ఎవరయినా ఫోటోగ్రాఫ్ చెయ్యాలని ప్రయత్నించినా స్పష్టమైన ఛాయా చిత్రం రాదు.

విన్నర్ మైక్ ఆన్ చేశాడు.

"టెస్ట్ ఫ్లయిట్ జీరో త్రీత్రీ...రడీ టు టేకాఫ్... పర్మిషన్ రిక్వెస్టెడ్ ...విన్నర్!"

రిసెర్చి సెంటర్ ఎయిర్‌కంట్రోలు టవర్ నుండి కంట్రోలర్ స్వరం స్పష్టంగా వినిపించింది.

"పర్మిషన్ గ్రాంటెడ్ ఫర్ ఇమిడియట్ టేకాఫ్ యువర్ ఆల్‌టిట్యూడ్ థర్టీథవుజండ్ ఫీట్. ప్రొసీడ్ అండ్ కీప్ సర్క్యులింగ్ ఎట్ టు జీరో టు-లోజర్——"

కెప్టెన్ విన్నర్ ఇంజన్ రైజ్ చేసి త్రోటల్స్ ముందుకు త్రోసి కంట్రోలు పెడలుమీద కాలు తప్పించాడు.

'అంగారక' టర్‌మాక్ మీదనుండి పెద్ద శబ్దంతో హెలికాప్టర్‌లా గాలిలోకి లేచింది.

అంగారక రాకెట్లా నిముషానికి ముప్పైవేల అడుగుల చొప్పున ఆకాశంలోకి దూసుకుపోయింది.

"జీరో త్రీత్రీ లెవల్ ఆఫ్ ఎట్ థర్టీ తౌజండ్" కంట్రోలర్ స్వరం వినిపిస్తోంది.

నిముషంలో ముప్పైవేల అడుగుల ఎత్తుకు చేరుకొంది అంగారక.

"థర్టీ తౌజండ్ అండ్ లెవలింగ్ ఆఫ్... విన్నర్——"

"వెరీగుడ్! కీప్ సర్క్యులింగ్ ఎట్ త్రీ ఎయిటీ డిగ్రీస్...కాల్క్యులేట్ విండ్ డ్రిఫ్టు" కంట్రోలర్ స్వరం.

అలా మొదలయింది అంగారక ఎండ్యూరెన్స్ టెస్ట్...

సాయంత్రం ఏడున్నరయింది. అప్పటికి అంగారక పై కెగిరి సరిగ్గా ఏడుగంటలయింది.

"జీరో త్రీత్రీ కాలింగ్ ... దేరీజ్ సమ్‌థింగ్ రాంగ్ విత్ ది పోర్ట్ సైడ్ ఇంజన్" అన్నాడు విన్నర్ రేడియో రిసీవింగ్ సెట్ ఆన్ చేస్తూ.

"డిసీజ్ కంట్రోల్! వాట్ హాపెన్డ్ డిసెండ్ ఇమ్మిడియట్లీ టు ట్వెంటీ తౌజండ్ ఫీట్."

"కంట్రోల్ ... ఐ కాంట్ సీ ఎనీథింగ్ ... పవర్ సప్లయ్ ఫెయిలు అయింది."

అపుడే విమానం టెస్టు కేంద్రంనుండి దాదాపు నాలుగువందల మైళ్ళదూరం వుంది.

ఇంకొక్క యాభైమైళ్ళు వెళ్ళగలిగితే బంగాళాఖాతం వస్తుంది అనుకొన్నాడు విన్నర్ విమానాన్ని క్రిందకు దించుతూ.

ఇప్పుడు విమానం ఫుల్ స్పీడ్‌లో ట్రీటాప్ లెవలులో అంటే భూమికి ఇరవై అడుగుల ఎత్తున దూసుకుపోతోంది.

"జీరో త్రీత్రీ! కుడ్ యు హియర్ మి...గివ్ మి స్టేటస్ రిపోర్ట్" కంట్రోలర్ కంఠంలో ఆందోళన కనిపిస్తోంది.

"మైగాడ్! డిసీజ్ హెల్...ఐవిల్ బెయిలవుట్" అంటున్నాడు విన్నర్.

భూమికి ఇరవై అడుగుల ఎత్తున విమానం వెళుతోంటే తను ఎటువైపు వున్నదీ రాడార్లో కంట్రోలర్ చూడలేడని తెలుసు విన్నర్‌కి. కాని తను రేడియోలో

మాట్లాడినంత సేపూ తను ఎక్కడ వుంది వి. ఓ. హెచ్. సహాయంతో తేలిగ్గా కనుక్కోవచ్చు.

విమానం అతి తక్కువ ఎత్తులో సముద్రపుఒడ్డు సమీపిస్తోంది. అంత తక్కువ ఎత్తులో సముద్రపుఒడ్డున బెస్తవాళ్ళు చేతులు వూపడం కనిపించింది. చటుక్కున విమానాన్ని పైకి లేపి రాకెట్ రిలీజ్ బటన్ నొక్కాడు.

ఎయిరేటు సర్ఫేస్ మిస్సెయిల్ 26 డి ఎర్రని మంటలు వెదజల్లుతూ సముద్రంలో పడి పేలింది. రేపు జరగబోయే ఎంక్వయిరీలో ఎర్రగా కాలుతున్నదేదో విమానంలోనుండి సముద్రంలో పడినట్లు ఈ బెస్తవాళ్ళు చెపుతారు. అదే కావాలి విన్నర్కు.

"హలో...జీరో త్రీత్రీ...కడ్ యు హియర్ మి... ఆన్సర్...ఆన్సర్ మి...హలో విన్నర్...కడ్ యు రీడ్ మి...హలో ..జీరో త్రీత్రీ...జీరో త్రీత్రీ" రేడియోలో కంట్రోలర్ మొత్తుకుంటున్నాడు.

మనసులోనే నవ్వుకొన్నాడు విన్నర్. సముద్రపు నీటి మీద ఇరవైఅడుగుల ఎత్తున పోనిస్తున్నాడు అంగారకను. కంట్రోల్ టవర్లో రాడార్ తమ వునికిని పసికట్టడం అసంభవం. అందులోనూ రేడియోలో తను మాట్లాడనంతకాలం వి.ఓ. హెచ్.వుపయోగించికూడా తను ఎక్కడున్నదీ కనుక్కోలేరు. రేడియో స్విచ్ ఆఫ్చేసి ఆటోమేటిక్ డైరక్షన్ ఫైండర్ వైపు చూశాడు.

తను చేరుకోవలసిన స్థానం ఇంకా రెండువందల మైళ్ళు వున్నట్లుగా చూపెడుతోంది. అంటే పది నిముషాలు.

అయిదు నిముషాలు దాటగానే స్పీడు తగ్గించి కంపాస్లో సెట్టింగ్ సరిచేసుకొన్నాడు.

మరో అయిదునిముషాల్లో తనకు కావలసిన ప్రదేశం దగ్గరికి చేరుకొన్నాడు.

గ్లాస్ కాబిన్‌లోనుండి క్రిందకు చూశాడు. దూరంగా నికోబార్ ఐలండ్ సముద్రంలో నల్లని చుక్కల్లా కనిపిస్తున్నాయి.

కెప్టెన్ విన్నర్ విమానాన్ని తిన్నగా పాసేజ్ ఐలండ్ మీదకు తీసుకెళ్ళాడు.

బీచ్‌లో కామాఫ్లాగ్ నెట్ క్రిందవున్న 'షాడో' నౌక ప్రక్కనే 'అంగారక'ను దింపాడు. విమానం లోంచి క్రిందికి దిగి చకచకా నెట్‌ను తొలగించాడు.

తరువాత 'షాడో' డెక్ మీది వించ్ ఆపరేట్ చేసి సెలూన్ రూమ్‌మీది పైకప్పు తొలగించాడు.

తిరిగి గబగబ విమానంలోకి ఎక్కి విమానాన్ని గాలిలో లేపాడు. అంగారకను మెల్లిగా ఎగరనిస్తూ సెలూన్ తిన్నగా తీసుకొచ్చాడు. అతి జాగ్రత్తగా ఒక్కొక్క అంగుళమే జట్ ఫైటర్‌ను క్రిందికి దింపసాగాడు.

హెలికాప్టర్‌లా వున్న చోటునుండి పైకెగరడం, క్రిందికి దిగడంలాంటి లక్షణం అంగారకకు వుండడం విన్నర్‌కు ఎంతో వుపయోగించింది.

'అంగారక జెట్ ఫైటర్ ఓడ సెలూన్ గదిలో సరిగ్గా సరిపోయింది. ఒక్కొక్క అంగుళం చొప్పునా జెట్‌ను జాగ్రత్తగా సెలూన్‌లో దింపి ఇంజన్ ఆఫ్ చేశాడు.

చకచక క్రిందికి దిగి మళ్ళీ వించ్ ఆపరేట్ చేసి సెలూన్ పైకప్పును యధాతథంగా అమర్చాడు.

ఇప్పుడు బయటనుండి చూసేవాళ్ళకు కేవలం ఓడ తప్ప, సెలూన్ గదిలో దాచిన విమానం మాత్రం కనబడదు.

తర్వాత మళ్ళీ యథాప్రకారం షెడ్ పైన నెట్ కప్పి దానిమీద వెదురుదుబ్బులు, తుప్పలు కప్పాడు.

తను బయటికి, లోపలికి వెళ్ళడానికి మాత్రం చిన్న రంధ్రం ఒకటి నెట్‌లో అట్టే పెట్టుకొన్నాడు.

కాబిన్‌లో స్టౌ వెలిగించి కాఫీ కాచుకున్నాడు.

వేడి వేడి కాఫీలో బిస్కట్లు నంజుకు తింటూ రేడియో ఆన్ చేశాడు.

తొమ్మిదింబావు వార్తల్లో 'అంగారక' ప్రమాదం గురించి న్యూస్ ఏమీ లేదు.

బహుశా తర్వాతకూడా రాదు అనుకొన్నాడు. అంగారక లాంటి సూపర్ ఫైన్ జెట్ ఫైటర్ని తయారుచేస్తున్నట్లు ఏ దేశమూ ఒప్పుకోదు.

అంగారక ప్రమాదం రహస్యంగా వుంచబడుతుందనడంలో సందేహంలేదు.

విన్నర్, అంగారకను షెడ్‌లో దాచే సమయానికి ఇంకా బంగాళాఖాతంలో ఎటువంటి అన్వేషణా ప్రయత్నాలు మొదలవలేదు.

*　　*　　*

రాత్రి పదింబావయింది. అంగారక కనిపించకుండా పోయి అప్పటికి రెండుగంటలు దాటిపోయింది.

విక్రాంత్ విమానవాహక నౌక, ఫ్లయిట్ డెక్ లైట్ల వెలుతురులో నిండిపోయింది.

చకచకా డెక్ లిఫ్ట్‌లు పనిచేశాయి. నౌక అంతర్భాగంలో నుండి అరడజను 'సీ హాక్' విమానాలు పైకి వచ్చాయి.

సెర్చ్ మెసేజ్ అందిన పావుగంటలో ఆరు సీహాక్ విమానాలు కూలిపోయిన అంగారకను గాలించడానికి బంగాళాఖాతం మీద ఎగురుతూ పోయాయి.

అదే సమయంలో పోర్ట్ బ్లెయిర్ లోని నేవల్ బేస్ నుండి నాలుగు పెట్రోలుబోట్స్, రెండు హెలికాప్టర్లు, తమకూ మద్రాసుకు మధ్యనున్న సముద్రప్రాంతాన్ని వెతకడానికి బయలుదేరాయి.

కూలిపోయింది మామూలు విమానమయితే యిన్ని జాగ్రత్తలు, ఇంత సిబ్బంది వెంటనే వెతికే కృషిలో పాల్గొనేవాళ్ళే కాదు. కాని 'అంగారక' నేషనల్ సీక్రెట్. అది శత్రువు చేతిలో పడినా, దాని స్వరూప స్వభావాలు ప్రజలకు తెలిసినా భారతదేశ వునికికే ఎంతో అపాయం.

అంచేత ఎంత రాత్రయినా యీ వేట తప్పదు.

* * *

తాళాలు తీస్తున్న చప్పుడు విని తలెత్తి చూశాడు జయపాండ్యన్.

జైలుగార్డు తన సెల్ తాళం తీస్తున్నాడు. అతని వెనకే జైలువార్డరు నిలబడివున్నాడు,

రాయపురం సెంట్రల్ జెయిల్లోని 'సాలిటరీ కన్ ఫైన్ మెంట్' వార్డు అది. అంటే యావజ్జీవితశిక్ష అనుభవించే వాళ్లు, రేపోమాపో ఉరితీయబడే వాళ్లు ఇతరులతో కలవకుండా ప్రత్యేకమైన గదుల్లో ఒంటరిగా వుంచబడతారు అక్కడ.

తలుపు తెరిచిలేచి బయటకు రమ్మన్నట్లు సైగ చేశాడు జైలుగార్డు.

జయపాండ్యన్ గడ్డిపరుపు మీదినుండి లేవలేదు... నిర్లక్ష్యంగా చూశాడు గార్డువైపు.

''ఎందుకు?''—అన్నాడు ఎక్కడో నూతిలోనుండి వచ్చినట్లుంది మాట. ఇలా ఈ జైల్లో కొంతకాలం గడిపితే భాషే మర్చిపోయే అవకాశం వుంది.

"ఎందుకో చెపితేగాని రావా?" అన్నాడు గార్డ్ లాఠీ వూపుకొంటూ గదిలోకి వెళ్ళబోతూ, వార్డర్ అతని భుజంమీద చెయ్యివేసి వెనక్కి లాగాడు, తను ముందుకు వస్తూ...

"దేరీజ్ స్పెషల్ విజటర్ ఫర్ యు మిస్టర్ పాండ్యన్ వుడ్ యు ప్లీజ్ కమ్?" జైలు వార్డర్ గొంతులో దయ ధ్వనిస్తోంది.

జయపాండ్యన్ స్వతహాగా క్రూరుడు కాదు. అతను సాధారణ నేరస్తుడు కాదు. మర్యాదా, లాంఛనాలు అర్ధం చేసుకోగల శక్తి అతన్లో యింకా మిగిలివుంది.

గడ్డిపరుపు మీదినుండి మెల్లగా లేచి నిలబడి జైలు గదిబయిటికి వచ్చాడు.

ముందు వార్డర్, తర్వాత జయపాండ్యన్, అతని వెనక గార్డు. జైలుసూపరింటెండెంట్ గదివైపునడిచారు.

జైలు సూపరింటెండెండ్ గదికి ప్రక్కగా, విజిటర్స్ గది వుంటుంది.

జయపాండ్యన్‌ను ఆ గదిలోకి తీసుకవచ్చేటప్పటికే ఆ గదిలో డి.ఐ.జి. యూనిఫాంలోని ఓ వ్యక్తి కూర్చుని వున్నాడు.

జయపాండ్యన్‌ను ఆ గదిలో వదిలిపెట్టి, వార్డరు, గార్డూ ఇద్దరూ బయటికి వెళ్ళిపోయారు. టేబిలుకు అవతల విజిటర్స్ చైర్లో కూర్చొనివున్న వ్యక్తివంక సందిగ్ధంగా చూస్తూ నిలబడ్డాడు జయపాండ్యన్.

ఎర్రగా పండుకోతిమల్లే వున్నాడా వ్యక్తి. వెడల్పయిన శరీరం, మెడమీద అతికించినట్లున్న పెద్దతల, నున్నగా వెనక్కి దువ్వుకొన్న జుట్టు, నిక్కబొడుచుకొన్నట్లున్న చెవులు, దట్టమైన కనుబొమల క్రింద చిన్నకళ్ళు. సూది ముక్కు, పెదిమలు వుండి లేనట్లుగా వున్నాయి.

అతని టెరీకాటన్ ఖాకీ యూనిఫాంని బట్టి, అతని షోల్డర్ లూప్స్‌మీది గుర్తుల్నిబట్టి అతని హోదా డి.ఐ.జి. అని ఊహించుకోవచ్చు.

జయపాండ్యన్‌ని నఖశిఖ పర్యంతం పరీక్షగా చూశాడా వ్యక్తి పావునిముషం సేపు. వున్నట్లుండి అతని ముఖం మీద నవ్వులాంటి దొకటి కదిలింది.

"సిడవున్ మిష్టర్ జయపాండ్యన్! టేక్ యువర్ సీట్!" అన్నాడతను టేబిలుకు దూరంగా వేసివున్న కుర్చీ చూపెడుతూ.

జయపాండ్యన్ కూర్చోలేదు. అతని వైపు దీర్ఘంగా చూశాడు.

"మే ఐ హావ్ ఎ సిగరెట్" అన్నాడు టేబిలు మీదవున్న గోల్డ్‌ఫ్లేక్ పెట్టెవైపు చూపి.

"ష్యూర్! హావ్ వన్!" అన్నాడతను పెట్టెవైపు చూసి తల వూపుతూ.

జయపాండ్యన్ సిగరెట్ తీసి వెలిగించి గట్టిగా ఓ దమ్ము పీల్చాడు. తర్వాత మెల్లిగా కుర్చీలో కూర్చొని కళ్ళు మూసుకున్నాడు.

"హోప్ యుఆర్ కంఫర్టబుల్!"అన్నాడతను జైల్లో సౌకర్యంగానే వుందని భావిస్తున్నాను అని దానర్థం.

జయపాండ్యన్ గుప్పున పొగవదిలి కళ్ళు తెరిచాడు. అతని పెదవుల మీద చిరునవ్వు ఒకటి కనిపించింది.

"ఇట్ డస్న్ట్ మేటర్ రియల్లీ" అన్నాడు జయపాండ్యన్ ఫిలాసాఫికల్‌గా.

"అఫ్‌కోర్స్! మరో పదిరోజుల్లో మనం చనిపోవడం ఖాయం అని ముందుగా తెలిసినప్పుడు కష్టసుఖాలను గూర్చి అంతగా పట్టింపు వుండదనుకొంటాను" అన్నాడు ఆ వ్యక్తి.

"యస్ యు ఆర్ రైట్!" అన్నాడు జయపాండ్యన్ మరో దమ్ము పీల్చి వదులుతూ.

"కానీ, పది రోజుల్లో నిన్ను ఉరితియ్యరు. అసలు నీకు ఈ జైల్లోంచి పూర్తిస్వేచ్ఛతో విడుదల లభిస్తుంది. అని నువ్వు తెలుసుకొన్నప్పుడు జీవితంమీద నీ దృక్పథం పూర్తిగా మారిపోయి—" అన్నాడతను నవ్వుతూ సిగరెట్ ఆర్పేస్తూ.

జయపాండ్యన్ కళ్లు నిప్పుకణాల్లా మండాయి.

"మిస్టర్! నీ పేరేమిటో తెలియదు గాని, పరిహాసాలకు ఇది సమయంకాదు" అన్నాడు కోపంగా.

"సారీ మిస్టర్ పాండ్యన్! ఐ మెన్ట్ నో అఫెన్స్. నా పేరు చెప్పనేలేదు కదూ. ఐయామ్ కల్నల్ కపూర్! మిలిటరీ ఇంటలిజన్స్" అన్నాడతను అపాలిజటిక్ గా.

"ఐసీ!"

"ఐ హావ్ ఎ ప్రపోజిషన్ ఫర్ యు."

"చెప్పండి వింటున్నాను" అన్నాడు సిగరెట్ చివరి దమ్ము లాగి నేలమీద పడేస్తూ.

"హావ్ అనెదర్ వన్ ఇఫ్ యు లైక్" అన్నాడు కపూర్ పాకెట్ ముందుకు తోస్తూ.

జయపాండ్యన్ తలాడించి మరో సిగరెట్ వెలిగించాడు.

"నేను చెపుతున్న విషయాన్ని సీరియస్ గా ఆలోచించండి. మీరు మాకు సహాయం చెయ్యడానికి ఒప్పుకొంటే...మీకు పూర్తిస్వేచ్ఛ, క్రొత్త జీవితం లభిస్తాయి—"

"అంటే నాకు విధించిన ఉరిశిక్ష రద్దవుతుందా?"—

"నో...అలాంటిదేమీ లేదు. ప్రభుత్వ రికార్డుల్లో

ఎక్కడా మిమ్మల్ని క్షమించి వదిలిపెట్టినట్లుగానీ, మీరు మాకు సహాయం చెయ్యడానికి ఒప్పుకున్నట్లుగాని వుండదు"—

"అంటే?"—

"ఇది ఒకరకంగా ప్రయివేట్ ఎసైన్‌మెంట్. ప్రభుత్వానికి సంబంధంలేదు. ప్రభుత్వంలో కొందరు పలుకుబడిగల వ్యక్తులు, ఒకపని చేసిపెట్టమని మిమ్మల్ని కోరుతున్నారు. దానికి ప్రతిఫలంగా మిమ్మల్ని ఈ జైలులోంచి తప్పించి, మరో దేశంలో సుఖంగా బ్రతికే అవకాశం కల్పిస్తారు."

"అంటే అధికార రీత్యా నన్ను జైలునుంచి విడుదల చేసినట్లుకాని, నేను నేరస్తుడు కానని గాని ఏ రకమైన రికార్డు వుండదన్న మాట."

"యస్. ఎగ్జాక్ట్లీ కరెక్ట్. అంటే నిజానికి మీరు జైలులోనుంచి తప్పించుకు పారిపోయినట్లు సాక్ష్యం సృష్టింపబడుతుంది."

"ఇంతకీ ఏం చెయ్యాలి నేను?"

"చెపుతాను. నేను చెప్పేముందు ఓ ప్రశ్న అడుగుతాను సమాధానం చెప్పండి.

ఈ జైలులో నుండి బయటపడి మరో దేశంలో సుఖంగా బ్రతికే ఏర్పాటుకోసం మీరేంపని చెయ్యగలరు?" అన్నాడు కల్నల్ కపూర్ సూటిగా.

జయపాండ్యన్ ఒళ్ళు జల్లుమంది. మౌనంగా కళ్ళప్పగించి కపూర్‌నే చూస్తూవుండిపోయాడు.

నవ్వాడు కపూర్... "సమాధానం చాలా సింపుల్ మిష్టర్ పాండ్యన్. పదిరోజుల్లో ఈ ప్రపంచాన్ని వదిలే మీకు మరో క్రొత్తజీవితం ప్రారంభించే అవకాశం

వచ్చినప్పుడు ఏం చెయ్యడానికైనా వెనుకాడకూడదు మీరు.''

మెల్లిగా తలూపాడు పాండ్యన్. ''యస్...యు ఆర్ రైట్ అనుకొంటాను. చెప్పండి...ఏం చెయ్యాలి'' అన్నాడు.

తల అడ్డంగా వూపాడు కపూర్. ''నా ప్రశ్నకు సమాధానం అదికాదు. మేము చెప్పిన ప్రపోజిషన్‌కి ఏ పనయినా చెయ్యడానికి మీరు సిద్ధంగా వున్నారా?''

''యస్...ఆఫ్‌కోర్స్...ఏమిటది?__'' అన్నాడు జయపాండ్యన్ అసహనంగా.

''ఒక మనిషిని కాల్చి చంపాలి మీరు'' అన్నాడు కపూర్.

కపూర్ మాటలు ఆ గదిలో పిస్తోలు గుళ్ళలా పేలాయి. తల తిరిగినట్లయింది జయపాండ్యన్‌కు.

''మీ ప్రపోజలును జైలు సూపరింటెండెంట్‌కీ, వార్డర్‌కి చెపితే ఏమవుతుంది?'' అన్నాడు గట్టిగా పొగ పీల్చి వదుల్తూ.

నవ్వాడు కపూర్. ''అమెచ్యూరిష్ క్వశ్చన్! మీ కంప్లెయింట్‌గాని, స్టేట్‌మెంటుగాని యెవ్వరూ రికార్డ్ చేసుకోరు. ఈ జైలు అధికారులు, ప్రభుత్వంలోని అనేక ముంది వున్నతోద్యోగులు కొందరు మంత్రులు మా మనుషులే అని ఈ సరికి మీరు గ్రహించే వుండాలి. పైగా జైలులో మీ రేమయినా గొడవ చేయాలని ప్రయత్నిస్తే పదిరోజులపాటు మిమ్మల్ని మత్తులో వుంచడం అతి కష్టమయిన పనికాదనుకొంటాను__''

జయపాండ్యన్ తలవూపి ''మరో ప్రశ్న. ఈ పనికి నన్నే ఎందుకు ఎన్నుకోవలసి వచ్చింది?''

"సమాధానం చెపుతాను. మేం చేయబోయే పనికి ఒక డిస్పరేట్ పర్సన్ కావాలి. మామూలు కిరాయి హంతకులు పనికిరారు అని యెప్పుడో నిశ్చయించుకొన్నాము. మాకు కావలసిన వ్యక్తి రైఫుల్‌ను వుపయోగించి గురిమానీ కొట్టగల నేర్పరి అయుండాలి, మానసిక స్థిరత్వం కలిగి వుండాలి, ప్రాణాలమీద ఆశ పోయిన వ్యక్తి అయివుండాలి.

ఈ లక్షణాలు వుండి చావుకోసం యెదురుచూస్తున్న వ్యక్తులకోసం మేం మా ఇంటిలిజెన్స్ హెడ్ క్వార్టర్స్ లోకి కంప్యూటర్ని ఇన్ ఫర్మేషన్ అడిగాము. కంప్యూటర్ల అంచనా ప్రకారం అలాంటి వ్యక్తులు ఇద్దరే కనిపించారు అందులో మీరొకరు. ఇంకో వ్యక్తి వున్నా మానసికంగా, శారీరకంగా మీరు స్థిరమైనవారని మిమ్మల్ని ఎన్నిక చేసుకోవడం జరిగింది.

అదీకాక మీరు మారణాయుధాల ప్రయోగంలో నిపుణులు, మాకు అనుకూలంగా వున్న జైలు అధికారుల కస్టడిలో వున్నారు."

"ఐసీ!" అన్నాడు జయపాండ్యన్.

"సరే. మీరు ఏం నిశ్చయించుకొన్నారు?"

"డు ఐ హేవ్ ఎ చాయిస్. మీ ప్రపోజలును బేషరతుగా అంగీకరిస్తున్నాను. మిగిలిన వివరాలు చెప్పండి" అన్నాడు జయపాండ్యన్ జబ్బలు చరుచుకొని.

"ది ప్లాన్ ఈజ్ వెరీ సింపుల్. ముందు మిమ్మల్ని ఈ జైలునుండి తప్పిస్తాము."

"ఎలా?"

"దట్స్ సీక్రెట్! చివరి నిముషంవరకూ చెప్పము మేము. మొత్తానికి మీరు జైలులోంచి సులభంగా తప్పిం

చుకు పోయేలా వీలు కల్పిస్తాము. ఆ తర్వాత ఎవర్ని హత్య చెయ్యవలసిందీ, ఎలా హత్య చెయ్యవలసిందీ చెపుతాము మీకు. హత్య జరిగిన వెంటనే ఈ దేశం వదలి వెళ్ళిపోయేందుకు ఏర్పాటు చెయ్యబడతాయి. మీరు వెళ్ళబోయే దేశంలో మీ పేర్న ఒక బ్యాంకు అకౌంటు అందులో మీ మిగిలినజీవితం సుఖంగా గడిచిపోయేందుకు తగిన డబ్బు వుంటాయి. ఈ దేశం వదిలి వెళ్ళడానికి వీలుగా మీకు ప్యాస్‌పోర్టు, ఎయిర్‌పోర్ట్‌లో మిమ్మల్ని ఎవరూ అడ్డగించకుండా ఏర్పాటు చేస్తాము.''

''ఇట్ సౌండ్స్ గుడ్!'' అన్నాడు జయపాండ్యన్ సిగరెట్ చివరిదమ్ము పీల్చి వదులూ.

''యస్! అవర్ ప్లాన్ యీజ్ ది బెస్ట్! మీ నిర్ణయం ఏమిటి?''

''ఓకె...అయామ్ రడీ—!'' అన్నాడు జయపాండ్యన్.

''గుడ్! పారిపోవడానికి సిద్ధంగా వుండండి. బెస్ట్ ఆఫ్ లక్'' అన్నాడు కల్నల్ కపూర్ జయపాండ్యన్‌కు షేక్‌హాండ్ ఇస్తూ.

''కల్నల్ కపూర్! మరో చిన్న రిక్వెస్టు!'' అన్నాడు జయపాండ్యన్.

''ఏమిటది?'' ఆశ్చర్యంగా అడిగాడు కపూర్.

''ఐ విల్ కీప్ దిస్!'' అన్నాడు జయపాండ్యన్ నవ్వుతూ బల్లమీది సిగరెట్ పాకెట్ జేబులో వేసుకొంటూ.

* * *

''ఎనీ న్యూస్?'' ప్రొఫెసర్ రామన్న కంఠంలో ఆతృత.

"నథింగ్. ఇంతవరకూ ఏమీ తెలియలేదు. వెరీ మిస్టీరియస్. కనీసం అవశేషాలుకూడా కనిపించడంలేదు" అన్నాడు ఎయిర్ వైస్ మార్షల్ గోవిందన్ నాయర్.

"యూ మస్ట్ కంటిన్యూ ది సెర్చ్! అంగారక శత్రువుల చేతిలో పడలేదని మనకు పూర్తి నమ్మకం దొరికేవరకూ బంగాళాఖాతమంతా గాలించమనండి. విమానం కూలిపోయినరోజు సముద్రంలో 'లో టైడ్' వుందిగనుక విమానం పైకి తేలే అవకాశంలేదు. కాని చివరి క్షణంలో విన్నర్ బెయిల్ అవుట్ చేస్తున్నానన్నాడు గనుక ఆ పారాచ్యూట్ గాని,ఎజెక్షన్ సీటుగాని నీటిలో తేలుతూ కనిపించవచ్చు" అన్నాడు రామన్న.

"యస్, యస్! యు ఆర్ రైట్! సెర్చ్ పార్టీలకూ అదే చెప్పాను నేను. మద్రాస్ బీచ్ ప్రాంతంలో ఏదో ఎర్రటి వస్తువు మండుతూ విమానంలోనుండి సముద్రంలో పడడం కొంతమంది బెస్తవాళ్ళు చూశారట. సెర్చ్‌ను ఆ ప్రాంతంలో కాన్‌సెన్‌ట్రేట్ చెయ్యమని ఇన్‌స్ట్రక్షన్ ఇచ్చాను."

"యస్. మేక్ ది సెర్చ్ థరో! కూలిపోయిన విమానంలో డిఫెక్ట్ ఏమిటో తెలియనిదే మనం మరో టెస్ట్ పార్టీ టేకవ్ చేయడం ప్రమాదకరం. కనీసం ఆ డిఫెక్ట్ తెలియడానికయినా కెప్టెన్ విన్నర్ బ్రతికుండాలని కోరుకొంటున్నాను" అన్నాడు ప్రొఫెసర్ రామన్న దిగులుగా.

"ష్యూర్ ...ష్యూర్" అన్నాడు గోవిందన్నాయర్ టెలిఫోన్ దగ్గరికి లాక్కొంటూ.

* * *

జయపాండ్యన్ జైల్లో సిగరెట్ కాలుస్తూ కూర్చు

న్నాడు. అతని మనసులో అనేక ఆలోచనలు ఒకేసారి కదుల్తొన్నాయ్.

చిన్న జైలుగది. నిలబడి ఎటువైపుకూ నాలుగడుగులు వెయ్యడానికి వీలులేనంత చిన్నగది. నాలుగువైపులా రాతిగోడలు వెనకవైపు సీలింగ్ కు దగ్గరగా యినుప చువ్వలతో కిటికీ, ముందు బలమైన ఇనుపతలుపు. తప్పించుకుపోవడానికి వీలులేని సెటప్.

సాలిటరీ కన్ ఫైన్ మెంట్ కు ఉద్దేశింపబడిన జైలు గదులవి. మరణశిక్ష ఎదురుచూసే ఖైదీలు, రాక్షస ప్రవృత్తి చూపెడుతున్న ఖైదీలు, దీర్ఘకాల కఠిన శిక్షలు అనుభవిస్తున్న ఖైదీలు ఈ చిన్నచిన్న జైలు గదుల్లో విడివిడిగా వుంచబడతారు.

ఉదయం నుండి తన గదివున్న వింగ్ లోని ఖైదీల నందరినీ ఇతర వింగ్స్ లోని గదుల్లోకి తీసుకెళ్ళడం చూస్తూనే వున్నాడు జయపాండ్యన్.

మధ్యాహ్నం పన్నెండు గంటలకు అల్యూమినియం గిన్నెలో భోజనం వచ్చింది. నూకల అన్నం, పల్చటి నీళ్ళలాంటి సాంబారు, గోంగూర పచ్చడి. రోజూ అదే తిండి.

భోజనం తెచ్చిన గార్డ్, గిన్నెతోబాటు చిన్న అట్టపెట్టె తెచ్చి లోపలపెట్టి వెళ్ళిపోయాడు.

గబగబా అట్టపెట్టె తెరిచాడు జయపాండ్యన్. చిన్న హేండ్ 'మిషన్ సా', చిన్న కాగితం వున్నాయి. కాగితం మడతలు విప్పాడు.

"మిషన్ సాతో తలుపు వూచలు కోసెయ్యి... చీకటి పడినతరువాత వూచలు వంచి పారిపోవడానికి సిద్ధంగా వుండు. ఇప్పుడు అన్నం తెచ్చిన గార్డు నిన్ను తీసుకెళ్ళడానికి వస్తాడు చీటీని తగలబెట్టు"—

చదువుకొని తలాడించాడు జయపాండ్యన్. అగ్గిపుల్ల గీసి కాగితాన్ని కాల్చి మసిచేశాడు.

ఉదయం నుండి ప్రక్కగదుల్లోని ఖైదీలనందరినీ మరోచోటికి తరలించడానికి కారణం అదే అయ్యుంటుంది. తనీ మరరంపం వుపయోగించి ఊచలు కోస్తుంటే ఆ శబ్దం వాళ్లు వినకుండా అయివుంటుంది. నిజానికి తాళాలు తెరిచి తను తప్పించుకుపోయేట్లు చెయ్యవచ్చు. కాని అలా అయితే తప్పకుండా జైలు అధికారులమీద అనుమానం వస్తుంది. అంచేత తను ఊచలు కోసుకొని తప్పించుకుపోయినట్లు సాక్ష్యం సృష్టిస్తున్నారన్న మాట.

అన్నం తినాలనిపించలేదు. చీకటి పడగానే ఈ జైలులోంచి తప్పించుకొని స్వేచ్ఛా ప్రపంచానికి అడుగు పెట్టబోతున్నాడు. ఈ రాళ్ళ నూకల అన్నం తినవలసిన అవసరంలేదు.

అన్నం గిన్నెను గోడపక్కకు నెట్టి, సిగరెట్ వెలిగించాడు. ఇంకా మూడు సిగరెట్లు వున్నాయి. జైలులోంచి బయటపడేవరకూ అవే...జాగ్రత్తగా కాల్చుకోవాలి అనుకొన్నాడు.

హేండ్ మిషన్ రంపం తీసుకొని మెల్లిగా తలుపు దగ్గరికి చేరాడు.

రంపం చక్రాన్ని ఊచకు ఆనించి మెల్లిగా త్రిప్పడం మొదలుపెట్టాడు. మొదలుపెట్టిన అయిదునిముషాల్లో తెలిసింది పాండ్యన్ కు. ఊచలు కోయడం అంత తేలికయిన పని కాదని. మొదటి ఊచ కోయడానికి దాదాపు గంటన్నర పట్టింది.

మూడంగుళాలకు ఒక వూచచొప్పున వున్నాయి అంగుళంలావు ఇనుపకడ్డీలు. మనిషి దూరేంత రంధ్రం

చెయ్యడానికి దాదాపు ఆరువూచలు కొయ్యవలసి వుంటుంది.

ఆరువూచలు పూర్తిగా కోసేప్పటికి రాత్రి ఏడయింది.

కోసిన ఊచల్ని వంచడం శక్తికి మించిన పనిగా కనిపిస్తోంది. చివరి సిగరెట్ వెలిగించి జైలుగోడకు జేరగిలబడ్డాడు.

సాధారణంగా రోజూ కారిడార్లో వెలిగే బల్బు వెలగక పోవడంవలన బయటంతా చీకటిగా వున్నట్లు వుంది.

గార్డ్ రూమ్‌లో ఎనిమిది గంటలు కొట్టారు. జైలంతా నిశ్శబ్దంగా వుంది. ఎక్కడో దూరంగా ఎవరో గుండెలు పగిలేలా ఏడుస్తున్న శబ్దం మాత్రం వినిపిస్తోంది.

శక్తి కూడగట్టుకొని ఒక్కొక్క ఊచే వంచడం మొదలు పెట్టాడు.

ఊచ ఊచకీ పదినిముషాలు విశ్రాంతి తీసుకొంటూ ఆరు ఊచలు వంచాడు.

తొమ్మిది, పది. పదకొండు... రెండయింది... అలసట, శ్రమవల్ల ఎదురు చూసి చూసి జయపాండ్యన్ గదిలో ఒళ్ళు తెలియకుండా నిద్రపోయాడు.

ఎవరో డొక్కలో పొడుస్తున్నట్లయి మెలకువ వచ్చింది. జైలుగార్డు లాఠీతో పొడుస్తున్నాడు.

"కమాన్... గెటప్... క్విక్..." అంటున్నాడు గుసగుసలుగా.

ఎక్కడో ఇంజను రొద వినిపిస్తోంది. చటుక్కున లేచి నిలబడ్డాడు.

గబగబ వంచిన వూచల సందుల్లోంచి బయటికి వచ్చాడు. వంగిన ఊచొకటి నిక్కరకు పట్టుకొని పర్రున చిరిగింది.

"జైలు యార్డ్‌లోకి పరిగెత్తు!" అన్నాడు గార్డ్.

చకచక జైలుమధ్య ఖాళీస్థలంలోకి పరిగెత్తాడు. అప్పుడర్థమైంది జయపాండ్యన్‌కి ఇంజన్ రొద ఏమిటో చెవులు చిల్లులుపడేలా చప్పుడవుతోంది.

హెలీకాప్టర్!!!

జైలు మధ్యభాగంలో క్రిందికి దిగుతోంది.

వేగంగా పరిగెత్తాడు హెలీకాప్టర్ వైపు.

వెనక యెవరో అరుస్తున్నారు.

మిగిలిన గదుల్లో ఖైదీలు నిద్రలేచారు. వాళ్ళ కేకలు అరుపుల్తో జైలు ప్రతిధ్వనించింది.

జైలుగార్డు విజిల్ అంత గొడలోనూ స్పష్టంగా వినిపించింది.

జైలు అలారం బొయ్యిన మోగుతోంది.

"పాండ్యన్! క్విక్!" హెలీకాప్టర్ తలుపు తెరుచుకొంది.

జయపాండ్యన్ హెలీకాప్టర్‌లో అడుగుపెట్టగానే రివ్వున పైకి లేచింది.

"ఫైర్!" అరుస్తున్నారెవరో క్రిందనుండి.

అప్పటికే హెలికాప్టర్ జైలుగోడలు దాటింది. జైలు చుట్టూ ఫ్లడ్ లైట్లు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి.

క్షణాల్లో హెలీకాప్టర్ వూరి పొలిమేరలు దాటిపోయింది.

* * *

అలారం చప్పుడికి మెలకువ వచ్చింది జయపాండ్యన్‌కు.

ఎయిర్‌కండిషన్డ్ గది. ఫోమ్‌బెడ్ ప్రక్కనే వున్న వైట్ టేబిల్ మీద అలారం టైమ్‌పీస్ తొమ్మిది గంటలు చూపెడుతోంది.

బదకంగా లేచాడు జయపాండ్యన్.

తలుపుమీద చిన్నగా చప్పుడయింది.

"కమిన్!"

తెల్లటి బట్లర్ డ్రెస్‌లోవున్న వ్యక్తి ట్రేతో లోపలికి వచ్చాడు. పింగాణీ పాట్‌లోనుండి డికాక్షన్ పోసి కాఫీ కలిపి ఇచ్చాడు. ట్రేలోనే ఓ ప్రక్క మడిచిపెట్టిన న్యూస్ పేపర్లు వున్నాయి.

కాఫీ సిప్ చేస్తూ పేపరు తిరగేశాడు.

జైలులోంచి తను తప్పించుకొన్న సంఘటన బాక్స్ కట్టి ఫ్రంట్ పేజీలో ప్రచురించారు. హెలీకాప్టర్ సహాయంతో ఖైదీలను జైళ్లలోంచి తప్పించే పద్ధతి భారత దేశంలో జరిగిన సంఘటన అని విలేఖరి ఈ జైల్ బ్రేక్ గురించి వర్ణించాడు. ఈ హెలీకాప్టర్ కోసం మద్రాసు చుట్టుప్రక్కల పోలీసులు సైనికదళాల సహాయంతో గాలిస్తున్నట్లు వ్రాశారు.

"బ్రాక్‌ఫాస్ట్ సర్?" అన్నాడు బట్లర్.

"యస్! మరో గంటలో!" అన్నాడు జయపాండ్యన్ లేచి నిలబడుతూ.

అరగంటలో కాలకృత్యాలు ముగించుకొని బాత్ రూమ్‌లోనుండి బయటపడ్డాడు. గదిలోని ఓ సూట్ కేసులో తన సైజ్‌కు సరిపడా దుస్తులు వున్నాయి... నచ్చినవి ఏరుకొని డ్రస్ చేసుకొన్నాడు.

తల దువ్వుకొంటూండగా బట్లర్ బ్రేక్‌ఫాస్ట్ ట్రే తెచ్చాడు. వేడివేడి ఇడ్లీలు, నెయ్యి, మసాలా దోశె... నూరుశాతం మద్రాస్ బ్రేక్‌ఫాస్ట్... చాలాకాలంతర్వాత తృప్తిగా టిఫిన్ చేశాడు జయపాండ్యన్.

బ్రేక్‌ఫాస్ట్ పూర్తిచేసి సిగరెట్ వెలిగిస్తుండగా గది లోకి వచ్చాడు కపూర్.

"గుడ్‌మార్నింగ్ కల్నల్!" అన్నాడు జయపాండ్యన్ ఉత్సాహంగా.

"వెరీ వెరీ గుడ్‌మార్నింగ్...హౌడు యు ఫీల్?" అన్నాడు కల్నల్ కపూర్ సోఫాలో చతికిలబడుతూ.

"ఓ...గ్రేట్...!" అన్నాడు పాండ్యన్ ఆనందంగా.

బట్లర్ చకచకా ఖాళీ అయిన ట్రేని తీసుకెళ్ళిపోయాడు.

"మేజర్ పాండ్యన్ హౌ గుడ్ యు ఆర్ విత్ ఎ రైఫిల్?" అన్నాడు కపూర్ సోఫాలో వెనక్కి వాలి సిగరెట్ పొగ గాల్లోకి రింగులుగా వదుల్తూ.

"ఉచ్ మేక్? ఏ రకం రైఫిలు... వించెస్టర్ మార్క్స్‌మన్, బాంటిన్, ఎక్స్ బి పాయింట్ సిక్స్. ఏ రకమైన రైపిల్‌నయినా సులభంగా ఉపయోగించగలను. ప్రిఫరబ్లీ వించెస్టర్" అన్నాడు జయపాండ్యన్ మేటరాఫ్ ఫాక్టుగా.

"అఫ్‌కోర్స్ వుయ్‌నో...మీరు ఆర్మీలో వుండగా బెస్టు షాట్ అని తెలుసు. కాని ఆ టచ్ ఇంకా వుందంటారా?"

"వాట్ డు యు మీన్?" అన్నాడు జయపాండ్యన్ కోపంగా. "ఎ మార్క్స్‌మన్ ఈజ్ ఆల్‌వేస్ ఎ మార్క్స్‌మన్."

చిన్నగా నవ్వాడు కపూర్. "ష్యూర్! ష్యూర్! ఇదివరలో టెలిస్కోపిక్ లెన్స్ వుపయోగించారా?"

నవ్వాడు జయపాండ్యన్ "టెలిస్కోప్ లెన్స్ వున్న

రైఫిలు నా చేతిలో వుంటే గాలిలో ఎగిరే కందిరీగనయినా కొట్టగలను—" అన్నాడు జబ్బలు చరుచుకొంటూ.

"గుడ్! అయితే మూవింగ్ టార్గెట్స్ మీకు ప్రాబ్లమ్ కాదన్నమాట."

"నో...నా బెటాల్...యాన్యువల్ ఆర్మ్డ్ ఫోర్సెస్ ట్రూప్ షూటింగ్‌లో రెండేళ్ళు వరుసగా ఛాంపియన్‌ను—"

"దటీస్ వెరీ ఎంకరేజింగ్. కాని మీరు మళ్ళీ పీక్ ఫెర్‌ఫార్ మెన్స్‌లో వుండాలంటే ప్రాక్టీస్ అవుసరం కాదా?"

"ష్యూర్! ఎ కపులాఫ్ డేస్. ఓ రెండ్రోజులు వరుసగా ప్రాక్టీస్ చేస్తే చాలు..." అన్నాడు జయపాండ్యన్.

"రైట్! ఎగురుతోన్న హెలీకాప్టర్‌లో కూర్చొని మేము చూపించిన మనిషిని కాల్చి చంపాలి మీరు. అంటే మీరు సాలిడ్ బేస్ మీద నిలబడి షూట్ చేసే అవకాశం కూడా వుండదు. పైపెచ్చు మీరు చంపవలసిన మనిషికూడా కదులుతూ వుంటాడు" అన్నాడు కపూర్ మరో సిగరెట్ వెలిగిస్తూ.

"హౌ గుడ్ ఈజ్ యువర్ హెలికాప్టర్ డ్రైవర్? మీరు చెప్పిన ప్రకారమయితే నా ఒక్కడి నైపుణ్యంతో పని జరగదు. మీ హెలికాప్టర్ డ్రైవరు నిపుణత్వం మీదకూడా మన పని విజయం ఆధారపడి వుంటుంది."

"అంటే?"

(సశేషం)

## " ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ "

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం ఉండేటట్లుగా ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్లకాగితంపై వ్రాసి, ఈ నెల 10 వ తేదీలోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబరు కూడా వ్రాయాలి. సభ్యులు కాని వారు తమ వ్యాఖ్యలతో 30 పైసలు స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/-లు నగదు బహుమతి పంపుతాము. ఫలితాలు వచ్చేనెల మాస పత్రికలో చూడండి. *

## " హోమ్ డెలివరీ "

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 7/-లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారా గాని మీ ఇంటిదగ్గర అంద జేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీల కోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరుగనవ సరం వుండదు. కాపీలు దొరుకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య ఎంతమాత్రం లేదు.

నెలనెలా వి.పి. తీసుకోవటం వీలుకాని వారు ఏడాది పైకము రు. 80/-లు ముందుగా పంపితే వారికి కాపీలు 'రికార్డెడ్ డెలి-వరీ' లో పంపగలము. *



# క్రేమిలో తమాషాలు

[ఈ శీర్షికలో ప్రచురించబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును. —ఎడిటర్]

## సుఖసంసారం ?

"అల్లుడూ! నా పాతికేళ్ళ సంసార జీవితంలో మీ అత్తయ్యా, నేను కనీసం ఒక్కరోజయినా పోట్లాడుకో లేదు."

"మావగారూ! మీరంత అన్యోన్యంగా వుండడానికి కారణమేమిటో చెప్తే, నేను కూడా అలాగే నడుచు కుంటాను."

"సింపిల్. మీ అత్తయ్య మాటకి నేనెప్పుడూ ఎదురు చెప్పలేదు."

—'అరుణ', బెంగుళూరు.

## " అంత్యప్రాస"

క్లాసులో పంతులమ్మ తెలుగు పాఠం చెప్తూ మధ్యలో "అంత్యప్రాస కుదిరేటట్లు యెవరైనా చిన్న పద్యం చెప్ప గలరా?" అని అడిగింది.

"ఎవరిమీదనైనా చెప్పవచ్చా మేడమ్?" ఒక కొంటె కుర్రాడు అడిగాడు.

"ఏదైనా పరవాలేదు" అంది.

"అయితే అమ్మగార్లు కలుస్తే ఏమవుతుందో చెప్తాను" అని ప్రారంభించాడు—

"ఇద్దరు కలిస్తే యిక్కట్లు
ముగ్గురు కలిస్తే ముచ్చట్లు
నలుగురు కలిస్తే సిగపట్లు!"

క్లాసంతా గొల్లుమంది.

—డాక్టర్ ప్రభాకర్, తిరుచ్చి-14.

## అలవాటు !

డాక్టర్ రామనాధానికి ఓ వింత అలవాటుండేది. పేషెంటు జబ్బుగురించి తన బాధలుచెప్తే, గతంలో అటువంటి బాధే తనూ అనుభవించినట్లు చెప్పేవాడు.

"నాకు టైఫాయిడ్ త్వరలోనే తగ్గిపోతుందా డాక్టర్?" అన్న పేషెంటుతో, "రెండేళ్ళక్రితం నాకూ టైఫాయిడ్ వచ్చింది. పది రోజుల్లో పూర్తిగా తగ్గిపోయింది" అనేవాడు.

"జ్వరంతో ప్రాణం పోతున్నట్లుంది డాక్టర్!" అన్న రోగితో "నాకూ మొన్న జ్వరం వచ్చింది. రెండు రోజుల్లో చప్పున తగ్గింది" అన్నాడు.

ఆ రోజు వడ్డీలపై అప్పులిచ్చే సేఠ్ చమన్‌లాల్ వచ్చి, "డాక్టర్‌గారు, నాకు యీమధ్య మతిమరుపు మరీ ఎక్కువయింది. రూపాయి యివ్వాల్సిన వాడికి పది రూపాయలు యిస్తున్నాను. పది రూపాయలు తీసుకొనే వాడి

దగ్గర ఒక్క రూపాయి తీసుకొంటున్నాను. ఏదైనా మంచి మందు యిప్పించండి!" అన్నాడు.

అలవాటు ప్రకారం డాక్టర్ రామనాథం, "రెండేళ్ళ క్రితం నాకూ యీ మతిమరుపు వుండేది సేఠ్‌జీ! జ్వరం మాత్రలు యివ్వడానికి బదులు విరేచనాల మాత్రలు యిచ్చే వాడిని. కుక్క కరిచిన అతనికి కలరా ఇంజెక్షన్ వేసే వాడిని. మతిమరుపు మనుషులకు సహజమే. మందులు రాసిస్తా. వాడండి. అదే తగ్గుతుంది" అన్నాడు.

అంతే! సేఠ్‌జీ నోరు సున్నాలా తెరుచుకుంది.

—N. విజేంద్రనాథ్ ప్రసాద్, అదోని.

# పెద్దయ్యాక—?

టీచర్:—ఒరే, రాము! నువ్వు పెద్ద అయ్యాక ఏం అవుతావురా?

రాము:—డాక్టర్ సార్!

టీచర్:—నళినీ! నువ్వు ఏం అవుతావు?

నళిని:—ఒక పిల్లకి తల్లిని సార్!

టీచర్:—ఒరే, గోపీ! నువ్వు ఏం అవుతావురా?

గోపీ:—నళినీ పిల్లకి తండ్రి నవుతాను సార్!

—కె. ప్రసన్న, బొంబాయి-71.

# దొంగ?

కుర్చీలో కునికిపాట్లు పడుతున్న డిటెక్టివ్ ఉండేల్రావ్ 'ఏమండీ!' అన్న కేకకి గబుక్కునలేచాడు. ఎదురుగా అతని

భార్య. "ఏమే! నువ్వేనా! ఎవరో క్లయింటనుకున్నాను ఎందుకా గావుకేకలు!" అన్నాడు.

"దొంగండీ! దొంగ. పెరట్లోకి దిగాడు. నేను గిన్నెలు తోముతూవుంటే, గోడమీద బేటరీవేశాడు" అంది భార్య గాబరాగా.

బోర్డుకట్టిన దగ్గరినుంచి, ఒక్క క్లయింటూ రాకపోవ డంతో విచారంగావున్న ఉండేల్రావు కుర్చీలోంచి ఒక్క గెంతు గెంతాడు. "ఏదీ! ఎక్కడా దొంగ క్షణంలో పట్టేస్తాను" అంటూ టేబుల్ మీదున్న బ్యాటరీలైటు, రూళ్ళ కర్ర పట్టుకొని, పెరట్లోకి పరిగెత్తాడు.

పెరడంతా అంగుళం అంగుళం గాలించేసాడు గాని దొంగ దొరకలేదు.

"పారిపోయాడు కాబోలు వెధవ" అనుకుంటూ, పట్టే ఛాన్సు పోయినందుకు విచారించి, చివరికి, "నేనిక్కడే వుంటానుగానీ, ఆ సామాన్లేవో వేగంగా తోమేయ్" అన్నాడు భార్యతో.

ఇంతలో మళ్ళీ బేటరీకాంతి గోడమీద పడింది. పెర డంతా జాగ్రత్తగా గమనిస్తున్న ఉండేల్రావు, "ఆ! దొరి కాడు దొంగ!" అని అరిచాడు.

"ఏదీ! ఎక్కడ?" అంది అతని భార్య.

"ఎక్కడా? నీ చేతిలో" అన్నాడు.

ఆమె చేతిలో ఆరోజే కొన్న కొత్త స్టీలు పళ్ళెం మెరు స్తోంది. దాని కాంతి బేటరీ కాంతిలా గోడమీద పడుతోంది.

తెల్లముఖం వేసింది అతని భార్య.

—ఏ. వీ. ఆర్. మూర్తి, శ్రీకాకుళం

